*Issued 10—4—1957.*




# ANDHRA LEGISLATIVE ASSEMBLY
## DEBATES

# OFFICIAL REPORT

### THURSDAY, THE 1ST MARCH, 1956

### VOLUME II - No. 4.

*CONTENTS*



PRINTED BY SREE KRISHNA PRINTING PRESS, KAKINADA
FOR THE SUPERINTENDENT,
ANDHRA GOVERNMENT PRESS,
KURNOOL.

PRICE, 6 Annas.

## ANDHRA LEGISLATIVE ASSEMBLY.

Thursday, the 1st March 1956.

The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.



## I. STARRED QUESTIONS.

*Discretionary grants made by the Chief Minister.*

414-

* 480 Q.—Sri N. C. SESHADRI :— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether any discretionary grants were made by the Chief Minister for the period 31st March, 1955 to 1st October, 1955; and

(b) if so, the details of such grants ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) No.

(b) Does not arise.

*Sandalwood in the Forests of Andhra State.*

415-

* 486 Q.—Sri N. C. SESHADRI :— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether there is any Sandalwood available in the forests of Andhra State;

(b) if so, the names of the forests where it is available;

(c) the quantity of Sandalwood extracted for the year 1954-55; and

(d) the amount realised by the sale of that produce for the above period ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

The information is furnished below :

(a) Yes, Sir.

(b) In the forests in Chittoor, Cuddapah and Anantapur.

(c) 30 tons, 17 qrs and 25 lbs.

(d) All the quantity extracted in 1954-55 was not sold in that year. At the sale held in July 1954 at Madanapalli Depot, a quantity of 8 tons 16 qrs 1 lb. was sold and it fetched a revenue of Rs. 30,844-8-6.

Sri N. C. SESHADRI :— అధ్యక్షా, - అటవీ సంపదలో sandal-wood అన్నది అతిముఖ్యమైన అంశంగా ఉంటోంది కాబట్టి గంధపుచెట్లను ఎక్కువగా పెంచేందుకు ప్రభుత్వం ఏమైనా సహాయం చేస్తుందా? ఈ sandal-wood నుంచి ఏదైనా oil extract చేసి అమ్మటానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఈ విషయంలో ప్రభుత్వం వారు శ్రద్ధతీసుకొని ఇంకాఎక్కువ చేయడానికి ప్రయత్నం చేస్తారు. ఎందుచేత నంటే ఇది చాల ఖరీదుగల వస్తువు. ఇది ఇంకా Mysore నుంచే మనకు రావలసి ఉన్నది. అందువల్ల సకల ప్రయత్నాలు చేస్తున్నాము. మదనపల్లిలో ఒక డిపో ఉన్నది. ఆ డిపోలో sandal-wood నంతా వేలము వేస్తారు. అక్కడనుంచి కొనుక్కొని కుప్పంలో ఈ oil ను ఇప్పుడు extract చేస్తున్నారు. మొదట సంవత్సరం లక్షరూపాయలకు పైగా వచ్చింది. ఆ తరువాత సంవత్సరం 80 వేల చిల్లర వచ్చింది. ఆ మరుసటి సంవత్సరం లక్షా 86 వేల రూపాయల వరకు వచ్చింది.

Sri S. RANGANATHA MUDALIAR :—Would the Government consider nationalising these sandal-wood factories. Would the Government take over these factories?

The Hon. Dr. B. GOPALA REDDI :—As far as I know, I think there is one factory at Kuppam that is privately managed. There are no complaints against private management. I do not know why the Government should interfere with the private sector.

Sri S. VEMAYYA :—ఈ sandal-wood plantation ను అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం వద్ద ఏదైనా పథకము ఉందా? ఇప్పుడు sandal-wood అనేకచోట్ల కొట్టివేయబడుతోంది. దానికి ఏదైనా రక్షణ చర్య ప్రభుత్వం తీసుకుంటుందా?

The Hon. Dr. B. GOPALA REDDI :— పథకం ఉన్నది. ఎక్కువ అభివృద్ధిచెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నారు. కాని దానికి సరైన వాతావరణం లేకపోయినట్లయితే మొక్కలకు చీడ పట్టి అంతా ఎండిపోతుంది. అందువల్ల జాగ్రత్తగా సరైన ప్రదేశాలలో నాటడానికి ప్రయత్నం చెయ్యాలి. Indis-criminate felling లేకుండా చెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నాము. ఇటీవలనే కుప్పం, పల్మనేరి వగైరా ప్రదేశాలలో కొన్ని సదుపాయములు చేసినాము.

Sri V. VISWESWARA RAO :— అధ్యక్షా, అటవీ సంపదైన sandal-wood వల్ల చాలా ఆదాయంవస్తున్నది. కృష్ణాజిల్లాలో కొంతమంది వ్యక్తులు private గా యీచెట్లను పెంచడం జరుగుతోంది. కృష్ణాజిల్లాలో ఉన్నటువంటి వాతావరణం యీచెట్లుపెంచడానికి అనుకూలంగా ఉన్నదని ఆచెట్లు పెంచిన వారియొక్క అనుభవరీత్యా తెలుస్తున్నది. కాబట్టి కృష్ణాజిల్లాలో కొండపల్లి forest ప్రాంతాలలో వీటిని అభివృద్ధిచేయడానికి పథకం ఏమైనా ఉన్నదా?

The Hon. Dr. B. GOPALA REDDI :— ఎక్కడెక్కడ వీలు ఉంటుందో అక్కడక్కడల్లా నాటడానికి తప్పకుండా ప్రయత్నం చేస్తాము. ఆ చెట్లు

పెరగడానికి moisture, దానికి తగిన climate కావలసి ఉంటుంది. అందుచేత ఎక్కడ suitable గా ఉంటుందో అక్కడల్లా అభివృద్ధి చేయడానికి ప్రయత్నిస్తాము.

Sri P. VENKATA SUBBAYYA :—ఈ forest coups కొట్టడానికి contractors కి ఇచ్చినప్పుడు, contract ఇచ్చిన coup లలో చందనం చెట్లున్నట్లయితే కొట్టకూడదనే నిషేధం ఏమైనా ఉందా?

The Hon. Dr. B. GOPALA REDDI :—అటువంటి కోట్ల చందనపు చెట్లు కొట్టకూడదనే నిషేధన ఉంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—గుంటూరు జిల్లాలో కొన్నాళ్ళపాటు ఈ చెట్లను వెయ్యమనిచెప్పి కొన్నిచెట్లు వేయించారు. ఆ తరువాత మరల వేయవద్దని చెప్పడానికి కారణం ఏమిటి? Protection సరిగా ఉండదనా? ఎందుచేత?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఎక్కడైతే protection సరిగా ఉండదని అనుకొంటారో అక్కడల్లా వెయ్యవద్దన్నాము దుబారా ఖర్చు అవుతుందని.

Sri PRAGADA KOTAIAH :— అసలు ఈ sandal-wood ఏ ఏ ప్రాంతాలలో పెంచడానికి అవకాశం ఉన్నదో పరిశీలన చేశారా? చేస్తే ఆ ప్రాంతాలు ఏవి?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఎక్కువగా చిత్తూరు జిల్లాలోను, మదనపల్లి, కుప్పం, పల్మనేరి వగైరా ప్రదేశాలలోను, కొద్దిగా అనంతపురం, కడపజిల్లాలలోను పెంచడానికి అవకాశం ఉన్నది.

### *Nomination of a new set of Directors to the District Co-operative Marketing Society.*

416

*839 Q.—Sri S. RANGANATHA MUDALIAR : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether it is a fact that the Government have issued Telephonic Instructions to the Registrar of Co-operative Societies (Andhra) to nominate a new set of Directors to the District Co-operative Marketing Society ; and

(b) if so, the reasons for the same?

The Hon. Sri D. SANJIVAYYA :

(a) : Presumably, the Member is referring to the Society in Chittoor.

No such instructions have been issued.

(b) : Does not arise.

*Tax for the double bullock carts at Nellore.*

417

*808 Q.—Sri B. SANKARAIAH: Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state:

(a) whether it is a fact that the Government are collecting tax at Nellore for the double bullock carts passing through Nellore town from the surrounding villages; and

(b) if so, why?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—

(a) The answer is in the negative.

(b) Does not arise.

Sri B. SANKARAIAH:— దారినిపోయే బండ్లకుకూడా Municipal వాళ్ళు tax వసూలుచేస్తున్నారు. ఈ బండ్లు నిలబడడానికి సౌకర్యము కలుగ జేయవలసిన భూమిలోకూడా పైరువేశారు. ఈ విషయాలన్నీ మంత్రిగారు నెల్లూరు వచ్చినపుడు వారికి తెలియజేశారు. దానిని ఇప్పుడైనా విచారణ జరిపిస్తారా?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—గౌరవసభ్యులు చెబుతున్నది సరైనదికాదని నా అభిప్రాయం. ఒక Municipal end నుంచి ఇంకో Municipal end కు వెళ్ళుతున్నప్పుడు, బండ్లు ఆగనపుడు దమ్మిడీ కూడా వసూలుచెయ్యడానికి వీలులేదు. వసూలు చెయ్యరు, అలా orders కూడా ఉన్నాయి. కాని బళ్ళు మాత్రం municipal limits లో ఉన్న cart stands లో ఉంటాయి. బండ్లలో ఏదైనా సరుకు వేసికొని వెళ్ళినప్పుడు సరకు దింపిన తరువాత బండ్లు cart stands లో దింపవలెగాని ఎక్కడో ఏరోడ్డు margin లోనో దింపితే cart stand fees వసూలు చేస్తారు. కాని, 'carts passing through the municipal limits' అయినప్పుడు collect చెయ్యటం లేదు.

Sri P. KODANDARAMAYYA:— బండ్లు town లో పోతూ ఉంటే collection చెయ్యము అన్నారు. అట్లా collect చెయ్యకుండా ఏదైనా ఉత్తర్వు దయచేస్తారా?

The Hon. Sri A. B. NAGESWARA RAO:— ఇదివరకే ఉన్నాయి ఆ ఉత్తర్వులు.

Sri B. APPARAO:— మంత్రిగారు చెప్పకమైతే చెపుతున్నారు. శ్రీకాకుళం చుట్టుపట్టున్న గ్రామాలలో, అదే జీవనంగా బ్రతికేవాళ్లు, బండ్లు పోవాలంటే శ్రీకాకుళంనుంచే పోవలసివస్తోంది. ఎందుచేతనంటే Srikakulam town centre లో ఉండడంవల్ల, cart stand దాకా వెళ్ళకుండా బండ్లు pass అవుతూ ఉంటే బండ్లు పట్టుకుని tax వసూలు చేస్తున్నారు. వారు పుచ్చుకొనేది 6 రూ॥లు. తిరిగివారు సంపాదించుకొనేందుకు ఎంతకాలం పడుతుందో గమనించి తగిన ఏర్పాటుచేస్తారా? ఈ విషయమై ఇదివరకే శ్రీకాకుళం town municipality వారికి complaint చేశారు. Government కు కూడా petition పెట్టి ఉన్నారు.

The Hon. Sri A. B. NAGESWARA RAO :—దారిన పోయేటప్పుడు ఒక మునిసిపాలిటీ లోనుంచి through గా పోతే వసూలు చేయడానికి వీలులేదు. వాటికి orders ఉన్నాయి. కాని Municipality వారు ఈ orders ను అతిక్రమిస్తే చర్య తీసుకోవడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నది. కాని పట్నానికి 3 మైళ్ళు, 4 మైళ్ళ దూరంలో municipal limits లో ఒక్క సంవత్సరంలో 60 రోజులున్నట్లయితే వారి దగ్గర half yearly tax వసూలు చెయ్యవచ్చని Act చెప్పుచున్నది. 15, 20 రోజులమట్టు town లో ఉన్నట్లయితే కొంత proportionate గా వసూలు చెయ్యాలని ఉన్నది. ఈ మధ్యనే ఇటువంటిది తాడిపత్రి municipal council లోకి వస్తే వారికి సగము వసూలు చేయవలెనని Government advise కూడా చేసిఉన్నది. Specificances ఏమైనా గాని ప్రభుత్వం notice లోకి వస్తే తప్పకుండా చర్య తీసుకొంటుంది.

Mr. SPEAKER :— It is an entirely new question from what was put in the paper. Government is not collecting.

Sri S. VEMAYYA :— గవర్నమెంటు collections కాదు. మునిసిపల్ area లో.

Mr. SPEAKER:—The question is : "whether it is a fact that Government are collecting the tax at Nellore for the double bullock carts passed in and through Nellore."

Sri S. VEMAYYA :— ఇప్పుడు మంత్రిగారు specific instance ఏదైనా తీసుకువస్తే, చర్యతీసుకొంటామని అంటున్నారు. ముఖ్యంగా నెల్లూరులో నామట్టుకు నేనే, బళ్ళు నిలబెట్టిఉంటే డబ్బుకట్టి విడిపించాను. ఈవిషయం గురించి మంత్రిగారికి ఒక letter వ్రాస్తే దాన్ని acknowledge చేసి, specific గా ఒక report ఇవ్వమని మళ్ళీఅడిగారు. కాబట్టి దీన్ని గురించి ప్రత్యేకంగా ఒక report నెల్లూరునుంచి call for చేసి, దీన్ని దర్యాప్తుచేయించి, అటువంటివి జరుగకుండా చేయుడానికి ఆలోచిస్తారా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ప్రయత్నం చేసినాము. Specific instance కూడ చెప్పుతున్నాను. తాడిపత్రి తాలూకాలో, చిన్నపోలమందూరు అనే గ్రామంవారినుంచి రు. 4—1—0 లు వసూలు చేస్తూఉంటే, ఆ గ్రామములోనివారు దాన్నిగురించి petition పెట్టినమూలాన తాడిపత్రి మునిసిపాలిటీకి advise చేశాము. ఆమునిసిపాలిటీలో గనుక 15, 20 రోజులు బండి తిరిగినట్లయితే సగము fees వసూలుచేయవలెనని చెప్పాను.

Sri A. C. SUBBA REDDI:– అధ్యక్షా, మంత్రిగారు సెలవిచ్చినట్లు, మునిసిపాలిటీలో పనిఉండి వచ్చి, వ్యాపారము కొరకు సామానులు తీసుకువచ్చి bus stand కు పోలేదు అనేకారణంచేత రోడ్డుమీదనిలిపి సరుకులు దింపేటప్పుడు ఎక్కడైనా collect చేసి ఉంటారేమోగాని నేరుగాపోయేటప్పుడు చేసిఉండరని నా అభిప్రాయము. నెల్లూరు మునిసిపాలిటీ ఛైర్మన్‌గా నేను ఈ explanation యిస్తున్నాను.

Mr. SPEAKER :— Ask a question. Do not seek the opinion.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— గౌరవసభ్యులకు ఒక మనవిచేస్తున్నాను. నా అనుభవములోనికి వచ్చినది కూడా చెప్పుతున్నాను. క్రిందటి ప్రభుత్వంలో, తిమ్మారెడ్డిగారు ఉండగా, ఇటువంటి instances ప్రభుత్వపు నోటీసుకు వచ్చినప్పుడు, specific గా ఒక G. O. issue చేసినారు. ఆ G. O. issue చేసినతరువాత collect చేయకుండాలేదు. ఇప్పటికైనా, specific instances వస్తే తప్పకుండా పరిశీలించుకోడానికి సిద్ధంగావున్నామని చెప్పుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— దీనికి half hour debate పెట్టుకొంటే బాగుంటుందండి.

Mr. SPEAKER :— Where is the need ?

Sri PILLALAMARRI VENKATESWARLU :— అనేక మునిసిపాలిటీలలో ఈవిధంగా జరుగుతున్నాయి. విజయవాడ మునిసిపాలిటీలో కూడ జరుగుతున్నది. అవన్నీ ప్రభుత్వదృష్టికి తీసుకురావలసిన అవసరమున్నది.

Mr. SPEAKER :— We shall consider later.

Sri V. VISWESWARA RAO :— అధ్యక్షా, ఇప్పుడు మంత్రిగారు ఒక G. O. quote చేసి, 15 రోజులుఉంటే, సగము వసూలుచేయాలని, 60రోజులు ఉంటే పూర్తి వసూలుచేయాలని, దానిద్వారా వెళ్ళితే వసూలు చేయవలసిన అవసరములేదని చెప్పుతున్నారు. అయితే ఈ విభజన ఎలాచేస్తారో, ఎలాతెలుసుకొంటారో అర్థంకావడంలేదు. బండివచ్చింది, ఊరిలోకిపోయింది, ఆ ఊరిద్వారా వెళ్ళిపోయింది. ఎలా గమనిస్తారు? Tax వసూలుచేసేవిషయములో, అవి సరుకులు దించేటప్పుడు వసూలుచేస్తారా, లేక ఆబండి stand లోకి వచ్చినప్పుడు వసూలు చేస్తారా లేక వెళ్లిపోయేటప్పుడు వసూలుచేస్తారా? దీనికి సరియైన definitions లేకపోతే, బండి town లోనుంచి వెళ్లితే, వసూలుచేయవద్దు చెప్పినంతమాత్రానఅక్కడ వసూలుచేయకుండా ఆపడంలేదు. ఏబండిగాని ఆ town నుంచి సంవత్సరంలో ఒక రోజు వెళ్లినా, దానికి పన్నులుచేస్తున్నారు. కనుక మంత్రిగారు దీన్ని స్పష్టంగా వివరించకుండా వసూలుచేయవద్దని ఒక G. O. చేసినంతమాత్రాన ప్రయోజనం లేదనేసంగతి గమనిస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—బండ్లు నిలవడానికి specific గా cart stands అని ఉన్నాయి. ఈ tax collection work, contract కు ఇస్తున్నాము. contractor రశీదు ఇచ్చి ఈ tax వసూలుచేయవలసియుంటుంది. ఏదైనా illegal గా, unlawful గా collect చేస్తున్నట్లయితే అక్కడ ఉన్నటువంటి Commissioner యొక్క దృష్టికి తీసుకొనివస్తే, ఆ commissioner చర్య తీసుకొంటారు. ఈసందర్భంలో ఇంకొకటి చెప్పవలసియున్నది. రెండు, మూడు మైళ్ల దూరములో ఉన్న బండ్లుమాత్రము మునిసిపాలిటీలోకి వస్తే Municipal Act లో 99 వ సెక్షను (1) (2) క్లాజుల క్రింద వాటికి వసూలు చేయడానికి హక్కు ఉన్నది. అందుకనే అటువంటి వాటికి వసూలు చేస్తున్నారు.

Sri PILLALAMARRI VENKATESWARLU:— ఒకవేళ బండ్లు cart stand కు పోకుండా ఎక్కడికైనాపోయి సరుకులు దింపుకొంటే, అక్కడ

వసూలుచేస్తున్నారేమో అని చెప్పారు. అసలు ఆవిధంగా చేయడానికి వీలున్నదా? బండ్లు cart stand కు పోతేనే వసూలుచేయవలెగదా, cart stand కు పోకుండా ఇంకెక్కడైనా పోతే వసూలు చేయడానికి హక్కు ఉన్నదా అని అడుగుతున్నాను,

The Hon. Sri A. B. NAGESWARA RAO:- అసలు cart stand కు పోకపోతే, prosecution కూడ చేయడానికి అవకాశమున్నది. Cart stand లో బండి ఆపాలి. ఆపకపోతే prosecution చేసి డబ్బు వసూలు చేసుకొని వదలుతున్నారు.

Sri K. SUBBA RAO :—చట్టప్రకారము ఆవిధంగా వసూలు చేయ కూడదని చెప్పుతున్నారేగాని, ప్రతిదినము జరుగుతున్నటువంటి అక్రమాలు గమనించినట్లులేదు. డబ్బు ఇవ్వనిదే బండ్లను లోపలకు రానివ్వకుండా ఉన్నాయి మునిసిపాలిటీలు. మునిసిపాలిటీకి కావలసివస్తే బండికి 0—1—0 ప్రకారం వసూలు చేయవచ్చును. ఇప్పుడు బండ్లవాళ్ళను చాలా కష్టపెడుతున్నారనే సంగతి మంత్రిగారు ఆలోచిస్తారా ? రెండవది, ఈ మునిసిపాలిటీలు బండ్లపన్ను వసూలు చేసేది వేలము వేస్తారు ఆ contract ఎవరో తీసుకొని బండ్లవాళ్లను అనేక బాధలుపెట్టి వసూలు చేస్తున్నారనే సంగతి మంత్రిగారికి తెలుసునా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—మీరుచెప్పిన సంగతులన్నీ నాకుతెలుసును. క్రిందటి మంత్రివర్గములో definite గా orders ఇచ్చారు. అవి వీలైనంతవరకు అమలుజరిగాయి. ఇక్కడకూడ గౌరవసభ్యులు సూచనలు ఇచ్చారు. అవన్నీ దృష్టిలోపెట్టుకొని తప్పకుండా పురపాలకసంఘాలకు తగిన orders పంపించి, అవి అమలుజరుగునట్లు చూస్తాము.

Mr. SPEAKER :— There is an assurance given by the Minister, that he would take steps to curb the mal-practices.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— బండ్లు ఊర్లోకి పోయినందుకు తీసుకొన్నారా లేదా అనే సమస్యకాదు. అసలు ఊర్లోకి enter అయ్యేటప్పుడే gate లో కూర్చొని, రశీదుయిచ్చి, డబ్బుకట్టి ముందుకు వెళ్లమని అంటున్నారు. దాన్నిగురించి ఏమిచెబుతారు ?

The Hon. Sri A. B NAGESWARA RAO :—ఆసంగతికూడా నాకు తెలుసు. Contractor యొక్క rights కూడ కాపాడవలసినపూచీ మునిసిపాలిటీకి ఉన్నది. బండ్లు ఏవి ఎక్కడెక్కడకుపోతాయో, ఏది cart standకు పోతుందో ఏది ఎక్కడ సరుకులు దింపుకొంటుందో, ఇవన్నీచూడడానికి ఒక్కొక్క బండివెనుక ఒకమనిషినిపంపించవలసివస్తే, ఎంతమందిని పంపించగలడు. అది ఎట్లు సాధ్యమవుతుంది ? ఎవరూ ఆవిధంగా పంపించలేరు, ఆపనిచేయలేరు. కాబట్టి రెండుప్రక్కలా ఆలోచించి, న్యాయముచేయాలి. కనుక గౌరవసభ్యులు చెప్పిన సూచనలన్నీ తప్పకుండా ఆలోచించి చేయగలిగిందిచేస్తామని మనవిచేస్తున్నాను

*Land brought under Japanese cultivation.*

418-

* 206 Q.—Sri B. RAMAKRISHNA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state ;

(a) the total acreage of land that has been brought under Japanese cultivation; and

(b) the encouragement that the Government are giving to the ryots regarding Japanese cultivation ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) 2,60,388 acres.

(b) In order to encourage the ryots to adopt the Japanese method of cultivation, the Government have sanctioned a sum o Rs. 17,860/- for the purchase of 1,000 rotary hoes, with a view to hire them to ryots at a concessional rate of Re. 0-2-0 per day. Another sum of Rs. 20,170/- has also been sanctioned for the procurement of 1,000 push hoes and 3,000 hand rakes for sale to ryots. Further besides intensive propoganda by the departmental staff, fertiliser demonstrations are arranged in the holdings of ryots adopting Japanese method of paddy cultivation.

Sri P. NARASIMHAPPA RAO :— అధ్యక్షా, ఈ జపాను cultivation గురించి ఇక్కడ మన రైతులే కొంతవరకు పరిశీలన చేస్తున్నారు. కాని, మన గవర్నమెంటు కొంతమంది రైతులను select చేసి, వారికి జపానులో అక్కడ cultivation ఏమో స్తరుగా జరుగుతున్నదో చూపించి, cultivation ఇంకా హెచ్చుగా improve చేయడానికి అవకాశాలు కలుగజేస్తారా? గవర్నమెంటుకు అటువంటి ఉద్దేశము ఉన్నదా?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఇది ఆలోచిస్తామని చెప్పితే Assurances Committee కి పోతుందేమోనని భయముగా ఉంది.

Sri A. CHITAMBARA REDDI :— అధ్యక్షా, ఈ జపాను వరిసాగు పద్ధతి ఇంకాఎక్కువ అభివృద్ధికావాలంటే, ఇపుడు ప్రభుత్వము supply చేసేటటువంటి Rotary Hoes, Push Hoes, వెయ్యి మాత్రము చాలడంలేదు. ఇవి రైతులకు దొరకడంలేదు. కనుక ఇవి ఇంకావిరివిగా supply చేయడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఇంకా ఎక్కువ demand ఉంటే ప్రయత్నం చేస్తాము.

Sri K. SUBBA RAO :— జపానులో ఈపద్ధతిని ఇండియా వరిసాగు పద్ధతి అంటున్నారు. ఇక్కడ మనము జపాను పద్ధతి అంటున్నాము. ఈ విధంగా ఎందుకు అంటున్నారో తెలుసునా మంత్రిగారికి?

The Hon. Dr. B. GOPALA REDDI :—It is the attraction of the opposites.

Sri S. VEMAYYA :— Japan method of cultivation చేసేటటువంటి రైతులకు free గా manure supply చేసేటటువంటి వసతిగాని, మరేదైనా వసతులు ఉన్నాయా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—కొన్ని కొన్ని సదుపాయాలు ఉన్నాయి.

(a) reduction in seed rate to enable growth of robust seedlings.

(b) use of good and tadet seed and line planting, and ranking and all that.

ఈ విధంగా కొన్ని కొన్ని సదుపాయాలు వాళ్లకు ఇస్తున్నారు.

Sri M. NAGI REDDI :— మంత్రిగారు సమాధానమిస్తూ, సుమారు రెండులక్షల పైచిల్లర ఎకరాలలో జపానుపద్ధతిని వరిసాగుచేయడం జరిగిందని చెప్పారు. అలాంటప్పుడు ఉత్పత్తి ఎంత పెరిగిందో, దానియొక్క అంచనాఏమిటో చెప్పగలరా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— బహుశా 25 నుంచి 30 పరసెంటువరకు ఉత్పత్తి పెరిగిందని అనుకుంటాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, ఉత్పత్తి ఎంతపెరిగిందో తెలుసుకోవడానికి బహుశా ఒక చిన్న patch of land అంటే ఏ రెండు, మూడు సెంట్లలో పెరిగినసాగునో తీసుకొని, దానిమీద ఎకరానికి యింత అయిందని calculate చేసి చెబుతున్నారా ? లేకపోతే సాగుచేసిన అన్ని ఎకరాలలోని పంటతీసుకొని, ఎంతఆదాయమయితే, అంతఅయిందని చెబుతున్నారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—అది calculate చేసేదిరెండు సెంట్లు, మూడు సెంట్లలోని పంటకాదు. అదియింకా ఎక్కువగానే 10,15 సెంట్లవరకు తీసుకుని calculate చేసి తెలుసుకోగలుగుతున్నాము. (Laughter) అంటే సభ్యులు అడిగినదానిలో తప్పేమీలేదు. ఇటువంటి sample cutting వల్లనే accurate గా తెలుస్తుందని పెద్ద పెద్ద statisticians చెబుతున్నారు. పెద్దపరియాలోనిది బందోబస్తుచేసి calculate చేసేదానికంటే, యీ sample cutting యీ 15 cents లోది కాకుండా, యింకా కొంచెము పెద్ద ఏరియాలోనిదే తీసుకునిచూస్తే, ఎక్కువ accurate గా తెలుస్తుందని అంటారు.

Sri. V. VISWESWARA RAO :— అధ్యక్షా, జపానువరిసాగుపద్ధతి చెరువుక్రిందభూములలో ఉపయోగపడుతుందని, మాగాణిప్రాంతాలలో, అంటే ముఖ్యంగా కృష్ణా, గోదావరి, పెన్నా డెల్టాభూములలో యిది ఉపయోగించలేదని, చాలానష్టమువచ్చిందని ప్రభుత్వానికి రిపోర్టులు వచ్చినవా ? ప్రత్యేకించి కృష్ణాజిల్లా రైతులనుంచి రిపోర్టులు ఏమైనావచ్చినవా ? ఇవిగాక యింకా వేరే క్రొత్తపద్ధతులు ఏమైనాఉన్నవేమో పరిశోధన చేయిస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— జపాను cultivation వల్ల delta తాలూకాలలో రైతులు నష్టపడ్డారని నేను యిప్పుడే వింటున్నాను. కాబట్టి యీప్రశ్నకు జవాబులేదు.

Sri L. LAKSHMANA DAS :— Japan cultivation వల్ల అధిక పంట, అధికలాభమువస్తుందని ప్రభుత్వము గమనించినప్పుడు రైతులు మంచి

వాటిని పండించటానికి experts ద్వారా training యిప్పించటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:— అక్కడక్కడ demonstrations చేస్తున్నారని నేను యిందాక నా జవాబులోనే చెప్పానుకదా. ఈ cultivation సాగేచోట్లలో ఎవరినో రప్పించి, demonstration చేయించి చూపించుచున్నారని అంటున్నారు.

Sri S. VEMAYYA:- Japanese method of cultivation చేసేటప్పుడు, మనదేశమునుంచి జపానుకు ఎవరినైనా పంపించి, అక్కడ జరిగేపద్ధతి బాగా తెలుసుకొని రావటము, ఆ పద్ధతిని యిక్కడ మనదేశములో అమలు జరపడము జరుగుతున్నదా ? లేకపోతే, జపానువారే యిక్కడికి వచ్చి వారు అవలంబించే విధానము చెప్పడము అనేది ఏదైనా ఉన్నదా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—బహుశ ఇండియా గవర్నమెంటువారే ఎవరినో పంపించినట్లుగా నాకు జ్ఞాపకము. ఇండియా గవర్నమెంటువారు, ప్లానింగు కమిషనువారు యీ విషయములో చాలా శ్రద్ధతీసుకుని అన్ని ప్రాంతాలకు తాకీదులు యిస్తున్నారని గూడ వింటున్నాను.

Sri T. PAPA RAO :— అధ్యక్షా, జపాను వరిసాగు చేసేపద్ధతి తెలుసుకోటానికి ప్రభుత్వము తరఫునగాని, యీ ఎసెంబ్లీతరఫునగాని ఎవరినైనా జపానుకు పంపించటానికి ప్రభుత్వానికి ఉద్దేశ్యము ఉన్నదా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— అటువంటి సదుద్దేశ్యము ఏమీలేదు.

*Area under Japanese method of cultivation in the State for Fasli 1364.*

**419-**
* 489 Q.—Sri N. C. SESHADRI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the area under the Japanese method of cultivation in the State for the Fasli 1364 ;

(b) whether the Government are providing the ryots with demonstration facilities in the above method of cultivation on any of the farms in the State ; and

(c) if so, what are those farms where such demonstration facilities are provided ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) 49,452 acres.

(b) Yes

(c) 1. Agricultural College Farm, Bapatla.
2. Agricultural Research Station, Samalkota.
3. Agricultural Research Station, Maruteru.

4. Sugarcane Research Station Anakapalle.
5. Rice Research Station, Buchireddypalem.
6. Panagal Demonstration Farm, Kalahasti.
7. Agricultural Research Station, Nandyal.

Sri VIJAYA BHASKARA REDDI :— అధ్యక్షా, మంత్రిగారు సమాధానమిస్తూ ఏవో demonstrations జరుపుతున్నామని చెప్పారు. ఇందాక చదివిన యీ ఏడు demonstration farms చాలవు గనుక, యీ విధంగా చేసేబదులు, మేస్త్రీలచే ఆ యా గ్రామాలకు వెళ్ళి demonstration చేసి చూపించేటట్లు ఏర్పాటుచేస్తే, రైతులకు అది ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుంది. ఈవిషయము ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— తప్పకుండా ఈవిషయములో Agriculture Department వారు చాలా శ్రద్ధతీసుకుంటున్నారు. ఈవిషయము ఋజువుకావటానికి, యిప్పుడు పెరిగిన average వల్లనే తెలుస్తున్నది.

| | | |
|---|---|---|
| 1953-54 లో | 6,900 | ఎకరాలు. |
| 1954-55 లో | 49,000 | ,, |
| 1955-56 లో | 2,04,000 | ,, |

దీనినిబట్టి 49 వేల ఎకరాలనుంచి 2 లక్షల నాలుగువేలవరకూ పెరిగిందంటే, department వారు యింతవరకూచేసిన కృషివిమిటో తెలుస్తూనేఉన్నది. ఇంకా ఎక్కువగా acrage ను పెంచడానికిగూడ ప్రయత్నము చేస్తున్నారు.

Sri N. C. SESHADRI :— ఇటీవల యీ జపానుపద్ధతి అన్ని జిల్లాలలోను ఎక్కువగాఉన్నది. మంత్రిగారు చెప్పిన Farms ప్రతిజిల్లాలోను ఒక్కటి అయినా ఏర్పాటుచేయటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— ఈవిషయమును Agriculture Demand వచ్చినప్పుడు మాట్లాడవచ్చును.

Sri A. C. SUBBA REDDI :— అధ్యక్షా, మన పాతమూలు వరిసాగుకు, జపాను వరిసాగుకు, చాలా తేడాఉన్నట్లు ప్రభుత్వానికి తెలుసునా?

The Hon. Dr. B. GOPALA REDDI :— నాకన్నా సుబ్బారెడ్డిగారికే బాగా తెలిసిఉంటుంది.

Sri N. VENKAIAH :— జపాను వరిసాగుచేసే రైతులను ఒకచోట సమావేశపరచి, యీసాగువల్ల వచ్చేలాభనష్టములను తెలుసుకోటానికి ప్రభుత్వము ఏర్పాటుచేస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— లాభాలసంగతి తెలుసుకోవాలంటే తెలుసుకొంటాను. నష్టాలసంగతి నాకుచెప్పటం ఎందుకు ?

Sri V. VISWESWARA RAO :—ఇంతకు ముందు మంత్రిగారు సమాధానమిస్తూ డెల్టా యేరియాలో యీ జపాను వరిసాగు బాగా ఉపయోగపడలేదనే వార్త తెలియదని సెలవిచ్చారు. కాని మన రాష్ట్రములో రైతులు అధిక

[illegible] మెట్టప్రాంతాల వారికి వెళ్లాయని [illegible] జిల్లా ప్రాంతాలలో demonstration centres [illegible] కాబట్టి ప్రత్యేకించి కృష్ణా జిల్లాలోనైనా [illegible] centres ఏర్పాటు చేయుస్తారా? ఇంతేకాకుండా జిల్లా ప్రాంతాలకు [illegible] సప్లయిచేయటానికి ప్రభుత్వము శ్రద్ధ వహిస్తుందా?

The Hon. Dr. B. GOPALA REDDI :—కృష్ణా జిల్లాలో ఒక Agriculture farm [illegible] కోరేది? అల్లా అయితే, మారు [illegible] పంపిస్తాను.

Sri S. VEMAYYA :—Japan method of cultivation ను బట్టి ఒక ఎకరముకు [illegible], [illegible], దాని data అంతా ప్రభుత్వము వద్ద ఉంటే [illegible]? ఆ data లేకపోతే దాన్ని తెప్పించడానికైనా ఆదేశాన్ని పంపిస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI :— ఇప్పుడు యిక్కడ ఆ data లేదు. వేమయ్యగారు దీనినిగురించి వేరే ప్రశ్న వేస్తే, జవాబు తప్పకుండా తెప్పించి యిస్తాను.

*Growing of Japanese grass for fodder.*

420-

* 422 Q.—Sri S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Government have received any instructions from the Government of India to grow Japanese grass for fodder; and

(b) if so, the places where such grass is grown?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) No, Sir.

(b) Does not arise.

Mr. SPEAKER : Questions Nos. 421 and 422 will be taken up together.

*Neera Co-operative Societies in the State.*

421—

* 633 Q.—Sri PRAGADA KOTAIAH : Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) the number of Neera Co-operative Societies started after 1-7-1955 as per G. O. No. 1466 Revenue Department dated the 30th June 1955 ; and

(b) whether licences have been granted to all of them to draw Neera?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

*Clause (a)* :

In pursuance of the orders issued in G. O. Ms. No. 1466, Revenue dated 30-6-1955, permission has so far been accorded to register 34 neera and palm-jaggery co operative societies of which 15 societies have been registered.

*Clause (b)* :

27 licences to sell neera were issued to Vemavaram Neera and Palm-jaggery Society in Tuni Taluk in East Godavari District. Action is being taken by the Deputy Registrars concerned for the issue of licences in other places in consultation with the concerned Collectors.

"*Formation of Neera Societies*"

422—

* 557 Q.—Sri A. BHAGAVANTHA RAO: Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state:

(a) Whether there are proposals with the Government for the formation of "Neera Societies"; and

(b) whether the Government have issued instructions for the formation of "Neera Societies" and if not, the reasons therefor?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

*(a) and (b)* :

The Government have recently sanctioned the registration of 50 new palm-jaggery manufacturing co-operative societies in the State during the financial year 1955-56. So far proposals for the formation of 34 societies have been approved by Government. In view of the delay involved, the Government have issued instructions to the Registrar, the Board Member and the Inspector General of Police to see that the formation of the remaining 16 societies is completed before 31-1-1956 itself.

The delay in the registration of societies is due to the delay in obtaining the consent of the, Police or Prohibition (Enforcement) Department for the formation, as those Departments are in charge of "Enforcement" work.

ఇందులో ఒకవిషయము మనవిచేస్తున్నాను. ఈప్రశ్నలకు జవాబు తయారు అయ్యేసమయానికి 34 సొసైటీలు రిజిష్టరు అయినవి. నిన్నసాయంత్రమునకు 42 సొసైటీలు రిజిష్టరు అయినవి.

Sri PRAGADA KOTAIAH :— సొసైటీలు రిజిష్టరుచేయమని ఎన్ని దరఖాస్తులు వచ్చినవి ? రిజిష్టరుకాకుండా యింకా ఎన్ని నిలవ ఉన్నవి ? ఇది గాక licences యిచ్చేవిధానములో prohibition enforce చేస్తున్న departmental heads ను consult చేసినదువాతనే, licences యివ్వవలెనని చెప్పినందువల్ల, యీ licences యివ్వడము జరగడంలేదు. సొసైటీలు రిజిష్టరు చేయమని అంటే, licences యివ్వటానికి నిర్ణయించినప్పుడే, రిజిష్టరు చేయడమనేది జరగవలసిఉన్నది. కాబట్టి రిజిష్టరుచేసిన సొసైటీలకు అన్నింటికీగూడ licences యిస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :–గౌరవసభ్యులు చెప్పిన విషయము కొంతవరకు నిజమే. కాని licences యివ్వటానికి prohibition enforce చేసే departmental head ను consult చేయవలసిఉన్నది. Enforce చేసే department యిదివరకు prohibition department, యిప్పుడు పోలీసు డిపార్టుమెంటు.గనుక వారివద్దనుంచి జవాబురావటములో ఆలస్యముజరుగుతున్నది. ఈమధ్యనే Inspector-General of Police కు Registrar of Co-operative Societies కు సొసైటీలు అన్నిగూడ వీలుఅయినంత త్వరలో రిజిష్టరుచేయమని instructions ప్రభుత్వం పంపించింది.

Sri P. NARASIMHAPPA RAO :— అధ్యక్షా, ఈసొసైటీలు రిజిష్టరుచేయడమనేది అంతా ఒక show గానూ, ఒక నాటకముగాను కనబడుతున్నది. కాబట్టి యీవిధంగా licenses యివ్వడమనేదికాకుండా, అన్నిచోట్లను యీతచెట్లనుండి కల్లుగీసుకోటానికి free గా పర్మిషను యివ్వడమనే ఉద్దేశ్యము ఉన్నదా ? లేకపోతే ప్రభుత్వము యింకా యీ నాటకమును ఆడటానికే ఉద్దేశిస్తున్నదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:— ప్రభుత్వము యీవిషయములో చేసేది నాటకమా, నిజమేమిటో గౌరవసభ్యులకే తెలియాలి. ప్రభుత్వము నిజంగాను, హృదయపూర్వకముగాను ex-toddy tappers కు సహాయము చేయాలనే ఉద్దేశిస్తున్నది. కాని వాళ్ళకు యిచ్చిన licences ను దుర్వినియోగముచేస్తే మట్టుకు, అవి cancel అవుతాయనిమాత్రము గట్టిగా చెబుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అసలు రిజిష్టరు అయిన సొసైటీలకే licences యివ్వడములేదు. Licences యిచ్చిన సొసైటీలు అన్నిగూడ ప్రతిసంవత్సరము renew చేయవలసివస్తున్నది. అందువల్ల యీవిధముగా కాకుండా, రిజిష్టరు అయిన సొసైటీలన్నిటికీని licences యివ్వాలని, తరువాత ప్రతిసంవత్సరము licences renew చేయవలసిన అవసరములేకుండా చేయటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—Societies ను register చేయుటములోనూ, licenses యివ్వటములోనూ ఆ యా జిల్లాల కలెక్టర్లను సంప్రదించి, Deputy Registrar of Co-operative Societies గారే చర్యతీసుకుంటున్నారు. ఇంతవరకు రిజిష్టరుకాని సొసైటీలన్నిగూడ వీలైనంత త్వరలో రిజిష్టరుచేయడానికి ప్రభుత్వము చర్యతీసుకుంటున్నది.

Sri PRAGADA KOTAIAH :— నా ప్రశ్నకు సమాధానం రాలేదు. అసలు ఎన్ని దరఖాస్తులు వచ్చాయి, వచ్చిన దరఖాస్తులలో ఎన్నింటినైతే register చేశారు. 44 మాత్రమే rigister చేశామంటున్నారు. ఇంతవరకు ప్రభుత్వం మీకు వచ్చిన దరఖాస్తులెన్ని ? ఈ G. O. ప్రకారం register చేయవలసిన సొసై టీలు ఎన్ని ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—Registrar of Co-operative societies 84 సొసైటీల వరకూ recommend చేశారు. కాని Enforcement Department మాత్రం నాదగ్గరున్న answer ప్రకారం 34 recommend చేశారు. కాని నిన్నటి వరకూ అట్టివి 42.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఆ నల్బైరెండింటికి సొసైటీలకూ licence లు ఇచ్చారు ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:-Licence లు register అయిన అన్నిటికీ ఇవ్వడానికే Deputy Registrar లు, వారు Collectorలతో సంప్రతించి ఇస్తున్నారు.

Sri A. BHAGAVANTHA RAO :—ఇప్పుడు మంత్రిగారిచ్చిన సమాధానంలో నీరా సొసైటీలు ఏర్పాటు చేయడంలో, enforcement department ను consult చెయ్యాలి. వారి అనుమతిమీదనే society లు form చేస్తున్నామని అన్నారు. అల్లా అనడంలో నాకొక అనుమానం వస్తోంది. గవర్నమెంటు Policy ని enforce చేయడానికి enforcement department ఉన్నదా లేక enforcement department directions ని Government carry out చేస్తుందా ? ఈ conflict of interest ఎందుకు వచ్చింది ? ఇది గవర్నమెంటు Policy కి విరుద్ధమైన పద్ధతికాదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—ప్రభుత్వానికి తమరు చెప్పిందంతా తెలుసును. Society లను register చెయ్యాలా లేదా అనే విషయం ప్రభుత్వమే finalise చేస్తుంది. ఇదివరకు మామూలుగా ఆచారం ఏమిటంటే ప్రస్తుతం ఉన్నచట్టం ప్రకారం ఏఏ society లను register చెయ్యాలి, ఎవరెవరికి licence లు ఇవ్వాలనేది Deputy Registrar of Co-operative Societies enforcement department ను consult చెయ్యాలి. ఆ enforcement department recommendation వచ్చిన తరువాత, వారు recommend చేసిన వాటికి special staff ని Deputy Registrar of Co-operative Societies పంపించాలి. ఆ Co-operative Societies పంచాయితీ దార్లు వారి వారి యొక్క applications తీసుకుని వారు recommend చేసి మళ్ళీవీరికి ఇవ్వాలి. అప్పుడు Collector లతో సంప్రదించి Deputy Registrar లు licence లు ఇవ్వాలి. ఇదీ పద్ధతి. ఈ పద్ధతిలో కొంచెం ఆలస్యమవుతుందనే అభిప్రాయంతోనే ఈ మధ్యనే Revenue Board కి Inspector-General కి కూడా అవి పరిశీలించి వీలైనంత త్వరలో చేయవలసిందని ప్రభుత్వంసలహా పంపించింది.

Sri C. P. THIMMA REDDI :— అధ్యక్షా, నీరా పులిస్తే కల్లవుతుందని గవర్నమెంటువారికి తెలుసా ? తెలిసి ఉంటే దాన్ని కల్లుగా మారకుండా ఉండేటట్లు ఏమైనా ఏర్పాటు చేయడానికి పూనుకుంటున్నారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:-నీరా కొన్నిగంటలుంటే కల్లుగామారుతుందని తెలుసు. అందుకనే అదిమారకుండా చేయడంకోసమే దాని లోపల సున్నం రాయాలని దానికి procedure ఉన్నది. ఆ procedure అంతా department వారు చూస్తున్నారు. దానిమీద proper supervision ఉండాలి. అవన్నీ సక్రమంగా జరిగినప్పుడే ఆ society లుంటాయి. సక్రమంగాలేకపోతే society లు cancel అవుతాయి.

Sri N. K. LINGAM :— అధ్యక్షా, ఈ నీరాకు ప్రత్యేకమైన society లు పెడుతున్నారే. ప్రస్తుతం అనేక స్థలాలలో Multi Purpose Co-operative Society లున్నాయి. వాటికి ఈనీరా తీయడానికి licence ఇచ్చుటకు ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri A.B. NAGESWARA RAO:-ఆ society లు application పెట్టి మేమేచేస్తామని చెబితే ప్రభుత్వం ఆలోచిస్తుంది.

Sri M. NAGI REDDI:-మంత్రిగారు సమాధానముచెబుతూ Registrar గారు 84 recommend చేశారు. అందులో 34 వచ్చాయని చెప్పారు. అసలు మొత్తం ఎన్నివచ్చాయని ప్రగడ కోటయ్యగారడిగితే దానికి సమాధానంరాలేదు. మొత్తం ఎన్ని applications వచ్చాయి. అందులో ఎన్ని recommend చేశారని అడిగారు.

The Hon. Sri A. B. NAGESWARA RAO:-వచ్చిన applications అన్నీచదవమంటే చదువుతాను. సాదర 22 వ తేదీ list ఉంది.

Sri PRAGADA KOTAIAH:—Registrar గారు recommend చేసి నటువంటి 84 కేసులలో నూ register చెయ్యడానికి ప్రభుత్వానికున్న అభ్యంతరం ఏమిటి ? డిపార్టుమెంటల్ హెడ్డే చెప్పిన తరువాత తిరిగి ప్రభుత్వం అభ్యంతర పెట్టవలసిన అవసరం ఏమివచ్చింది?

The Hon. Sri A. B. NAGESWARA RAO:-Enforce చెయ్యవల సిన ప్రూచీ police కి ఉన్నదికాబట్టి, police వారియొక్క సిఫార్సుకూడా కావాలి. వారిమీదకూడా ప్రభుత్వం ఆధారపడాలి. వారు సిఫార్సు చేయ్యలేదు కాబట్టి యివ్వలేదు.

### *Palm Jaggery Co-operative Societies.*

**423—**

*** 560 Q:-** Sri A. BHAGAVANTHA RAO: Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) the member of Palm Jaggery Co-operative Societies in each District as on 1-9-1955;

(b) whether the licences are issued to all the societies every year and if not the reasons therefor; and

(c) the quantity of jaggery prepared during the year 1954-55?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

(*a*): The number of Palm Jaggery Co-operative Societies districtwar as on 1–9–1955 is as follows :

| | | |
|---|---|---|
| 1. | Anantapur | 1 |
| 2. | Chittoor | 37 |
| 3. | Cuddapah | 1 |
| 4. | Kurnool | 1 |
| 5. | Krishna | 93 |
| 6. | Guntur | 102 |
| 7. | West Godavary | 149 |
| 8. | East Godavary | 166 |
| 9. | Nellore | 85 |
| 10. | Visakhapatnam | 55 |
| 11. | Srikakulam. | 2 |
| | | 692 |

(*b*) : Out of the 692 Palm Jaggery Co-operative Societies, licences were issued to 462 Societies as on 1–9–1955. There are two reasons why licences were not issued to all the Societies in the State. The first and the main reason is that the Enforcement Department did not recommend the issue of licences to some of the Societies, taking into consideration the number of prohibition offences committed in the area and the other reason is that the members of some of the societies did not apply for licences as they found that the manufacture of palm jaggery was not remunerative in view of the low prices fetched by it.

(*c*) : 4,98,377 Maunds of palm jaggery was produced during the year 1954–55.

Sri A. BHAGAVANTHA RAO :— ఈ Palm Jaggery Co-operative society లన్నిటినీ నీరాషాపులుగా చేయాలనే proposal గవర్నమెంటు వారి దగ్గరున్నదా ? ఉంటే దానిపైన ఏమి action తీసుకున్నారు ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:- శాసనసభ్యులడిగిన విషయాన్ని గురించి ఈమధ్యనే కొన్ని representations వచ్చాయి. ఈ palm jaggery society లన్నీ నీరా society లు చెయ్యాలనేదాన్ని గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

Sri P. GUNNAYYA :— అధ్యక్షా ! 44 నీరా shop లు పెడతామని మంత్రిగారు సెలవిస్తున్నారు. మనరాష్ట్ర శాసనసభ ఆవరణలో రాజగోపాలాచారి గారు నీరాషాపు పెట్టించారు. అదిపుచ్చుకుని చాలా ప్రచారం చేశాం. ప్రజలు ఆనందించారు. మన Budget session ముగిసేలోపల ఇక్కడకూడా ఒక నీరా

shop ఇవ్వకుండావారు పెట్టిస్తే (loud laughter) ప్రచారానికి తగిన అవకాశం కలిగించింది.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ఇక్కడ గౌరవ సభ్యులు, ఎవరైనా కాని నీరాపుచ్చుకునేవారుంటే ప్రయత్నంచేస్తాం.

Sri P. RAJAGOPAL NAIDU :— ఈ society లకు licence లు recommmend చేయడానికి పోలీసువారు దేన్ని basis గా చేసుకుంటున్నారు ?

The Hon. Sri A. B NAGESWARA RAO :—ఇదివరకు offences commit చేస్తే, అది first main reason refusal కు, రెండవది వారు applications పెట్టకపోవడం.

Sri P. RAJAGOPAL NAIDU :— ఈ offences commit చేయని చోట ఎందుకుగాను issue చేయకుండా ఉన్నారు ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:_అటువంటి instance ఏదైనాఉంటే ప్రభుత్వం తప్పకుండా ఆలోచిస్తుంది. Offences లేకుండా licence లు ఇవ్వకుండా ఉన్న ప్రదేశాలు ఏమైనా ఉంటే ఆలోచిస్తుంది.

Sri VAVILALA GOPALA KRISHNAYYA:— అధ్యక్షా! సత్తెనపల్లితాలూకా ఉయ్యందనగ్రామంలో మూడు సంవత్సరాలక్రిందట palm gur society register అంది. దానికింతవరకూ licence ఇవ్వలేదు. Licence ఇవ్వడానికి వీలులేకపోతే దాన్ని రద్దుయినాచేయించండి. లేకపోతే licence ఇచ్చే అవకాశంఉంటే వెంటనే ఇప్పించే ప్రయత్నం ఏమైనాచేస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— గౌరవసభ్యులు చెప్పారుకాబట్టి దానికి సంబంధించిన కాగితాలుచూచి వారికి సభలోనుంచి వెళ్లే లోపుగా సమాధానం చెబుతాను.

Sri T. V. RAGHAVULU :— అధ్యక్షా ! నీరాకు licence ఇచ్చే సందర్భంలో నేరాలుచేసినట్లు ఏదైనా record ఉంటే policeవారు recommend చేయకుండలేదని మంత్రిగారు చెప్పారు. ఏమీపనిలేనప్పుడు వాడు నేరంచేసిఉండ వచ్చు. అప్పుడది ప్రాతిపదికగా పెట్టుకుని గౌరవంగా బ్రతకడానికి జీవనోపాధికలగ జేయమని కోరినప్పుడు నిరాకరించడం న్యాయమా? నేరస్థులనుచేయడం ప్రభుత్వ ధర్మమా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ఆలోచించడానికి అవకాశంలేదు. నేరం ఒకసారిచేసినా రెండుసార్లుచేసినా నేరమే.

Sri B. SANKARAIAH :— Licence లు ఇచ్చినప్పుడు గీసుకోడానికి అభ్యంతరం ఉండకూడదనే కదా licence ఇవ్వడం. Licence ఇచ్చినతరువాత డిస్ట్రిబ్యూషన్ చేయకని పోలీసులు అడ్డుపడుతున్నారు. Licence లు ఇచ్చినతరువాతకూడా గీయడానికి ఉండే ఇబ్బంది ఏమిటో విచారిస్తారా ?

The Hon Sri A. B. NAGESWARA RAO :— తప్పకుండా విచారిస్తాం.

Sri T. GOPALAKRISHNAYYA GUPTA:- [illegible] తాటిబెల్లము [illegible] లైసెన్సులకోసము అప్లైచేస్తున్నారు. [illegible] దించేదానికి [illegible] మాసంలో ఒక [illegible], ఒక [illegible], [illegible] డిపార్టుమెంటువారికి [illegible] ప్రభుత్వంవారు విచారిస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— [illegible] ఇంకా specific instances ఉంటే [illegible] ప్రభుత్వం [illegible].

Sri M. NAGI REDDI :— అధ్యక్షా, ఇప్పుడు మళ్ళీ నేరము చేసిన పిదప వారిని consider చెయ్యడానికి వీలులేదని మంత్రిగారు అన్నారు. జాతీయ ఉద్యమానికి వ్యతిరేకంగాఉండి, బ్రిటిషువారి హయాములో వారికి అండగా ఉండేవారు కాంగ్రెసువారిని కొట్టించినవారందరినీ ఈనాడు కాంగ్రెసులో చేర్చుకొనడానికి అవకాశం ఇస్తున్నారు. అలాంటప్పుడు, అమాయకులు తప్పుచేస్తే వారివిషయం consider చెయ్యకూడదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— అది నేరముకాదు. దేశంకోసం సేవచేసినవారు మనసోదరులే. ఆ నేరానికి దీనికి ఏమీ సంబంధము లేదు.

*Educational concessions to the Children of the Market Committee Employees.*

424—

* 540 Q.—Sri C. V. SOMAYAJULU : Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether it is a fact that the Secretary of the Guntur Market Committee Employees' Union had submitted a memorandum to the Government requesting them to grant the children of the Market Committee Employees all the educational concessions given to the N. G. Os.; and

(b) if so, the action taken thereon?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) Yes.

(b) The matter is under consideration.

*Labour contract Co-operative Societies.*

425—

* 668 Q.—Sri A. VENKATRAMA RAJU : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether the Government are taking special interest in forming labour contract co-operative societies in the State ;

(b) the number of such societies in the State ;

(c) whether these societies are affiliated to the Central Banks ;

(d) whether the Central Banks are granting loans to them ;

(e) if not, how these societies are working; and

(f) whether the Government propose to grant any loans to these societies?

The Hon. Sri D. SANJIVAYYA :—

(*a*): Yes, Sir. With a view to provide employment to the landless poor, the Government have been encouraging the formation of Labour Contract Co-operative Societies. During the Second Five Year Plan period, it is proposed to organise 15 labour Contract Societies. To enable the Labour Contract Co-operative Societies to obtain contracts without competition from contractors and others, Government have ordered that works relating to the Public Works Department, District Boards, Irrigation and Highways Departments, whose estimated cost does not exceed Rs. 2,500/- in each case, should be given to Labour Contract Co-operative Societies at their estimated cost without calling for tenders. The question of granting further concessions to these societies is under the consideration of Government.

(*b*): There are 44 Labour Contract Co-operative Societies in the State.

(*c*): Yes, Sir.

(*d*):—The Central Banks have been assisting these Societies with finance to pay earnest deposits besides making advances towards the work. The Chitvel Labour Contract Society in the Cuddapah District and the Panduvagandi Reservoir Labour Contract Co-operative Society have executed large contracts with effective financial aid from District Banks.

(*e*) Out of 44 Societies as on 30-6-1955, only 14 societies were able to obtain contracts and they executed the contracts either with their own funds or with the loans obtained by them from the Co-operative Central Banks. 16 Societies could not secure any work, while the remaining 14 societies were dormant either for want of sufficient funds or due to the dis-interestedness of the Panchayatdars. With a view to help the societies which are dormant for want of funds, the Registrar of Co-operative

Societies has proposed the grant of subsidies to eight of such societies and the proposals are under the consideration of Government.

(*f*) In respect of the societies to be newly formed, provision has been made in the Second Five Year Plan for the grant of interst-free loans at the rate of Rs. 2,500/- to each society towards working capital, repayable within a period of ten years from out of the profits earned by them.

**Sri M. NAGI REDDI** :— అధ్యక్షా, రెండవ పంచవర్ష ప్రణాళికలో 15 Labour Contract Society లకు అవకాశము ఇస్తామని మంత్రిగారు చెప్పారు, ఇది చాలా తక్కువ. గోదావరి వరదల విషయములో Labour Co-operative Societies చాలా బాగాపనిచేసినవని కూలీలకు డబ్బు కంట్రాక్టర్ల దోపిడి లేకుండా ముట్టేటట్లు చేసినారని తెలుస్తున్నది. ఇప్పుడు బ్రహ్మాండమైన ప్రాజక్టులో కాలవలు, కాలవల త్రవ్వకములాంటి వాటలో డబ్బు సంపాదించుకునే అవకాశం ఉన్నది. కాబట్టి ఎక్కువ లేబరు సొసైటీలను రిజిష్టరుచెయ్యడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

**The Hon. Sri D. SANJIVAYYA** :— ఇప్పుడు ఉన్న సొసైటీలలో 14 పనిచేస్తున్నవి, 30 సరిగా పనిచెయ్యడములేదు. ఎంత బ్రహ్మాండమైన అవకాశాలు వచ్చినా 2500/— విలువ అయినట్టివాటికే టెండర్సులేకుండా ఈ సొసైటీలకు ఇవ్వాలని ప్రభుత్వ ఉత్తరువులు ఉన్నవి. ఆ కారణంచేత ఎన్ని పెద్ద పనులు ఉన్నా వారికి అవకాశము ఉండదు. 2500/— ని 10,000/— వరకు పెంచడానికి ప్రయత్నములు జరుగుతూ ఉన్నవి. ఆర్డర్లు పాస్ అయినవి, issue అయినవో లేదో తెలియదు.

**Sri N. K. LINGAM** :— అధ్యక్షా, ఈ ప్రభుత్వం 2500/— విలువ గలిగిన estimates ను ఈ లేబరు సొసైటీలకు ఇవ్వాలని ప్రభుత్వం ఆదేశం పంపినప్పటికే క్రిందనఉన్న Departmental Heads వాటిని అమలుపరచకుండా ఉన్నారు. అటువంటి ఆర్డర్లు అమలుపరచాలని తాఖీదులు క్రిందఉద్యోగులకు ఇస్తారా ?

**The Hon. Sri D. SANJIVAYYA** :— గౌరవసభ్యులు ఎక్కడెక్కడ అయితే అధికారులు వాటిని సరిగా అమలుపరచకుండా ఉన్నారో మాదృష్టికి తీసుకొనివస్తే తప్పకుండా చర్యతీసుకుంటాము.

**Sri G. NAGESWARA RAO** :— అధ్యక్షా, 44 సొసైటీలు ఉన్నవని చెప్పారు. అయితే ఈ 44 సొసైటీలు కంట్రాక్టుతీసుకొని పనిచేయడానికి డబ్బు లేకపోవడంవల్ల చాలా ఇబ్బంది పడుతూఉన్నారు. మంత్రిగారు Central Bank లకు వీటిని affiliate చేశామని చెప్పారు. వీటిలో ఏవీకూడా affiliate అయినట్టు తెలియడములేదు. సెంట్రలుబాంకుకు వీటిని అఫిలియేటుచేసి అప్పు సౌకర్యములు కలుగచేస్తే ఈ సొసైటీలు బాగానడుస్తాయి. అందుచేత ఈ అఫిలియేటు చేసేటట్లు చూచి అప్పుసౌకర్యము కలుగచేస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— Cl-(c) లో ఉంది question. దానికి Answer 'yes' అని చెప్పేను. ఏవైనా సొసైటీలు అఫిలియేటు కాకుండా ఉంటే వాటివిషయం చర్యతీసుకుంటాము.

Sri. V. VISWESWARA RAO :— అధ్యక్షా ! ఇక్కడ మంత్రిగారు చెపుతూ 14 సొసైటీలు మాత్రము పనిచేస్తున్నవి 30 పనిచెయ్యడము లేదన్నారు. ఈ 30 పనిచెయ్యకపోడానికి అక్కడ works ఇవ్వకా ? లేకపోతే ఆ సొసైటీల నిర్మాణం సరిగా లేకనా ? రెండవది : సొసైటీ రిజిష్టరు చెయ్యడానికి ఎక్కువ మొత్తం కావలెను 1000/- షేరు ధనము కావలసిఉంటుంది. దానిని తగ్గించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon. Sri D. SANJIVAYYA :- కొన్ని సొసైటీల సందర్భములో అంటే 16. They could not secure work. మిగతా వాటిలో పంచాయితీదార్లకు interest లేని కారణం చేతను, దానికితోడుగా రు 2500/- limit ఉండడంకూడా ఒక కారణము. కాని వాటన్నింటికి సహాయముచేసి కొంత subsidy కొంత loan ఇచ్చి పటిష్ఠం చెయ్యడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, ఎక్కడఉన్న work అయినా take up చెయ్యడానికి అవకాశము ఉన్నదా ? Area of operations లేనిచోటుకు పోయి పనిచేసే అవకాశము ఉన్నదా ? Area of operation నెపముతో అవకాశం లేకపోతే ప్రతి Project నిర్మాణ ప్రాంతంలోను తప్పనిసరిగా లేబరు కో-ఆపరేటివు సొసైటీని ఏర్పాటుచేసేదానికి ప్రభుత్వం శ్రద్ధ తీసుకుంటుందా ?

The Hon. Sri D. SANJIVAYYA:- మామూలుగా ప్రతి కో-ఆపరేటివు సొసైటీకి area of operations అని ఉంటుంది. పెద్ద ప్రాజక్టుస్థలములో సొసైటీలను పెట్టేది ప్రభుత్వంకాదు. అక్కడఉన్న labourers మాకు సొసైటీలు కావాలని కోరితే మేము ఆర్గనైజుచేసి వారికి కావలసిన షేరుధనము, working capitalకు కొంత సహాయంచేసి స్థాపిస్తాము.

Sri P. GUNNAYYA :— శ్రీకాకుళంజిల్లాలో ఈ సొసైటీలను ప్రభుత్వం నెలకొల్పుతారా, లేకపోతే అలాంటి సొసైటీ ఏర్పాటుచేస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— జిల్లావారీ figures లేవు. మరొక ప్రశ్న వేస్తే చెప్పిస్తాను.

Sri P. VENKATASUBBAYYA :-మంత్రిగారు సమాధానము ఇస్తూ dormant గా ఉన్న సొసైటీలకు subsidy ఇవ్వడానికి ఆలోచిస్తున్నది ప్రభుత్వం అన్నారు. ఏఏ సొసైటీలకు, ఏ విధానముపైనఎంతెంత subsidy ఇస్తారు ?

The Hon. Sri D. SANJIVAYYA :— దాదాపు 6500/- లు 8 సొసైటీలకు ఇవ్వవలెననే ఆలోచన ఉన్నది. దానికి సంబంధించిన details ఇక్కడ లేవు.

Sri L. LAKSHMANA DAS :- అధ్యక్షా, ఈ సొసైటీలకు డబ్బులోటు ఉన్నదంటున్నారు. అందుచేత 50% షేర్లు తీసుకొని ప్రభుత్వం కొంత మదుపు పెట్టి పనిచేయిస్తే పని సక్రమముగా నడుస్తుంది.

The Hon. Sri D. SANJIVAYYA:-అదేమీ ఇప్పుడు ఆలోచనలోలేదు. అయినా వారు చేసిన సూచన మళ్ళీ పరీక్ష చేస్తాను.

Sri M. NAGI REDDI :— అధ్యక్షా, Area of operation 1, 2 గ్రామాలకు పరిమితమా ? తాలూకా మొత్తానికి పరిమితమై ఉండవచ్చునా ?

The Hon. Sri D. SANJIVAYYA :—1, 2 గ్రామాలకు సంబంధించి ఉంటుంది. అయినా ఇక ముందు వచ్చే పెద్ద పెద్ద పనులకు area విస్తరింప చెయ్యడానికి ప్రయత్నము చేస్తాము.

Sri V. KURMAYYA:—Area of operations 7 సంవత్సరాలు ఒక సొసైటీ క్రింద ఉన్నప్పుడు దానిని ప్రభుత్వం మారుస్తున్నారు. దీనికి కారణాలు ఏమిటో చెబుతారా ?

The Hon. Sri D. SANJIVAYYA :-ఇప్పుడుకొన్ని ఇబ్బందులుఏర్పడు తున్నవి. ఒక సొసైటీ దూరముగా ఉంటుంది. ఇంకో సొసైటీ ఫారము చేస్తే అదగ్గరగాఉండే గ్రామాలను ఈసొసైటీకి మార్చినపుడు పూర్వం ఏసొసైటీలో ఉన్నారో ఆ సొసైటీవారిని కన్సల్టుచేసి వారి agreement తో మారుస్తున్నారా?

Sri S. VEMAYYA :— రెండువేల అయిదువందల వరకు కంట్రాక్టులు వేలంలో కొందరు లేకుండా యిస్తామన్నారు. కానీ 10 వేల వరకు ఆర్డరు చేసినట్టుగా యిప్పుడు జ్ఞాపకం వుందని చెప్పుతున్నారు. ఈ సంవత్సరం పైగా కూడా కొంతకాలం యిది ఆలోచనలో వుందని చెప్పుతూ ఆర్డర్సుపోయినాయి అనడంవల్ల మేము అక్కడఅడిగితే ఆర్డర్సురాలేదంటారు. ఇప్పుడు యీఉత్తరవులుపోయినాయా? పోకపోతే ఆఉత్తరవులు అక్కడ రీచ్ కావడానికి యెంత కాలం పట్టుతుంది?

The Hon. Sri D. SANJIVAYYA:- 10-15 రోజులక్రితమే చూచి నట్టునాకు జ్ఞాపకంవుంది. ఆర్డర్సుఅయివుంటాయి అనినేను అనుకొంటాను. పోకుండావుంటే మళ్ళీవాటిని పొయ్యేటట్లుచేస్తాను.

Sri PRAGADA KOTAIAH :—Central Banks యీ సంఘాలకు యెంతఅప్పుయిచ్చినాయి. యివ్వకపోయినట్లయితే ప్రత్యేకంగా యేదైనా provision చేసి యీసంఘాలకు అప్పులిచ్చేందుకు ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా సెంట్రల్ బాంకుల దయాదాక్షిణ్యాలకు లోబడుతుందా?

The Hon. Sri D. SANJIVAYYA :—నేనుయిక్కడ క్లాజు "c" కి చెప్పానండీ. The Chitvel Labour Contract Society in the Cuddapah district and another Society executed large contracts with effective finance from the District Banks. ఎంత అనేది వేరే ప్రశ్న వేస్తే చెప్పబడును.

*Distribution of ammonium sulphate.*

426—

*811 Q.—SRI PRAGADA KOTAIAH : Will the Hon. the Chief Minister be pleased to state :

whether there is any proposal to revise the present policy of distributing ammonium sulphate for the year 1956?

The Hon. Dr. B. GOPALA REDDI :—

The Government have decided that the entire distribution of ammonium sulphate throughout the State should be entrusted to Co-operative Societies during the year, 1956.

Sri PRAGADA KOTAIAH :-Co-operatives అంటే whole sale distribution ను Co-operatives కు యిస్తున్నారా? లేకపోతే రిటైల్సును కూడా Co-operatives కు యిస్తున్నారా?

The Hon. Dr. B. GOPALA REDDI :— అంతావాళ్లకే యిస్తున్నాము.

Sri R. B. RAMAKRISHNA RAJU :—Ammonium Sulphate కంపెనీలనుంచి నేరుగా సొసైటీలు తెచ్చుకుంటుందా? లేకపోతే Government వారుతీసుకువచ్చి యిస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI :—Director of Agriculture యిండెంటు చేస్తారు. వారు యిచ్చేటటువంటి ఆర్డర్సు అంతాకూడా Director of Agriculture ద్వారా యిండెంటు చేయవచ్చును.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, ఈ Co-operative Societies వ్యక్తులను వారిఏజెంట్లుగా నియమించేదానికి అవకాశం వుంటుందంటున్నారే అదియదార్థమా? లేకపోతే యదార్థంకాదా?

The Hon. Dr. B. GOPALA REDDI :—అది యదార్థం కాదు.

Sri PRAGADA KOTAIAH :— Co-operative Societies కు Distribution entrust చేశామంటున్నారు. ఈ Co-operative Societies depots పెట్టడం అనేపేరుతోటి మళ్లావ్యక్తులకే యీబిజినెస్ అప్పచెప్పబడుతుందంటూరు. అది యదార్థమా? కాదా?

The Hon. Dr. B. GOPALA REDDI :— అది యదార్థం కాదు.

Sri V. VISWESWARA RAO :— అధ్యక్షా, ఈ అమ్మోనియంసల్ఫేట్సు ప్రతిసంవత్సరంకూడా season అయిపోయిన తర్వాత రావటం జరుగుతుంది. అట్లాకాకుండా యీ సంవత్సరంఅయినా కనీసం సీసన్‌లో తెప్పించి స్టాకుచేసేటటువంటి చర్యలు తీసుకుంటారా? దానికి సొసైటీలకు కావలసినడబ్బును వెంటనే బాంకులమంచి అప్పు యిప్పించేదానికి పూనుకొంటారా?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఈ సంవత్సరం యిప్పటికే Indent చేసినారు. తరువాత దానికి కావలసిన ధనమంతా యిప్పించటానికి

మేము ప్రయత్నం చేస్తున్నాము. ఈతడవ season లో రైతులకందరికీ అంద చేయడానికి సర్వవిధములా ప్రయత్నం చేస్తాము.

Sri R. B. RAMAKRISHNA RAJU :— ఈ Societies అగ్రికల్చరల్ ఆఫీసర్సుద్వారా వారికి యెందుకు యివ్వాలి? నేరుగా వారికి ఎందుకు సప్లైచేయ కూడదు. Ammonium sulphate Societies నుంచి నేరుగా తెచ్చుకొనే దానికి ఏర్పాటు చేయకుండా Agricultural officers ద్వారా యెందుకుపోవాలి?

The Hon. Dr. B. GOPALA REDDI :—వారికి వచ్చేనష్టం యేమీ లేదు. అందులో యిచ్చేటటువంటి కోటాఅంతాకూడా గవర్నమెంటుకు యిస్తు న్నారు. Unified control వుంటే మంచిదనే వుద్దేశంతో చేస్తున్నాము. Director of Agriculture ఆలస్యం కాకుండా చేయటానికి చూస్తున్నారు. ఏనె లకు ఆనెలకంతాకూడా ఏ Society వాండ్లు యెంతెంత indent చెయ్యాలో అది అంతాకూడా ఒక time-table మాదిరిగా వేసుకొని దానిని అమల్లో పెట్టడానికి వారు ప్రయత్నం చేస్తున్నారు.

Sri N. VENKAIAH:-Ammonium Sulphate తగినంతదొరక్క అద నంగా ధరలుకూడా చెల్లించుకోవలసిన విపరీత పరిస్థితులు యిప్పుడు వున్నా యి. అలాంటప్పుడు ఒక వ్యవసాయ ఉద్యోగుల దగ్గర ఎప్పుడూ కొంత Ammonium Sulphate ను నిలువ చేయడానికి, అవసరమైనప్పుడు రైతులకివ్వ డానికి ప్రయత్నిస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI :— ఈ విషయం చాలా దీర్ఘకాలంనుండీ ఆలోచనలో నున్నది. Agricultural demonstrator లకు ఈ వ్యాపారవృత్తి వాళ్లకుపెట్టితే అసలు వాళ్ళుచెయ్యాల్సిన పని మరచిపోతా రేమోననేటటువంటి భయం, అదీకాక యిదిద్రవ్యంతో కూడినటువంటి విషయం. ఈ Demonstrator లకు ఈ Ammonium Sulphate యివ్వడం, అమ్మడం, ఆ ద్రవ్యమంతా లెక్కచూపించడం యిదివాళ్లకు తగినపనికాదనిచెప్పి యిది Co-operative Society లకే యివ్వబడింది.

Sri VIJAYA BHASKARA REDDI :—అధ్యక్షా, Ammonium Sulphate కాక సూపర్ ఫాస్ఫేటువంటి యితరమైన ముఖ్యమైన ఫర్టిలైజర్సు వున్నాయి. వాటినికూడా co-operative societies కు అప్పగిస్తే బాగుంటుం దనేది ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI :— ఆలోచించడానికి అభ్యం తరం లేదు.

Sri R. B. RAMAKRISHNA RAJU :- ఈ question యిందుకు relavant కాకపోయినా super phosphates దొరకటంలేదు అని ఒక complaint ఉన్నది. అదినిజమా ? దొరికేటట్లు చేస్తారా గవర్నమెంటువారు ?

The Hon. Dr. B. GOPALA REDDI :—ఇది అంతా కూడా మనకు కోటాగాయిస్తారు, ఆకోటా ప్రకారం జరగవలె, మనకు ఒకవేళ

యెక్కువ demand ఉండినప్పటికికూడా వాళ్లుకోటా యివ్వలేకుండా పోతారు. కాబట్టి యేమైనప్పటికినీ యీవిషయం ఆలోచిస్తాం.

Sri T. JALAYYA :— అసలు సూఫర్ ఫాస్ పేటు distribution, Government చేతుల్లో ఉంధా ?

Mr. SPEAKER :— We are now distributing Ammonium Sulphate but not Super Phosphate.

Sri T. JALAYYA :— అదీకాక సూపర్ ఫాస్ పేటు question అడిగాను. Super Phosphate డిస్ట్రిబ్యూషన్ గవర్నమెంటు చేతుల్లోవుందా అని.

The Hon. Dr. B. GOPALA REDDI :— ఉందో లేదో మీకు తెలుసు బాగా.

Sri P. NARASIMHAPPA RAO :— అధ్యక్షా, ఇప్పుడు అమ్మోనియాకు రేటు హెచ్చుగా వుంది. రైతు పండించేపంట చాలా తక్కువరేటులోవుంది. దాన్నిగురించి మన గవర్నమెంటు ఆలోచించి ధర తక్కువచేసి రైతులకు సప్లయిచేయడానికి యేమైనా ఉద్దేశంవున్నదా గవర్నమెంటుకి ?

The Hon. Dr. B. GOPALA REDDI:— ఇదిఅంతాకూడా Government of India వారే నిర్ణయిస్తున్నారు. Ex-Factory ధరఎంత? రిటైలుప్రైసు ఎంత అనే విషయం అంతాకూడా Govt. of India వారే decide చేస్తున్నారు. అన్ని ప్రావిన్ సెస్సుకు ఒకటిగానే ఉన్నది.

Sri B. APPA RAO :—అంటే మన రాష్ట్రప్రభుత్వం మనరాష్ట్రంలోవున్న రైతులకు యేమన్నా subsidy ఇస్తుందా అని నేను అడుగుతున్నాను.

The Hon. Dr. B. GOPALA REDDI :— శక్తి లేదండీ.

Sri B. APPA RAO :- చాలాకాలానికి ప్రభుత్వం ఈ నిర్ణయానికి వచ్చింది. మరి ప్రభుత్వంమీదవచ్చే వొత్తిళ్ళకు ఖాతరుచేయకుండా, యీ నిర్ణయాన్ని నిలబెట్టి దీన్ని ఈ సహకారసంఘాలద్వారానూ యింకా యితర మెన్యూర్సు ముఖ్యంగా ground nut cake మనరాష్ట్రంలో ఉత్పత్తి అవుతుంది. మనరాష్ట్రంలోనే Expellers ఉన్నాయి. ఈ ground nut cake ను గూడా ఈ సహకారసంఘాలకే యిచ్చి రైతులకు సరఫరా అయ్యేటట్టుగా చేస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI :— వేరేప్రశ్న వేస్తే సమాధానం యిస్తాం.

Sri B. SANKARAIAH:— ఇప్పుడు అంతాకూడా Co-operative department కు యివ్వటం మంచిదే. కానీ యిదివరకు Black market లో కొనవలసిఉన్నా చాలామంది వ్యాపారస్థులు సకాలానికి తెప్పించడాన్కి ప్రయత్నంచేసేవాళ్లు. ఇప్పుడు యెంతోముందుగా ప్రభుత్వం జాగ్రత్తపడకపోతే అసలు దొరక్క యెవరో పలుకుబడివుండేవార్కి మాత్రం దొరికే ప్రమాదం ఉంది. అందువల్ల దానికి తగిన చర్యలు యిప్పటినుంచీ తీసుకొంటారా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—Registrar of Co-operative Societies, Director of Agriculture వీళ్ళందరు కూర్చొని యేయే నెల యేయే సొసైటీ యెంత యెంత Indent చేయవలెనో అనేవి అన్నీగూడా లెక్కచూచుకొని demand ను బట్టి, పోయిన సంవత్సరం, అంతకుముందు సంవత్సరం ఎంత అమ్ముడు పోయిందో లెక్క చూచుకొని ఈ విషయంలో చాలా శ్రద్ధతీసుకొని పనిచేస్తున్నారు.

Sri PRAGADA KOTAIAH :— ఇప్పుడు సొసైటీస్ అనేవి మార్కెటింగు సొసైటీసు, ప్రైమరీ స్టోర్సునా, లేకపోతే multi purpose co-oprative societies, credit societies వాటికికూడా యీ అమ్మకానికి అవకాశం యిస్తున్నారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఇప్పుడు మామూలుగా wholesale stores వున్నాయి జిల్లాలో. వాటిని Marketing Societies గా convert చేస్తున్నాము. తర్వాత తాలూకా లెవెల్లో, ఫిర్కా లెవెల్లో మనకుండే centres లో మనం అంతాకూడా చిన్న మార్కెటింగు Societies పెట్టుతున్నాం. ఇవి అన్నీకూడా District Marketing Society కి అఫిలియేటు అవుతాయి. వాటిద్వారాగానే యింకా అవసరమైతే చిన్నచిన్న బ్రాంచెసు, డిపోసు కూడా పెట్టి అంతా District marketing societies ద్వారానే యిది అంతా కూడా జరుగుతుంది.

Sri PRAGADA KOTAIAH :— Multi-purpose Co-operative Societies కు కూడా యిచ్చేదానికి ప్రభుత్వం నిర్ణయంచేస్తుందా ?

The Hon. Sri D. SANJIVAYYA :—Multipurpose Co-operative Society లకు చాలా purposes ఉన్నాయి. అవిచేస్తే చాలు.

*Introduction of Pilot Scheme for improved agricultural credit and marketing in the State.*

**427–**

* 843 Q.– Sri P. VENKATASUBBAYYA :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether the Government propose to introduce a Pilot Scheme for improved agricultural credit and marketing through Co-operative Societies in the State;

(b) if so, the districts where this scheme would be first introduced; and

(c) whether the Government of India would be requested to give financial aid to these schemes ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) Yes, Sir.

(b) The scheme is proposed to be introduced in the following areas in Kurnool, West Godavari and Visakhapatnam districts:—

KURNOOL : Adoni, Alur and Pathikonda taluks.

WEST GODAVARI : Eluru and Tadepalligudem taluks.

VISAKHAPATNAM : Anakapalli and Yelamanchili Taluks.

(c) The Government of India and the Reserve Bank of India have already been addressed by this Government for the necessary financial assistance for implementing the schemes.

*Amount Spent for supply of chemical menures.*

428-
* 205 Q.- Sri B. RAMAKRISHNA REDDI:— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the amount that has been allotted to Nellore District for supply of chemical manures for 1955-56; and

(b) the amount that has been spent up till now ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) An amount of Rs. 15/- lakhs was allotted to Nellore District under the Intensive Manuring Scheme for the year 1955-56 for issue as loans to ryots for the purchase of chemical fertilisers.

(b) An amount of Rs. 9,45,t95/- was disbursed upto 30-11-1955 when the scheme for the year 1955-56 came to a close.

Sri B. SANKARAIAH :— 15 లక్షలరూపాయలు శాంక్షను చేసినపుడు 9 లక్షలరూపాయలు మాత్రమే ఇవ్వడానికి కారణం ఏమిటి ? రైతులు వద్దనుంచి applications లేకపోవడంవల్లనా, ఉద్యోగస్థుల నిర్లక్ష్యంవల్లనా ?

The Hon. Dr. B. GOPALA REDDI:- ఉద్యోగస్థుల నిర్లక్ష్యంవల్ల మాత్రంకాదు.

## *II. MOTION-UNDER RULE 11 OF THE ASSEMBLY RULES.*

Sri P. RANGA REDDI :— Sir, I move

"That under Rule 11 of the Assembly Rules, leave of absence be granted by this House to Sri Ch. Sriranganayakulu, Member, Andhra Legislative Assembly for his absence during the last session from 4-10-1956 and during this meeting.

The motion was duly seconded.

The motion was put and carried.

Sri P. SUNDARAYYA :— Sir, I move

"That under Rule 11 of the Assembly Rules, leave of absence be granted by this House to Sri P. V. R. Gajapathi Raju, Member, Andhra Legislative Assembly for his absence for the rest of this Session."

The motion was duly seconded.

The motion was put and carried.

Sri P. SUNDARAYYA :— Sir, I move

"That under Rule 11 of the Assembly Rules, leave of absence be granted by this House to Srimathi Kusum Gajapathi Raju, Member, Andhra Legislative Assembly for her absence for the rest of this session."

The motion was duly seconded.

Sri R. B. RAMAKRISANA RAJU :— May I sumbit Sir, that we are entitled to know the reasons for their answers.

Mr. SPEAKER :— They are ill.

The motion was put and carried.

[Note:— An asterisk * at the commencement of a speech denotes revision by the Member].

## *III. NON—OFFICIAL BILLS.*

## (1) THE MADRAS ESTATES LAND (REDUCTION OF RENT) SECOND AMENDMENT (ANDHRA AMENDMENT) BILL, 1956.

Sri P. RAJAGOPAL NAIDU :— Sir, I move for leave to introduce the Madras Estates Land (Ruduction of Rent) Second Amendment (Andhra Amendment) Bill, 1956. అధ్యక్షా, శ్రీ కళా వెంకట్రావుగారు మొట్టమొదట శిస్తు తగ్గింపుచట్టం చేసినప్పుడు ఆచట్టాన్ని అనుసరించి డబ్బుశిస్తు చెల్లించేవారిమధ్య ధాన్యం శిస్తు చెల్లించేవారిమధ్య కొంత తేడా వచ్చింది. రైత్వారీ గ్రామంలో రు 10 లు శిస్తుఉంటే ప్రక్క జమీందారీ గ్రామంలో రు 20 లు ఉంటే రు 10 లుకు తగ్గించాలి అన్నారు. అంటే 50% తగ్గించాలన్నారు. ధాన్యంశిస్తు తగ్గించాలన్నప్పుడు 600 శేర్లు చెల్లిస్తుంటే 50% తగ్గించాలన్నారు. అందువల్ల 600 శేర్లు 300 శేర్లుకు తగ్గింది కాని uniformity of rate రాలేదు. అందువల్ల చిత్తూరు, నెల్లూరు, రామనాథపురం జిల్లాల్లో రైతులు ఆందోళన చేయడంవల్ల ధాన్యంశిస్తు తగ్గించాలని లేదంటే highest wet rate, highest dry rate కంటే శిస్తు వసూలుచేయకూడదని Act చేసినారు.

Mr. SPEAKER:— I will first ascertain whether it is opposed. If it is opposed you can make a statement, or else there is no need.

The Hon. Dr. B. GOPALA REDDI :— 1951 లో కాంగ్రెసువారు చట్టం చేసినారు. అప్పటినుంచి ఇప్పటివరకూ అమలులోకి వచ్చిన సాధక బాధకాలు పరిశీలించి ప్రభుత్వంవారే ఈ Estates Land Act కు సవరణలు కొన్ని తీసుకురావాలనే ఉద్దేశంతో ఉన్నారు. నాయుడుగారు చెప్పిన విషయంకూడా గవర్నమెంటువారు ఆలోచిస్తున్నారు. Legal complications కూడా ఆలోచించవలసియున్నది. గవర్నమెంటువారు ఆలోచిస్తున్నారు కాబట్టి శ్రీరాజగోపాల నాయుడుగారు బిల్లు ఉపసంహరించుకోవాలి అని ప్రభుత్వంవారు ఆలోచించి ఉచితవిధంగా చేస్తారని చెబుతున్నాను.

The Bill was by leave of the House withdrawn.

## (2) THE COWS AND SHE-BUFFALOES SLAUGHTER PROHIBITION BILL, 1956.

Sri P. VENKATASUBBAYYA :—Sir, I move for leave to introduce the Cows and She-buffaloes Slaughter Prohibition Bill, 1956.

Mr. SPEAKER :—I will ascertain whether it is opposed by the Government.

The Hon. Dr. B. GOPALA REDDI :—అధ్యక్షా, ఇందులో పొట్టేళ్లు, మేకలుకూడా చేరుస్తారా; ఆవులు; బర్రెలు మాత్రమేనా. దీనిని గురించి తరువాత ఆలోచించవచ్చును. ఇప్పుడు మేము oppose చేయడంలేదు. ఇందులో ఉండేవి మేము examine చేయవలసి యుంటుంది. Let it be published in the Gazette.

The motion was carried and leave was granted.

## (3) THE ANDHRA MORATORIUM BILL, 1956.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I move for leave to introduce the Andhra Moratorium Bill, 1956.

The Hon. Dr. B. GOPALA REDDI :—అధ్యక్షా, దీనిని వారుఇచ్చి చాలాకాలమైనది. 1-1-56 నుంచి అమలు చేయాలని ఉన్నది. వారు నోటీసు ఇచ్చినప్పటినుంచి ధరవరలు అనుకున్నంత నిరుత్సాహంగా లేవు. వారు నోటీసు యిచ్చేనాటికి ధరలు కొంతవరకు పెరిగినాయి. Moneysuits ఎంతవరకు పడుతున్నాయో ఎక్కువమంది creditors ఒత్తిడిచేస్తున్నారనే విషయం దర్యాప్తు చేశాము. ధరలు బాగా ఉన్నాయి కాబట్టి విపరీతమైన కాలమాన పరిస్థితులు లేవు కాబట్టి దీనిని మేము ఆక్షేపణ చేయవలసియున్నది. వావిలాలవారు ఉపసంహరించుకోవాలని కోరుతున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ బిల్లు ఈరోజున చాలా అవసరంగా ఉన్నది. దీని provisions ప్రకారం రు 2000 లు సంవత్సరానికి ఆదాయం ఉన్నవారికి అప్పులు ఎక్కువగా ఉన్నాయి. ధరలు సహజారిగా లేవు. Unemployment జాస్తిగా ఉండి ఇవ్వవలసిన ఋణాలు

తీర్చుకోవడం అసాధ్యంగా ఉన్న పరిస్థితులలో ప్రభుత్వం తప్పకుండా బిల్లు తెస్తాను అని చెప్పారు.

The Hon. Chief Minister assured the House that the Government was anxious to do something in the matter.

Ordinance కూడా తెస్తామేమోనని చెప్పారు. అందుకోసమే prorogue చేయడం జరిగింది, కాని ordinance ఇవ్వడం మాత్రం జరగలేదు. P. C. C తీర్మానం చేశారు. ముఖ్యమంత్రిగారు ఏవో మార్పులు వచ్చాయి అంటున్నారు కాని వచ్చినమార్పులు ఋణస్తుల బాధలు తీర్చడానికి రాలేదు. ఉన్నఆస్థులన్నింటిని లాక్కోడానికి ఆలస్యం అవుతుందేమోనని decrees అమలు చేసే పరిస్థితివచ్చింది, అప్పులభారం ఎక్కువ అవుతోందని Co-operative society sub-committee clear గా చెప్పింది. కరీంనగర్, కడప, కర్నూలు జిల్లాల్లో అప్పుల భారం తీవ్రంగా ఉన్నదని దానిని పరిష్కారం చేయాలని చెప్పిఉన్నారు. ఈబిల్లు చాలా అత్యవసరం అనే ఉద్దేశ్యంతో press చేస్తున్నాను. ప్రభుత్వం దీనిని అంగీకరించాలని కోరుతున్నాను. మార్పులు చేయవలసిన అవసరం ఉంటే publication అయిన తరువాత మార్పులు తీసుకురావడానికి అవకాశం ఉన్నది. Publication వరకే నేను ఇప్పుడు కోరుతున్నాను. దీనిని అంగీకరించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

Mr. SPEAKER :—The question is :—

"That leave be granted to introduce the Andhra Moratorium Bill, 1956."

The motion was lost, and leave refused.

## *IV. NON-OFFICIAL RESOLUTIONS.*

### *Grant of Banjar or Poramboke Government lands to landless poor—(Contd)*

Sri M. NAGI REDDI :— అధ్యక్షా, ఈబంజరుభూములు పేదలకు ఉచితంగా పంచి యివ్వాలనే తీర్మానముమీద లోగడ కొంత వరకు చర్చ జరిగింది. ఈబంజరుభూముల సమస్య ప్రధానసమస్యగా మనముందు ఎన్నో సంవత్సరములనుంచి ఉన్నదని గౌరవనీయులైన సభ్యులందరికీ తెలిసిన విషయమే. (1) శిస్తుకట్టినవి. (2) శిస్తు కట్టనివి. (3) పోరంబోకు భూములు. (4) కుంటపోరంబోకు భూములు. (5) Forest బంజరులు ఈవిధంగా బంజరుభూములలో అనేక రకాలు ఉన్నాయి. వీటిలో 30, 40 సంవత్సరములనుంచి సాగుచేసుకొంటున్న భూములుకూడా ఉన్నాయి. ఎన్నో సంవత్సరాలనుండి వీటికి పట్టాలు ఇవ్వమని 'A' Form record లో చేయండి అని అక్కడఉండే ప్రజలు ఎంత ఆందోళన చేస్తున్నప్పటికీ, అక్కడ ఉన్నటువంటి గ్రామోద్యోగుల వల్ల అయితేనేమి తదితర రివెన్యూ ఉద్యోగస్థుల వల్ల, ఆటంకాలవల్ల అయితేనేమి ఇవ్వకుండా ఉండడం జరుగుతున్నది. ఉదా:— పల్నాడు తాలూకా కొత్తపూరు అగ్రహారంలో ఉన్న 200, 300 ఎకరాల బంజరు భూములను 30, 40 సంవత్సరములను అక్కడఉండే హరిజనులు సాగుచేసుకొంటున్నారు. వాటిని తహసీల్దారు, కలెక్టరు వచ్చి inspection చేసి వారికి పట్టాలు ఇవ్వమన్నప్పటికీ 'A' Form records తయారుచేయమన్నప్పటికీ అక్కడఉండే గ్రామోద్యోగస్థుల

పేచీలవల్ల అవి ఇంతవరకు తయారుకాకుండా ఉన్నాయి. ఇలాంటి ఉదాహరణలు ఇంకా ఎన్నో ఉన్నాయి.

కొన్ని ఆక్షేపణలేనటువంటి బంజరు భూములు ఉన్నప్పటికి వాటిమీద పెనాలిటీలు వేయడం, వాటిమీద వారు అప్పీళ్లు చేసుకోవడము, మరల పెనాలిటీలు తగ్గించడంవల్ల మరల సాగుచేసుకోవడం, ఇట్లు ఎన్నో సంవత్సరములనుంచి జరుగుతున్న బంజరులు కూడా ఉన్నాయి. అలాంటి బంజరు భూములను మనం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉండగాగాని, తరువాతగాని పేదలకు ఉచితంగా పంచి ఇవ్వాలని తీర్మానములు pass చేసింది. అవన్నీ బుట్టదాఖలు చేసి, ఇప్పుడు కొత్త ప్రాజెక్టులు వస్తున్నాయి, వాటిక్రింద వచ్చేవాటినన్నింటినీ ఆలోచించాలనే నెపంతో వాటికి పట్టాలు ఇవ్వడంలేదు. నాగార్జున సాగరు ప్రాజెక్టు క్రిందగాని, తదితర ప్రాజెక్టులక్రిందగాని వచ్చే బంజరు భూములన్నింటికి పట్టాలు ఇవ్వమని కూడా ఇప్పుడు ప్రభుత్వము చెబుతున్నది. పట్టాలు ఇవ్వడము assignment లు అన్నీకూడా ఆపివేయాలని ప్రభుత్వము ఆర్డర్లు ఇస్తున్నది. 30, 40 సంవత్సరములనుంచి సాగుచేసుకొంటున్న భూములకు ఇవ్వాళ పట్టాలు ఇవ్వకుండా ఆపుచేయడము అనేది ఎంతవరకు న్యాయసమ్మతమో ప్రభుత్వము ఆలోచించవలసిన అవసరము ఉన్నది. అందువల్ల ఈ విధమైన ఆర్డరులు ఇవ్వడం, assignment ఇవ్వడం అనేది, పేద ప్రజలకు, ముఖ్యముగా హరిజనులకు అన్యాయము చేయడం తప్ప వేరుకాదని నేను ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను.

ఇప్పుడు సాగుచేసుకుంటున్న భూములన్నిటనీకూడా రాజకీయబాధితులకు ఇవ్వాలనే ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చింది. ఇదివరకు ఉమ్మడి మదరాసు రాష్ట్రములో రాజగోపాలాచారిగారి మంత్రివర్గము పేదప్రజలు సాగుచేసుకొంటున్న బంజరుభూములను తీసుకొని రాజకీయబాధితులకు ఇవ్వడం సరియైనది కాదని ఒక నిర్ణయానికి వచ్చింది. ఆంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత ఈమంత్రివర్గం దానిని తిరగదోడి ఆసాదుచేసుకుంటున్న బంజరుభూమును రాజకీయ బాధితులకు ఇవ్వాలని నిర్ణయానికి వచ్చింది. రాజకీయబాధితులకు భూములు ఇవ్వడానికి కమ్యూనిష్టులు ఏమీ వ్యతిరేకులుకారు. రాజకీయబాధితులు అయినవారికి తినడానికి తిండిలేక, కడుదరిద్రులుగా ఉన్నవారికి ఎవరిసాగులో లేనటువంటి బంజరు భూములను ఇస్తే మాకేమీ ఆక్షేపణలేదు. మెరక పల్లములు చదునుచేసుకొని, కొన్నివందల రూపాయిలు కర్చుపెట్టుకొని, తమచమటోడ్చి, భార్యాపిల్లలు కష్టపడి, ఎన్నో సంవత్సరములనుంచి సాగుచేసుకుంటున్న భూములను ఇవాళ రాజకీయ బాధితుడు అనేపేరుతో తీసుకెళ్ళి వారికి కట్టబెట్టడం అనేది సరియైనది కాదు. ఈరోజున గుంటూరు జిల్లాలో బాపట్ల తాలూకాలో రొంపేరు భూముల విషయములో కానీయండి, తదితర అనేక బంజరుల విషయములో కానీయండి చూస్తే ఈవిషయం స్పష్టంగా బోధపడుతుంది. వాటికొఱకు సత్యాగ్రహాలు, పోరాటాలు జరపడము, వాటిని ఇప్పటివరకు evict చేయకుండా, కోర్టులకు వెళ్లడము, హైకోర్టులలో రిట్టులు వేయడం, రివెన్యూబోర్డుకు అప్పీళ్లు చేయడం, Stayorder తెచ్చుకోవడము మొదలగు అనేకరకములైన తగాదాలకు దారితీయడం జరుగుతూ, ఈరోజుకూ వాటిని రాజకీయ బాధితుల స్వాధీనము చేయకుండా ఉన్నవిషయం మన అందరికీ తెలుసు, రాజకీయ బాధితులు అని

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

1st March 1956] (Sri M. Nagi Reddi)

పేరుపెట్టి ఎలాంటివారికి ప్రభుత్వము భూములు ఇవ్వడానికి తయారవుతున్నదో కొన్ని ఉదాహరణలు చెబుతాను.

పల్నాడు తాలూకాలో కారాలపాడు అనే గ్రామములో చెఱువుక్రింద భూమిని, సయ్యద్ కరీమ్ అనే మహమ్మదీయునకు రాజకీయబాధితుడు అని పేరు పెట్టి పట్టా ఇచ్చినారు. జాతీయఉద్యమము రోజుల్లో జస్టిస్‌పార్టీ తరఫున ఉండి కాంగ్రెసువారిని కొట్టించిన ఆయనకే ఈరోజు రాజకీయబాధితుడు అని పేరుపెట్టి మాల, మాదిగ, హరిజనులు ఎన్నో సంవత్సరములనుంచి తలొక 25 సెంట్లు సాగుచేసుకొంటున్న భూములనుతీసుకుని ఆయనకు పట్టా ఇచ్చారు. ఈయనే తెలంగాణాలో రజాకార్ల ఉద్యమములో వారికి సహాయము చేస్తున్నారని ఆయనను కాంగ్రెసువారు డిటెన్యూగా జైలుకు పంపించారు. ఆ విషయము శాసనసభ్యులైన బ్రహ్మానందరెడ్డిగారు మొదలైనవారందరికీ తెలుసు. ఇప్పుడు ఆయనకు రాజకీయబాధితుడు అనే ముద్రవేసి హరిజనులు సాగుచేసుకొంటున్నభూములను ఇవ్వడం జరుగుతోంది.

సత్తెనపల్లి తాలూకాలో 1942లో జైలుగోలుసు లాగాడు అని ఆయనను రాజకీయ బాధితుడుగా ఎంచి అక్కడ 10 ఎకరములభూమి ఇచ్చారు. ఆయన గొలుసులాగారని అరెస్టుచేస్తే, నేను ఏమీ ఎరగనని క్షమార్పణకూడా చెప్పుకొని బయటకు వచ్చిన ఆయన ఈరోజు రాజకీయబాధితుడు అయ్యాడు. ఈ రాజకీయబాధితులు అనేవారుకూడా విచక్షణారహితంగా పైనాయకులు ఎవ్వరి వద్దకోపోయి ఒక certificate తీసుకున్నంతమాత్రమున వారికి రాజకీయబాధితులు అని ముద్రవేసి పోరంబోకులన్నీకూడా వాళ్ళకు కట్టబెట్టడము జరుగుతోంది.

రాజకీయబాధితులు అయినప్పటికి ఎంతో అన్యాయముగా పేదప్రజల యొక్క భూములను లాక్కొనడానికి తయారవుతున్న కేసులు 2,3 ఉదాహరణలు ప్రభుత్వదృష్టికి తీసుకువస్తాను. తెనాలిలో రత్నసభాపతి అనే ఆయన ఒకరున్నారు. ఆయనకు 150 ఎకరములు పొలము ఉన్నది. కొడవలివారిపాలెంలో గోసాల కోటయ్య అనే హరిజనుడు 1 ఎ. 30 సెం. సాగుచేసుకుంటుంటే దానిని లాక్కొని 150 ఎకరాలుఉన్న "బీదవారికి" ప్రభుత్వంవారు ఇవ్వడానికి తయారవుతున్నారు.

ఈవిధంగా "పరుగుతీసేవాడి వెంబడి గిరుకుతీసేవాడు పడినట్లు" ఎక్కడనో పాపం, ఆ పేదవాళ్లు 20 సెంట్లు, 25 సెంట్లు ఈప్రకారముగా సాగుచేసుకుంటుంటే వాటినన్నింటిని తీసుకువెళ్ళి రాజకీయబాధితులు అనే పేరుతో భూమిఉన్న వాళ్లకు కట్టబెట్టడం జరుగుతున్నది. దీనిని ప్రభుత్వంవారు పునరాలోచన చేయాలని వారిదృష్టికి తీసుకుని వస్తున్నాను.

అట్లాగే వేటపాలెంలో రెడ్డి, యానాది, సొసైటీలవాళ్లు చేసుకునేటటువంటి భూములను కూడా తీసుకొని రాజకీయబాధితులకు కట్టబెడుతున్నారు. దీనివల్లరాజకీయబాధితులు అనేపేరుతో ఏఆధారములేని వారిదగ్గరనుంచి తీసుకొని, ఉన్నవారికి కట్టబెట్టి గలాటాలు రేకెత్తించడం జరుగుతోంది. బీదవారు చాలా బాధపడుతున్నారు. కరుభూదానయజ్ఞాన్ని బలపరుస్తున్నామని గోపాలరెడ్డిగారు, చంద్రమౌళిగారు మొదలగువారు అందరూ చెబుతున్నారు. భూదాన యజ్ఞాన్ని బలపరచడం మంచిదే.

జాతీయోద్యమంలో పాల్గొనినందువల్ల బీదవారై, భూమిలేక లపస్థపడుచూంటే వారికి ఈ భూదానయజ్ఞంలో, వచ్చేటువంటి మంచిభూములను యివ్వడంకూడ మంచిదే. అట్లు చేసినట్లయితే పేచీలు లేకుండా వుంటాయి. "భూసంస్కరణలన అమలు పరుస్తాము" అని పదేపదే అంటున్నారు. భూసంస్కరణలను తీసుకొనివచ్చి నప్పుడు పెద్ద పెద్ద జమీందారులయొక్క వందలాది ఎకరములభూమి తెనాలి తాలూకాలోను బాపట్లతాలూకాలోను, కృష్ణా, గోదావరి డెల్టాల క్రిందవుండే భూములు, పసుపుతోటలు, చెరుకుతోటలు ఏపుగా పెరుగుటకు అనువైన భూములు, మంచి మాగాణి భూములు మొదలగునవి తీసుకొని వాటిని రాజకీయబాధితులకు యిచ్చినట్లయితే బాగుంటుంది.

**The Hon. Dr. B. GOPALA REDDI :**—అదంతా వేరేవిషయం.

**Sri M. NAGI REDDI :**— ఇప్పుడు జమీందారులకు ఏవిధంగా **compensation** యిస్తున్నారో, అదేవిధంగా భూస్వాములకుకూడా యిస్తారు. అటువంటప్పుడు మంచి భూములన్నిటినీ తీసుకొని రాజకీయ బాధితులకు యిచ్చుటవలన నష్టమేమీ లేదు. ఈ భూములను రాజకీయబాధితులకు ఇచ్చినట్లయితే వారు బాగుపడతారు. భూములను ఇవ్వకుండా 'మేము భూసంస్కరణలను తెస్తాము, భూదానోద్యమమును బలపరుస్తాము, దున్నేటటువంటి రైతులకే భూమిని ఇస్తాము, భూములకు కనిష్ట, గరిష్ట పరిమితులను నిర్ణయిస్తాము" అని అంటూనే ఇప్పుడు సాగు చేసుకొంటున్న పేదరైతులను భూములనుండి వెళ్లగొట్టడము ఎంతవరకు సమంజసమో ప్రభుత్వమువారు ఆలోచించవలసి యున్నది. ప్రభుత్వము భూసంస్కరణలను అమలు జరుపదలచినట్లయితే సాగుచేసుకుంటున్న భూములనుండి పేదరైతులను వెళ్లగొట్టి, ఆభూములను భూస్వాములకో, పెద్ద ధనికరైతులకో రాజకీయ బాధితుడనే నెపంతో కట్టబెట్టినట్లయితే ప్రభుత్వం ఈభూసంస్కరణలను చిత్తశుద్ధితో అమలుపరుస్తుందనే విశ్వాసం ప్రజలలో కలుగుతుందా అని మంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను. వెనుకబడిన కులాలవారు సాగుచేసుకొంటున్న భూములను, ఎన్నో సంవత్సరాలనుంచి సొసైటీలు పెట్టుకొని సాగుచేసుకొంటున్నవారిని భూములనుండి తొలగించి ఆ భూములను రాజకీయ బాధితులనే పేరుతో ధనికరైతులకు కట్టబెట్టడం సరియైన పద్ధతి కాదని ప్రభుత్వంవారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. అదేకాకుండా భూములమీద మార్కెటు రేటు విధిస్తాము అంటున్నారు. బంజరుభూములను పేదలకు ఉచితంగా పంచిపెట్టాలని ఆంధ్ర అసెంబ్లీలో శ్రీ ప్రకాశంగారి హయాంలో ఒక తీర్మానం చేశారు. ఇప్పుడు మళ్ళీ ఆ బంజరుభూములమీద మార్కెటు రేటు విధిస్తాము అనడం ఎంతవరకు సమంజసమో ప్రభుత్వమువారు ఆలోచించాలి. ఒకవైపున శిస్తులను పెంచుతున్నారు; ప్రాజెక్టులను కడుతున్నామని చెప్పి అభివృద్ధిపన్ను విధిస్తున్నారు.. ఇవికాకుండా మార్కెట్టురేటు అని ఎకరానికి రెండు వందలో, మూడువందలో వసూలు చేసినట్లయితే ఒక ఎకరమో, రెండు ఎకరాలో సాగుచేసుకొనేటటువంటి బీదరైతుపై ఈరకమైన పన్నులను వేయడం న్యాయంకాదు. ఈపన్నులను అతడు కట్టలేకపోవుటవలన భూమిని వదలుకునే పరిస్థితి, ఆ భూమి ధనికరైతు స్వాధీనములోకి పోయే పరిస్థితి యేర్పడుచున్నది. ఈవిధంగా ఆపేదరైతుమీద, లేక ఆ హరిజనుడిమీద మార్కెట్టురేటు, అభివృద్ధి

పన్ను, సర్ ఛార్జీలు, గోపాలరెడ్డిగారి మంత్రివర్గం విధించబోయే **water rate** మొదలగు పన్నులన్నింటినీ వేసినట్లయితే ఆ హరిజనుడు ఆ పన్నులను కట్టుకోగలిగిన పరిస్థితి, తనభూమిని కాపాడుకోగల పరిస్థితి వున్నదా అని ప్రభుత్వ పక్ష సభ్యులందరూ ఆలోచించాలని నేను మరీమరీ విజ్ఞప్తిచేస్తున్నాను. అందువల్ల ఈ భూములమీద మార్కెట్టు రేటు విధించుట న్యాయంకాదు. వారు ఈ భూములను 30, 40, సంవత్సరముల నుంచి, అంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కాలం నాటినుంచి సాగుచేసుకుంటూంటే కాంగ్రెసు ప్రభుత్వము వచ్చి ౧౦ సంవత్సరములయినప్పటికీ, వారికి 'ఎ' ఫారం రికార్డు తయారుచేసి, పట్టాలివ్వకుండా వుండి, ఆ నెపము అంతా ఇప్పుడు సాగుచేసుకొనేటటువంటి హరిజనుని మీదనో, పేదవారిమీదనో వేస్తూ, ఆ నెపంతో వారిమీద మార్కెటు రేటు విధిస్తామనడం ఎంతమాత్రం న్యాయంకాదు. వారికి పట్టాలు ఇవ్వకపోగా, ఈ పన్నులనన్నింటినీ కట్టుకోగలిగే శక్తి వారికి వుందా, లేదా? ఇందులకు బాధ్యత ప్రభుత్వానిది ఔనా, కాదా, అనేది ఆలోచించకుండా ఈ పన్నుల నన్నింటిని వారిమీద వేయడం ఎంతమాత్రం సమంజసంగా లేదు. దీనిని పునరాలోచించ వలసిన అవసరం వుందని ప్రభుత్వానికి మనవి చేయుచున్నాను. ఎన్నో సంవత్సరాలనుంచి సొసైటీల క్రింద కొన్ని భూములు ఉన్నాయి. వాటన్నింటికి మార్కెటు రేటు వేయాలనడం ఎంతవరకు సమంజసమో ఆలోచించాలి. అదే విధంగా కుంట, ఇతర పోరంబోకు భూములు ఉన్నాయి. ఈ కుంటలు సాముదాయకమైనటువంటివనిన్నీ, ప్రజలందరూ వాడుకోవచ్చుననిన్నీ ప్రభుత్వము చెపుతున్నది. ఏ నవాబుల కాలంనుంచో, రాజుల పాలనలోనో ఉన్నటువంటి ఈ కుంటలను బ్రిటిష్‌వారి హయాంలోగాని, కాంగ్రెసు ప్రభుత్వంలోగాని బాగుచేయించలేదు. వీటివల్ల ప్రజలకు ఏమీ ఉపయోగములేదు. ప్రజలు బాగుచేసుకొని సాగు చేసుకుంటూ వుంటే ఇవి అడంగులలో కుంట, పోరంబోకు అని వున్నదని ఏదో నెపంతో వారిని సాగు చేసుకోనివ్వకపోవడం, సాగు చేసుకొనే వారిమీద అధికపన్నులు విధించడం ఎంతవరకు సమంజసమో ప్రభుత్వం ఆలోచించాలి. ప్రభుత్వం ఆ కుంట పోరంబోకులను బాగు చేయనూ చేయదు, ఎవరైనా బాగు చేసుకొని ఒక బస్తా, రెండు బస్తాలు పండించుకుంటామంటేకూడా ప్రభుత్వం అంగీకరించుటలేదు. "ఈకుంటలను ఎవ్వరికీ యివ్వము" అని చెప్పిన ప్రభుత్వమే ఈనాడు రాజకీయ బాధితులకు ఏమీ ఆక్షేపణ లేకుండా వాటిని యిస్తున్నది. గుంటూరు తాలూకాలో గోళ్లమూడి అనే గ్రామంలో ఒక చెరువు వున్నది. ఆ చెరువు విషయంలో అక్కడి ప్రజలందరూ "అయ్యా, మాకు ఇది ఒక్కటే చెరువు. దీనిలోని నీరే మాకు, పశువులకు త్రాగుటకు ఉపయోగ పడుచున్నది." అని మహజర్లు పెట్టి, దానిమీద సంతకాలుచేసి ప్రభుత్వానికి పంపించినప్పటికీ కాంగ్రెసు శాసనసభ్యులలోని ఒకరికి దానిని మంజూరు చేశారు. ఇదెక్కడి న్యాయం?

**Sri T. V. RAGHAVULU** :— ఈబంజరుభూముల విషయంలో హరిజనుల, లేక పేదప్రజానీకంయొక్క స్వాధీనములో నుండే భూములనుండి వారిని తొలగించి రాజకీయ బాధితులకు యివ్వవచ్చును అని ఏదైనా జి. ఒ. ఉన్నదా? ఈ సంగతి వివరించవలసినదని మంత్రిగారిని కోరుచున్నాను.

**The Hon. Dr. B. GOPALA REDDI** :—నాకు తెలిసినంతవరకు లేదు. నాగిరెడ్డిగారు కూడా లేదనే అంటారనుకొంటాను.

**Sri M. NAGI REDDI**:—ఈ విషయంలో నేను గోపాలరెడ్డిగారితో ఏకీభవించలేకపోయినందులకు విచారిస్తున్నాను. బాపట్ల తాలూకా సంతరావూరు గ్రామంలో అనేకమంది పేద ప్రజలు దాదాపు 300 ఎకరముల భూమిని సాగు చేసుకుంటూ వుండగా వారిని తొలగించి ఆ భూమిని రాజకీయ బాధితులకు యివ్వడం జరిగింది. దానిమీద వారు అప్పీలు చేసుకోవడం కూడా జరిగింది.

ఆ భూములను రాజకీయ బాధితులకు ఇవ్వాలని తహశీల్దారు గారు చెప్పగా "ఈ భూములు ఎప్పటినుంచో మా స్వాధీనములో ఉన్నాయి. ఇది రాజకీయ బాధితులకు యిచ్చుటకు వీలులేదని" అక్కడి ప్రజలు కలెక్టరుగారికి అప్పీలు చేసుకోగా కలెక్టరుగారు వెళ్లి విచారించి వారికి యివ్వడం జరిగింది. మళ్ళీ ఇప్పుడు ఆ భూములను తీసుకొని ఎవిక్షన్ ఆపివేసి వాళ్లకు ఇవ్వడం జరిగింది. ఈ విధంగా ఎవిక్షన్ ఆపివేయబడిన భూములనుకూడా రాజకీయ బాధితులకు యిచ్చుటకు ప్రభుత్వం తయారవుతున్నది. కొడవలివారిపాలెం అనే గ్రామంలో గోపాల కోటయ్య అనే ఆయన 1-30 సెంట్ల భూమిని 1950 వ సంవత్సరం నుంచి సాగు చేసుకొంటుంటే తెనాలి వాస్తవ్యుడయిన రత్నసభాపతి అనే ఆయనకు రాజకీయ బాధితుడనే పేరుపెట్టి ఆ భూమి యివ్వడం జరిగింది. అట్లాగే పేటంపాలెం, మొండిబండవారి సొసైటీ భూములన్నిటినీ 30, 40, సంవత్సరాలనుంచి అక్కడి పేద ప్రజలు చేసుకుంటున్నారు—శిస్తు కడుతున్నారు—పోరంబోకులున్నాయి—రసీదులు ఉన్నాయి, సొసైటీ వుంది. అటువంటి భూములనన్నింటినీ రాజకీయ బాధితులకు ఇవ్వడం జరుగుతున్నది. ఒక్క గుంటూరు జిల్లాలోనే ఇటువంటి వేలాది ఉదాహరణలు ఉన్నాయి. మాచర్ల తాలూకాలో కూడా ఎన్నో సంవత్సరాలనుంచి మాల మాదిగలు కొంత భూమిని సాగుచేసుకొంటూంటే వారిని భూములనుంచి తొలగించి రాజకీయ బాధితుడనే పేరుతో సయ్యద్ ఖరీమ్‌సాహెబ్‌కు ఇవ్వడం జరిగింది. ఈ భూములను గురించి రొంపేరులో పెద్ద ఆందోళన జరుగుచున్నది. ఈ భూములను 30, 40 సంవత్సరములనుంచి చేసుకొంటున్నా, అడంగులలో **abandoned tanks** గా వున్నట్టి వాటినికూడా పట్టాలిచ్చుటకు వీలు లేదని చెపుతూ, రాజకీయ బాధితులకు ఇచ్చుటకు ప్రభుత్వం పూనుకొంటున్నది. గుంటూరు తాలూకాలోని గొడ్డమూడి చెరువు విషయమై ఉదాహరణ చెబుతున్నాను. ఆ చెరువును గురించి ఊరిలోని ప్రజలు మహజర్లు పెట్టుకొంటే, ఆభూమిని శాసనసభ్యులలోని ఒకరికి రాజకీయ బాధితుడని చెప్పి ప్రభుత్వం ఇచ్చింది. ఇది న్యాయమేనా ?

రాజకీయ బాధితులు అని చెరువులు ఇవ్వడానికి ప్రభుత్వానికి ఎటువంటి ఆక్షేపణ లేదు. కాని హరిజనులు పేదవాళ్లు తిండిలేనటువంటి వాళ్ళను ఈ భూములు చేసుకోవడానికి వీలులేదు అంటున్నారు. ఈవిధంగా ఆక్షేపణ లేనటువంటి వాళ్ళకు ఈ చెరువు పోరంబోకు భూములు ఇవ్వడం అనేది జరుగుతోంది. అట్లాగే తుళ్లూరుదగ్గర తిరుపతికుంట అనేది ఉన్నది. అందులో 10 ఎకరాల భూమిని హరిజనులు చేసుకొంటూఉండే దానిని రాజకీయబాధితులు అని చెప్పి సత్తెనపల్లి తాలూకాలో బూదుకూరి సత్యనారాయణరెడ్డిగారికి యివ్వడం

జరిగింది అందుచేత ప్రభుత్వం apply చేసేటటువంటి rules, G.O. లు రాజకీయ బాధితులకు ఒకరకంగా apply కావడం సాగుచేసుకొనేటటువంటి హరిజనులకు పేదవాళ్ళకు ఇంకొక రకంగా ఎట్లా apply అవుతుంతో ప్రభుత్వాన్ని ఆలోచించమని కోరుతున్నాను. చెరువులు ఇవ్వకూడదు అనేది నిజమైన సిద్ధాంతంగా ప్రభుత్వం అమలుపరచేదైనట్లయితే రాజకీయబాధితుల కివ్వడానికి ఎందుకు అడ్డం రాలేదు. అందువలన సాగుచేసుకునేటటువంటి పేదవాళ్లను, హరిజనులను వెళ్ళగొట్టి ఏదోవిధంగా రాజకీయబాధితులకు కట్టిపెట్టేయడానికి వేసిన ఎత్తుతప్ప మరొకటిగాదని స్పష్టంగా కనపడుతున్నది. ఈవిధంగా ఇంకొక ఉదహారణఉన్నది. పల్నాడుతాలూకాలో ఆత్మకూరి చెరువు అని 2,3 వందల ఎకరాలు ఉన్నది. ఆ చెరువు పూడిపోయి ఎన్నోసంవత్సరాలు అయినది. ఆచెరువును బాగుచేయించమంటె దానిని బాగుచేయించడానికి estimate తయారు చేస్తున్నామని చెప్పి investigation, investigation అని 10 సంవత్సరాలు కాలం గడిపారు. Investigate చేసిన తరువాత దానిమీద ఆదాయంలేదు. దానిని బాగుచేస్తే లాభంలేదు. దానిమీద ఆదాయము తక్కువ అని ప్రభుత్వం Planning Committee లో చెపుతూవచ్చినది. దానిక్రిందపల్లపుభూములకు శిస్తుతగ్గించమంటె అవి మాగాణి భూములక్రింద ఇదివరకే పుస్తకాలలో అడంగులలో తయారై ఉన్నాయి కాబట్టి వాటికి నీళ్లుపెట్టుకొనకపోయినా పల్లపుశిస్తే వేస్తారు. భూములకు నీళ్లురావడంలేదు చెరువును సాగుచేసుకోనివ్వండి అంటే అది చెరువుకాబట్టి చేసుకోనివ్వము అంటారు. దీనికి ఎక్కడ పొందికకుదురుతుంది? ప్రభుత్వంవారు బాగుచెయ్యకపోయారు. బాగుచేస్తే దానిమీద ఆదాయం లేదంటారు. అనాములు పేదవాళ్ళుచేసుకొంటే evction notice లు ఇచ్చి పంటమీదకోసి పశువులను మేపడానికి ప్రభుత్వం పూనుకొన్నది. అందువల్ల నేనుప్రభుత్వానికి విజ్ఞప్తి చేసేదేమిటంటే చెరువులు వాటిమీద conditional పట్టాలు ఇవ్వండి. అదేవిధంగా కాలువవస్తే ప్రభుత్వం ఇంకోసాకు చెపుతున్నది. ఈ ప్రాజెక్టులు కట్టేటట్లయితే కాలువలు రావచ్చు. అవన్నీవస్తే compensation ఇవ్వాల్సివస్తుంది. కాబట్టి ఇవ్వము అనిచెపుతున్నారు. ఇది సమంజసమైనది కాదని నేను ప్రభుత్వం దృష్టికి తీసుకువస్తున్నాను. ఇవ్వాళ conditional పట్టాలు ఇచ్చి రేపుమళ్లీ కాలవ వచ్చినట్లయితే compensation అడగకూడదు అంటున్నారు. చెరువును బాగుచేసేట్లయితే అందులోనుంచి వెళ్లిపోవాలి అంటారు. ఇవ్వాళ ఎట్లాయితే వెళ్లగొట్టుతున్నామో ఆరోజు ఆవిధంగానే వెళ్ల గొట్టడానికి అవకాశం ఉన్నది. అందుకని ఏ ఆక్షేపణ లేని భూమికి conditional పట్టాలు ఇవడానికి ఆక్షేపణ ఏమున్నది ? ఆ విధంగా భూముల విషయంలో పేచీ పెట్టి రాజకీయ బాధితులకు కట్టిపెట్టడం అన్నది సరైనదికాదు. ఆ condition తోటి conditional పట్టాలు ఇవ్వడం సరైనది. అట్లాగే పల్నాడు తాలుకాలో నడికూడెగ్రామంలో చిటపోలు వారిగుంటఉన్నది. 40సంవత్సరాలనుంచి దానినిసాగుచేసుకొంటున్నారు. ఎటువంటి ఆక్షేపణలేదు. కలెక్టరు వచ్చి వాళ్లందరిని 'A' form record లు తయారు చేయమని చెప్పారు. కాని వాళ్లింతవరకు ఇవ్వరు. అందుకని 'A' form record లు, పట్టాలు ఇవ్వలేదనే కారణంచేత వాటికి మార్కెటు రేటు విధించడం అన్నదిగాని లేదా ప్రాజెక్టులు కట్టేపేరుతో వీళ్లను ఆ గ్రామములలోనుంచి వెళ్లగొట్టడంగాని

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri M. Nagi Reddi) [1st March 1956

రాజకీయ బాధితులు అనే పేరుతో వీళ్లభూములు తీసుకొని వాళ్లకు కట్టిపెట్టడం అన్నది ఏవిధంగాను సమంజసమైనది గాదు. అందువల్ల ప్రభుత్వం వీటినిగురించి ఆలోచించవలసింది ఎంతైన ఉన్నదని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. అట్లాగే లంకభూముల విషయం కూడా. 30, 40 సంవత్సరాలనుంచి లంక భూములు చేసుకొనే వారు ఉన్నారు. అనేక Society లు పెట్టుకొని హరిజనులు, యానాదులు, మొండి బండ లాంటివారు చేసుకొంటున్నారు. అటువంటిది ఈ సంవత్సరం, లంకభూములన్నింటిని 1/3 వంతు వేలంపాట పెడతామనే order ప్రభుత్వం తీసుకు వచ్చింది. 30, 40 సంవత్సరాలనుంచి, ప్రభుత్వం వేసినటువంటి రేటు ప్రకారం డబ్బుకడుతూ వాళ్లు సాగు చేసుకొంటున్నారు. అలాంటి భూములను ఇవ్వాళ 3 వ వంతు వేలంపాట పెడితే ఎవరు కొనగలుగుతారు? ఊళ్లో ఉండే భాగ్యవంతులే కొనగలుగుతారు. అంటే "ఉన్నవాడు ఉన్నవాడికే పెట్టాడు లేనివాడు ఉన్నవాడికే పెట్టాడు" అన్నట్లు, 100 ఎకరాలుఉన్నభూస్వామి అందులో ఒక ఎకరం పచ్చగడ్డి వేసుకొని మేపుకొంటారు ఆయన. 100 ఎకరాలు, 50 ఎకరాలు ఉన్న ఆయనకు పచ్చగడ్డిలేదనే కారణంచేత ఎన్నో సంవత్సరాల నుంచి తలా ఒక ఎకరం, 1/2 ఎకరం, 25 సెంట్లు చేసుకొనే ఆ భూమిని వేలం పెడతాము అంటే అది నిజంగా పేదల నోళ్లుకొట్టడం అవునాకాదా అనేది ప్రభుత్వం ఆలోచించాలని మనవి చేస్తున్నాను. అందువల్ల ఎన్నో సంవత్సరాలనుంచి చేస్తున్న భూములను ఇవ్వాళ అవసరం ఉంది గనుక 3 వ వంతు వేలంపాట system పెట్టడం చాలాతప్పు పద్ధతి అనికూడా ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. అట్లాగే క్రొత్తగావెలిసే లంకలు ఉన్నాయి. వీటిని river conservancy department వారు వెంటనే రెవెన్యూ department వారికి ఇవ్వరు. వాటిని సాగు చేసుకోనివ్వరు.

ఆవిధంగా క్రొత్తలంకలనుఇవ్వరు. పాతలంకలు పూడిపోయి వాగులోకలసిపోయినాయి అంటే వాటిని లేనట్లుగా వ్రాయడంగాని వాటిమీదవున్న శిస్తులు తగ్గించడంఅయినా చెయ్యరు. అందువల్ల ఈ లంకలవిషయంలోకూడా ఇది సరియైనటువంటిది గాదని ప్రభుత్వంవారికి మనవిచేస్తున్నాను. అట్లాగే దోనేపూడి depressed class donine society వాళ్లుకూడా ఎన్నో సంవత్సరాలనుంచి అక్కడ వుండేటటువంటి భూములను చేసుకొంటూవుంటే, దానికి పోటీగా అక్కడ ఉండేటటువంటి భూస్వాముల ప్రోత్సాహంతోటి చంద్రమౌళిగారి పేరుతో society ని నిర్మించారు. చంద్రమౌళిగారి పేరుపెట్టడంచేత ఈసొసైటీ చేసుకొనే భూములను ఆ సొసైటీవారికి ఇవ్వడం జరుగుతోంది. ఒకచోట ఒక society ఉండి పనిచేస్తుంటే ఇంకొక society పోటీగాపెట్టడం అనేది అన్నిచోట్ల వర్తిస్తుందా అంటే వర్తించదు. అంటే అక్కడ ఉండేటటువంటి భూస్వాములకు వాళ్ళకు లొంగిపోవడం అనేటటువంటిది జరుగుతుంది. అట్లాగే పోటీ society లు పెట్టి అక్కడ ఉండేటటువంటి వ్యవసాయ కూలీలకు పేచీలుపెట్టడం భూములు ఇవ్వకపోవడం జరుగుతోంది. ఇక forest బంజర్లు ఉన్నాయి. ఈ forest బంజర్లలోకూడా కొన్నివేల ఎకరాలు ఉన్నాయి. ప్రభుత్వం ఒకవైపున forest లు తక్కువవాటిని పెంచాలి అభివృద్ధిచెయ్యాలి అని చెపుతోంది. కాని ఎన్నోసంవత్సరాలనుంచి వినుకొండ తాలూకాలో three districts colonisation soci-

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)



అని దాదాపు 300, 400 మంది సభ్యత్వంతో 4, 5 వేల ఎకరాల భూమిని సాగుచేసుకోవడానికి ప్రభుత్వం permission కూడా ఇచ్చింది. సాగుచేసుకొని పంట పండించుకొని సరైన పరిస్థితిలో ఉండేటప్పటికి ఇవ్వాళ, ఇవ్వడానికి వీలు లేదని భూములు ఇవ్వకుండా ఉండడం జరుగుతోంది. Military వాళ్లు, హరిజనులు, వెనుకబడినటువంటి చెంచులు వీళ్లందరుకలసి మూర్తిజాపురంలో three districts colonisation society పెట్టి 4, 5 వందల ఎకరాలు చేసుకొంటూ ఉంటే ఆభూమిని అంతాకూడా ఇప్పుడు రద్దుచేయడం జరుగుతోంది. అదే విధంగా పల్నాడు తాలూకాలో తుమ్ముకోటవద్ద ఊరికనే ఉన్నటువంటి forest బంజరును మాకు ఇవ్వమని ఆందోళనచేస్తే Kumri System మీద సాగుచేసు కోమని నెం. 86,895/533 రు dated 10—8—53న ప్రభుత్వం order ఇచ్చారు. ఇచ్చిన తరువాత ఎన్నాళ్లకు కూడా భూములను స్వాధీనం చేయనందున సత్యాగ్రహం చేయవలసి వచ్చింది. సత్యాగ్రహం చేస్తే మమ్మల్ని 100 మందిని జైల్లోపెట్టడం జరిగింది. తరువాత ఏమన్నారంటే అది ఇవ్వడానికి వీలు లేదు, మాకుకొన్ని ఆక్షేపణలు ఉన్నాయి, plantation చెయ్యాలి అనుకొంటున్నాము, మంచికల్లుదగ్గర ఇస్తాము అన్నారు. పోనీ ఏదోఒకటి ఇస్తారు. ప్రభుత్వంతోటి పోరాటం ఎందుకని మంచికల్లునిస్తే దానిచుట్టూ ఇదివరకే boundaries కొట్టారు కాని ఇవ్వరు. ఇప్పుడు దానినిగూడ ఇవ్వడానికి వీలు లేదు అంటున్నారు. అదేవిధంగా సత్తెనపల్లి తాలూకాలో అనేకచోట్ల వేలకొలది ఎకరాల forest బంజర్లు ఉన్నాయి. బోదనం, పెదనెమలిపురి, చిననెమలిపురి మొదలగుచోట్ల ఈభూములన్నిటిని సాగుచేసుకొంటామంటే వాళ్లకు భూములు ఇవ్వరు. ఇప్పుడు రాజకీయబాధితులకు ఇవ్వడానికి ఎటువంటి ఆక్షేపణా లేదు. రాయిడిపాలెం బంజరు 830 ఎకరాలు ఉంటే దానిని పేదలు సాగుచేసుకుంటూ ఉంటే అది పేదవాళ్లకు ఇవ్వడానికి వీలు లేదని వాళ్లను evict చేసి రాజకీయ బాధితులకు మాత్రం ఇస్తున్నారు. అందుచేత నేను తోటిసభ్యులు రాఘవులుగారికి వారు రాజకీయ బాధితులకు ఎక్కడ ఇస్తున్నారు అంటున్నారు. Glaring instance చెప్పుతున్నాను. గుంటూరు జిల్లాలో సత్తెనపల్లి తాలూకాలో రాయిడిపాలెంforest బంజరు 830ఎకరాలు అక్కడ సాగుచేసుకొనేటటువంటి హరిజనులకు forest బంజర్లు ఇవ్వడానికి వీలు లేదని, ఇవ్వాళ రాజకీయ బాధితులు అనిచెప్పి వాళ్లకు ఇవ్వడానికి తయారౌతున్నారు. అందువల్ల ఈవిధంగా forest లు పెంచాలి, ఇవ్వడానికి వీలుకాదని హరిజనులకు వంకచూపుతున్నది ప్రభుత్వం. రెండోవైపున రాజకీయ బాధితులకు ఇవ్వవచ్చేటప్పటికి అడవులు పెంచవలసిన అవసరం లేదు. ఇదేమి ప్రభుత్వం, ఇదెక్కడి న్యాయము? ఏసూత్రాన్నిబట్టి ఇవన్నీ చెప్పగలుగుతున్నారో ప్రభుత్వం ఆలోచించాల్సిన అవసరం ఉంది. అయితే కొందరు సభ్యులు మాతీర్మానం అంగీకరించవీలు లేదని ఆక్షేపణ తీసుకొని వచ్చారు. ఎందుచేతనంటే కొండయ్యచౌదరిగారు మాట్లాడినప్పుడు బంజర్లు అంటే అన్నిరకాలు బంజర్లుగానే ఉన్నాయి. ఉమ్మడికి పనికివచ్చేవి ఉన్నాయి. ఇవన్నీ పంచడానికి ఎట్లాసాధ్యం అవుతుంది అంటారు. అసలు ఊళ్ళో, ఊరుచుట్టూ ఉండే పొలాల్లో గొడ్లు, పశువులు ఏమీ పోకుండాఉండే పరిస్థితి తీసుకొని వస్తున్నారనే ఆక్షేపణ పోయిన సభలోతీసుకొనిరావడం జరిగింది. ఇవ్వాళ మేము తీ

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri M. Nagi Reddi) [1st March 1956

కొనివచ్చినటువంటి దానిలో సాముదాయక భూములుకూడా ఉన్నాయని అంటున్నారు. పంచాయితీ Act లో A. B. Nageswara Rao గారు యిచ్చినటువంటి orders వారికి తెలుసు. సాముదాయక భూములుగాని, శ్మశాన భూములుగాని పోరంబోకులుగాని 4, 5 variety లన్నీకూడా ఇవ్వాలి సాముదాయకంగా ఉండాలని పంచాయితీ బోర్డులకు hand over చేయాలని చెప్పిఉన్నారు.

అందువల్ల వాటిలోకి పోవడంలేదు అనేటటువంటి సమస్యలేనేలేదు. అవికూడ ఎక్కువ ఉన్నచోట చేసుకొంటూనే ఉన్నారు. ఎలాగూ, నడికూడె పంచాయితీకి బండలపాలెమనేటటువంటిది ఒకేసారి 20 ఎకరాల భూమి స్మశానానికి పెట్టారు. ఆ ఊళ్లో వాళ్లు అంతమంది చచ్చినాకూడ అనంతా ఆక్రమించేటట్లులేదు. కనుక దాంట్లో కొంత సాగుచేసుకోడానికి ఇచ్చాము.

**The Hon. Sri A. B. NAGESWARA RAO :—** Unauthorised గా చేయకూడదని చెప్పుతున్నాను.

**Sri M. NAGI REDDI :—**Unauthorised అంటే, దానిలోకూడ కొంత న్యాయముండవలసి యుంటుంది. నేను పంచాయితీబోర్డు ప్రసిడెంటుగా కూడ, స్వయముగా నాకు తెలిసిన విషయము చెపుతున్నాను. మా పంచాయితీ బోర్డులో శ్మశానానికిగాను దాదాపు 20 ఎకరాలు పోరంబోకని ఇచ్చారు. అక్కడ ఉన్నది మూడువేల జనాభా. అందరూచచ్చినాకూడ దాన్నంత ఉపయోగించేటట్లు లేదు. అందువల్ల దాంట్లో కొంతమంది వ్యవసాయం చేసుకోవచ్చునని పంచాయితీ బోర్డులో మేముకూడ ఒక resolution pass చేసి ఇచ్చాము. ఏదో బ్రిటిషు సమయములో బండలపాలెము ఊరికేఉన్నదని ఈ విధంగా ఇచ్చారు.

**The Hon. Sri A. B. NAGESWARA RAO:—**ఏ కులానికైనా గాని స్మశానము ఉండితీరాలి గనుక unauthorised గా అందులో ఎవరికి సాగు చేసుకోవడానికి ఇవ్వకూడదని నాగరెడ్డిగారికి మనవి చేస్తున్నాను.

**Sri M. NAGI REDDI :—**ఏదైనా సాముదాయకమైన భూములుంటే, అనగా తోపు పోరంబోకులుగాని, స్మశాన పోరంబోకులుగాని, కళ్లాల ప్రవేశాలు గాని ఇలాంటివి ఉంటే అవి ఆక్రమించాలని మాఉద్దేశం కాదు. అది మాతీర్మానము యొక్క ఉద్దేశంకూడ కాదు. మీరు అట్లాంటి సవరణ ఇవ్వాలంటే, దాన్ని అంగీకరించేందుకు మా ఆక్షేపణ ఏమీలేదు. మాఉద్దేశములో, forest బంజర్లుగాని, లంకభూములుగాని, లేదా, శిస్తుకట్టినా కట్టకపోయినా, తదితర పోరంబోకు భూములు గాని, ఆక్షేపణలేకుండా ఉండేవి చేసుకోవచ్చునని, ఆక్షేపణ అంటే ప్రభుత్వము ఒక దృష్టితో చెప్పుతారు, మేము ఒకదృష్టితో చెప్పుతాము. ఎందువల్లనంటే ప్రభుత్వానికి రాజకీయ బాధితులకు ఇవ్వాలంటే ఆక్షేపణలేదుగాని, ఇతర బీదప్రజలకు ఇవ్వాలంటే ఆక్షేపణచెప్పుతారు, కనుక మేము చెప్పేది, ఉమ్మడి పనులకు, సాముదాయకమైన పనులకు అవసరమైనటువంటివి మాత్రము మినహాయించి, మిగతా భూములను, ఎన్నోసంవత్సరముల నుంచి penalties లేకుండా చేసుకొంటున్నటువంటి భూములు, సొసైటీలక్రింద ఉన్నటువంటి భూములను ఇవ్వడంలో ప్రభుత్వము ఎందుకు ఆక్షేపణ చెప్పాలో అర్థంకావడంలేదు. ఇంకొక విషయము వారిదృష్టికి తీసుకు రావలసి వస్తున్నది.

నరసాయిపాలెము కరణముగా ఉంటే అతను ఈవేళ రాజకీయ బాధితుడుగా తయారవుతున్నాడు. ముందు ఏమిచేశాడంటే, ఎవరో సాగుచేసుకొంటున్నటువంటి భూములు తనపేరట B. form లో వ్రాసుకొన్నాడు. Board Standing Orders ప్రకారము, కరణముగాగాని మునసబుగాగాని పనిచేసేటటువంటి వాళ్ళు ప్రభుత్వము అనుమతి లేనిదే ఏది ఆక్రమణగాని తమ పేరట వ్రాసుకోడానికి వీలు లేదు. అట్లాంటి Board Standing Orders ను అతిక్రమించి, ఆభూములను తనపేరట చేసుకొంటే, అది తప్పుఅని ఆక్షేపణగా remarks వస్తే, ఇవేళ మళ్ళీ రాజకీయ బాధితుడుగా ఆ భూములను తీసుకోడానికి తయారవుతున్నాడు. కనుక ఇవన్నీకూడ ప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని ఉమ్మడి బంజరు పనులకు అవసరమైనటువంటివి తప్ప మిగతా బంజర్లన్నిటినీ కూడ ఎన్నో సంవత్సరములనుంచి చేసుకొంటూ ఉండేటటువంటి భూములను, ఏలాటి market value విధించకుండా, అవి చేసుకొంటున్నవాళ్ళకు ఉచితంగా పట్టాలు ఇవ్వాలని, రాజకీయ బాధితులనే పేరుతో వాళ్ళకు ఆభూములను కట్టిపెట్టడమనేటటువంటిది సరియైనటువంటి పద్ధతి కాదని మనవిచేస్తున్నాను. ఇదివరకు ప్రకాశం, సంజీవరెడ్డిగారి ప్రభుత్వములో పేదవాళ్ళకు ఉచితంగా బంజరు భూములు పంచిపెట్టవలెననే తీర్మానం శాసనసభలో ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

(Interruption by the Hon. Dr. B. GOPALA REDDI)

**Sri M. NAGI REDDI** :—అప్పుడు వొత్తిడివల్ల ఆవిధంగాచేశారని గోపాలరెడ్డిగారు చెప్పుతున్నారు. అంటే, ఇప్పుడుఒత్తిడి తీసుకొనివస్తే గోపాలరెడ్డిగారు ఒప్పుకొంటారన్నమాట. ఇప్పుడు ప్రజలవద్దనుండి వొత్తిడితగ్గింది, గనుక మేమువినము అంటున్నారు. ఈవేళ ప్రజలవద్దనుంచి వొత్తిడి తగ్గించాలంటే అదికాదు. ఈవేళ అసెంబ్లీలో 196 సభ్యులలో 140, 160 మంది మేముఉన్నాము, మాకు majority ఉన్నది,మేము ఎట్లుచెప్పితేఅట్లు జరుగుతుంది అని ఆవిధంగా చెప్పితే, దానికి మేముచెప్పగలిగింది ఏమీలేదు. ముఖ్యంగా హరిజన ప్రతినిధులుగా వచ్చినటువంటి కూర్మయ్య, రాఘవులు, N. శ్రీనివాసరావుగారులు ఇలాంటివాళ్లు వీరికి మాతో రాజకీయభేదాభిప్రాయాలు ఉన్నప్పటికీ, నిజంగా వీరు హరిజనులకు ప్రాతినిధ్యము వహించేటటువంటివారైతే, హరిజనులు ఈవిధంగా భూములనుంచి వెళ్ళగొట్టబడుతూ, కష్టపడుతూఉండేటప్పుడు, వారికి ప్రాతినిధ్యము వహించేవాళ్లు తప్పకుండా గోపాలరెడ్డిగారిమీద, చంద్రమౌళిగారిమీద ఒత్తిడితీసుకురావలసిన అవసరమున్నది. కాబట్టి, ఉమ్మడిపనులకు అవసరమైన భూములను మినహాయించవలెననే సవరణ మీరుపెట్టినా మాకు ఆక్షేపణలేదుగాని ఈ బంజరుభూములను తొందరగా పంచిపెట్టవలెననేది కాంగ్రెసు సభ్యులతోసహా అందరు బలపరచాలని కోరుతూ ఈవిషయాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకొనివస్తున్నాను.

**Sri P. NARASIMHAPPA RAO**:— అధ్యక్షా, ఈ బంజరుభూములను గురించి ఇదివరకు మన నాగిరెడ్డిగారు మాట్లాడారు. బంజరుభూములను పంపకము చేయుట అవసరమే. కాని ప్రతి గ్రామములోను కొంతభూమి పశుగ్రాసమునకు విడిచిపెట్టి మిగతాభూమి పేదవాళ్ళకు ఇవ్వడం న్యాయంగా ఉంటుంది. ఇప్పుడు జరుగుతున్న పనిమటుకు అదికాదని నేను మనవిచేస్తున్నాను. ప్రతిగ్రామానికి శ్మశానమనేది వుండాలి, పొలానికి పోవడానికి దారిఉండాలి. బంజరుభూములు

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri P. Narasimhappa Rao) [1st March 1956

ఇస్తామని ఒక్కమాట గవర్నమెంటు అన్నారని ప్రతివాళ్లు దారినికూడ వదలి పెట్టకుండా ఉంచుకుంటున్నారు. ఇద్దరు చచ్చిపోతే, ఇద్దరిని ఒక్కసూటు తగల పెట్టడానికికూడ వీలులేకుండాఉన్న స్థలమంతా occupy చేస్తున్నారు. బంజర్లు చాలా ఉన్నాయి. పాలకొండదగ్గర సీతంపేట అని ఉన్నది. పాలకొండ దానికి కలి సేఉన్నది. అక్కడ రమారమి 3, 4 వేలు ఎకరాలు forest లేకుండాబంజరుభూమి ఉన్నది. అదిచేసుకోడానికి కావలసినవాగులుకూడా ఉన్నవి. అటువంటివి భూములు లేని పేదవాళ్లకు పంచిపెట్టి ఇచ్చినారంటె, వాళ్లు వ్యవసాయం చేసుకొని బాగు పడడానికి వీలుంటుంది. కాని ఇప్పుడు temporary గా వాళ్లకు పట్టాఇచ్చి తరువాత కావలసినప్పుడు తీసుకోవచ్చు అని మన నాగిరెడ్డిగారు చెప్పారు. అయితే, అది వేసినప్పుడు వేపకొమ్మ, తీసినప్పుడు అసురమ్మ అవుతుందని మనవిచేస్తున్నాను. వేసినప్పుడు వేపకొమ్మేఅది. అయితే, తీసేటప్పుడు అసురమ్మ అంటే అమ్మవారు అవుతుంది అన్నమాట. కనుక భూములలో ముందు ప్రవేశించటానికి స్థానమిచ్చినట్లయితే మరల వాటినుండి విడగొట్టడానికి చాలాకష్టము. అందుచేత ఇచ్చేటప్పుడు ఏరకమైన భూములు ఇవ్వవచ్చు, ఏరకమైన భూములు ఇవ్వకూడదు అనేది ఆలోచించి ఇవ్వాలి. ఇప్పుడు ముఖ్యంగా పశువులు చాలా ఇబ్బందిపడుతున్నాయి. పశువులు నిలవడానికికూడ స్థలములేదు. ఎవరికైనా ఏమాత్రము పొలమున్నా, దానిప్రక్కన 4 సెంట్లు బంజరుఉంటె, దాన్నికూడ కొలుపుకొని దున్నేసుకొంటారు. దీనికి కారణము, 1947 లో Grow More Food క్రింద అటువంటి అవకాశం ఇచ్చారు. దానిక్రింద ఉన్నబంజర్లు, చెరువుగట్లు, ప్రక్కనఉన్న రస్తాలు అన్నీ దున్నేస్తున్నారు. కనుక గ్రామానికి ఎంతభూమి విడిచిపెట్టాలో, అది విడిచి పెట్టి, మిగతాభూమినిమాత్రం ఇవ్వాలి. ఆ ఇవ్వడంకూడ న్యాయంగా హరిజనులకు, బీదవాళ్లకు ఇవ్వాలి. ఎవరుకూడ తనభూమితోపాటు ప్రక్కనవున్న బంజరు భూమిని కలుపుకుని దున్నుకోవడమనేది జరుగకుండాచేసి, అది బీదవాళ్లకు ఇవ్వాలి. పాలకొండలో సీతంపేటదగ్గర 5, 6 వేల ఎకరాలు బహిరుఖ్యానిగా ఉంటున్నది. అక్కడ బెంగాల్‌నుంచి ఎవరినో తీసుకునివచ్చి ఏదో colony కడతారని చెప్పుతున్నారు. అటువంటివాళ్లను అక్కడ ఏదోకట్టించేదికాకుండా, ఆ చుట్టు ప్రక్కల ఉన్నభూములు లేనివాళ్లకు, హరిజనులకు ఇచ్చినట్లయితే వాళ్లు అవి చేసుకుని బాగుపడడానికి వీలుంటుంది. అక్కడ వాటికి కావలసిన నీటివాగులుకూడ ఉన్నాయి. ఇంకెవరినో అక్కడకు తీసుకువచ్చి colony కట్టించేబదులు, మన ఆంధ్ర రాష్ట్రములో ఉన్నటువంటి భూములు లేనివాళ్లను తీసుకువచ్చి అక్కడపెడితే బాగుంటుంది. అలాంటిపరిస్థితులు కల్పించవలెనని మంత్రిగారిని కోరుతున్నాను. తరువాత Congress Certificates పుచ్చుకున్నవాళ్లకంతా భూములివ్వడమనేది ఏమాత్రం సమంజసమైనదికాదు. 1947–48లో కాంగ్రెసులోఉన్నవాడు, లేనివాడు certificates పుచ్చుకోవడం జరిగింది. ఆ certificates తీసుకొన్నవాళ్లకు భూములిస్తామని చెప్పడంవల్ల, ఎవరంటేవాళ్లు ఎవరినో కాంగ్రెసువారిని పట్టుకొని అయ్యా ఇదికొంచెము చేయించమనడము వారు, ప్రసిడెంటుగా ఉన్నా లేకపోయినా, ఇదివరకు ప్రసిడెంటుగా ఉంటేచాలు అటువంటివారి సంతకముతో ఒక certificate పుచ్చుకోవడము, దానితో application పెట్టుకోవడము జరుగుతున్నది. భూములు ఉన్నవాళ్లు, లేనివారుకూడ దరఖాస్తులు పెడుతున్నారు.

భూములు లేనివారికి న్యాయంగా ఇవ్వవలసిందే. కాని భూములు ఉన్నవాడు కూడ కావాలనడం సబబుకాదు. ముఖ్యంగా ఇది మంత్రిగారు ఆలోచించవలసిందని కోరుతున్నాను. నిజంగా హరిజనులు చాలామంది చాలాబాధలు పడుతున్నారు. అటువంటివారికి ఇవ్వండి. ఆ ఇచ్చేదికూడ న్యాయంగా ఇవ్వండి. గ్రామానికి కావలసినంత భూమి ఉంచి మిగతాది వారికి ఇవ్వండిగాని, సభ్యులు చెప్పినట్లు ఉన్నదంతా ఇచ్చివేయమనేది సబబుకాదు. ముఖ్యంగా పశువులవల్ల మనమందరుకూడ వృద్ధిపొందుతున్నాము. అటువంటి పశువులకు మేతకూడా లేకుండా చేయడం సరికాదు. గ్రామానికి, పశువులకు కావలసినంత విడిచిపెట్టినా, ఇంకా హెచ్చుగానే బంజర్లు ఉంటాయి. అవన్నీ ఇవ్వవచ్చు. కాని ఈ **political sufferers** విషయములోమటుకు న్యాయము ఆలోచించి పట్టాలు ఇప్పించవలసిందని కోరుతున్నాను. కొంతమంది హరిజనులు, మిగతావారు చెప్పినట్లు, నాకు నూరు ఎకరాలు భూమి ఉన్నాసరే, నేను **political sufferer** ను అని ఒక **certificate** తీసుకొనివచ్చి ఇస్తే ఆ భూమిలో చేసుకొంటున్నవాళ్లను వెళ్లగొట్టి నాకు ఇచ్చేస్తున్నారు. ఆవిధంగా అక్కడవున్నవాళ్లను తప్పించి మాకు ఇమ్మని చాలామంది ప్రయత్నంచేస్తున్నారు. అదిమటుకు చాలా అన్యాయముఅని మనవిచేస్తున్నాను. కనుక ఈవిషయాన్ని జాగ్రత్తగా ఆలోచించి లేనివారికిమాత్రం భూములు ఇప్పించవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

**Sri PRAGADA KOTAIAH** :—అధ్యక్షా, ఈ బంజర్ల పంపకము అనేది చాలాచిక్కు సమస్యగా ఉన్నది. ప్రభుత్వముకూడ దానిని మరింత చిక్కులో పెట్టింది. ప్రభుత్వం రోజుకు ఒక ఉత్తరువు ప్యాసు చేస్తున్నందువల్ల యిది చాలా గడ్డుసమస్యగా పరిణమిస్తున్నది. అనేక సందర్భాలలో పరిస్థితులను, అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఒక పర్యాయము యిచ్చిన ఉత్తరువులను వెంటనే మార్పు చేస్తున్నందువల్లనే, చిక్కులు ఎక్కువగా ఏర్పడటానికి కారణమవుతున్నది. ఈ సంగతి ప్రభుత్వానికిగూడ తెలుసును. అసలు యీబంజర్లు ముఖ్యముగా ఎవరికి యివ్వాలి అనేసందర్భము వచ్చినప్పుడు, గడచిన కాంగ్రెసు ప్రభుత్వము ఒక స్పష్టమైన నిర్ణయము చేసింది. అది యేమిటంటే, పేదవారికి అంటే, భూములులేని వారికి ఒక్కొక్కరికి 2½ ఎకరములకు లోపల ఉండినట్లయితే, అతడు **land-less-poor**-గా పరిగణింపబడుతాడు, అంతవరకూ అతనికి బంజరుభూమి యివ్వవచ్చునని నిర్ణయము చేసింది. అయితే యీవిషయములో ముందువెనుకలు చూడకుండా, ప్రభుత్వము తమకు తోచిన ఉత్తరువులు ప్యాసు చేయడమువల్ల, ముఖ్యంగా మాగుంటూరు జిల్లాలో యీసమస్య చాలాచోట్ల అనేకచిక్కులలోకి దించింది. ప్రజలకుగూడ ప్రభుత్వాన్ని, దానియొక్క విధానాన్ని గురించి చాలా అపోహలు అనుమానాలు కలగటానికి అవకాశాలు ఏర్పడ్డాయి.

**The Hon. Dr. B. GOPALA REDDI** :— మద్రాసు రాష్ట్రములోగాని, యు.పి., బీహార్, బెంగాల్, బొంబాయి రాష్ట్రాలలోగాని, ఎక్కడైనాగాని యీబంజరు భూములు ఉచితముగా యివ్వాలని ఏ ప్రభుత్వము అయినా నిర్ణయించిందా? అంటే యీవిషయము నాకు తెలియదు గనుక అడుగుతున్నాను.

Sri PRAGADA KOTAIAH :— మద్రాసు రాష్ట్రములో యిటీవలనే అన్నిజిల్లాలలోను క్రమక్రమముగా బంజరుభూములు యావత్తు పేదవారికే యివ్వాలని నిర్ణయించి, అక్కడ రెవిన్యూ మంత్రి మాణిక్యవేలు నాయకరుగారు సేలంప్రాంతం వెళ్ళి, పట్టాలుగూడ యిచ్చినట్లు పత్రికలలో వచ్చింది. నేను చూచాను. అంతకుమించి నేను వినలేదు.

The Hon. Dr. B. GOPALA REDDI :— అంతా ఉచితముగా యివ్వమనేనా?

Sri PRAGADA KOTAIAH :— అంతా ఉచితముగానే యివ్వమని కాదుకాని, కొన్నిచోట్లలో వీలుఅయినంతవరకు ధనముకూడ రాబట్టుతున్నారు.

The Hon. Dr. B. GOPALA REDDI :— బంజర్లు ఇవ్వవచ్చునని మద్రాసు ప్రభుత్వముయొక్క policy అయితే అయిఉండవచ్చుకాని, ఉచితముగా మాత్రము కాదని నా అభిప్రాయము. అంతేనంటారా?

Sri PRAGADA KOTAIAH:—అంతా ఉచితముగా యివ్వమని నేను చెప్పడములేదు. చెప్పిఉంటే, దానిని నేను withdraw చేసుకుంటున్నాను. ఎందుకంటే, కొన్ని ప్రత్యేక పరిస్థితులనుబట్టి అవసరములనుబట్టి, యీబంజర్లమీద ప్రభుత్వం కొంతధనముకూడ రాబట్టడానికి ప్రయత్నించవచ్చు. వద్దని నేను చెప్పను. కాని Board's Standing Orders కు విరుద్ధముగా మాత్రము ప్రభుత్వం ఉత్తరువులు ప్యాసుచేస్తున్నది. Board's Standing Orders లో first encroacher కు first preference యివ్వాలని ఉంది. అయితే unauthorised గా భూమిలో ఎవరైనా ప్రవేశించిఉంటే, ఆయనను ఎప్పుడైనా ప్రభుత్వము వెళ్లగొట్ట వచ్చు, అనిఉన్నది. అయితే మాకుతోచిన వారికి మేము భూములు యివ్వవచ్చు అని అభిప్రాయ పడుతూ, ప్రభుత్వం G. Os. ప్యాసుచేస్తున్నది. కాని B. S. O. లో భూమిమీద first encroacher కు ఆ భూమిని assign చేసేటప్పుడు first preference యివ్వాలని మాత్రము స్పష్టముగా చెప్పబడియున్నది. దాన్ని ఆధారముగా తీసుకుంటే, ప్రభుత్వము యిటీవల ప్యాసుచేసిన G. O. లు ఏవిగూడ చెల్లక పోవచ్చు. (Interruption)

The Hon. Dr. B. GOPALA REDDI :— First encroacher ఒకపెద్ద land-lord అయియుంటే, అప్పుడు ఏమిచేయాలి?

Sri PRAGADA KOTAIAH :— Land Lord అయితే, అతనికి భూమి యివ్వవలసిన అవసరమేఉండదు. ఎందుకంటే, రెండున్నర ఎకరములకంటె మించి ఉన్నవారికి బంజర్లు యివ్వవలసిన అవసరములేదని అంటున్నారు కాబట్టి అందువల్ల ఆభూమిని assign చేసేటప్పుడు, పేదవాడు, యీ 2½ ఎకరములుగూడ లేనివాడు అనేది దృష్టిలో పెట్టుకుని యివ్వాలని అంటున్నాను. అంటే, భూములు ఉన్నవారికి యీ భూములు యివ్వనవసరము లేనేలేదు. భూములు ఏమాత్రము లేనివారికే యివ్వాలని అంటున్నాను. ఏవ్యక్తి అయినా, అతను పేదవాడు అవునా, కాదా, యిదివరకు ఆ వ్యక్తికి భూమి ఉన్నదా, లేదా, ఉంటే ఎంతఉన్నది,

అంతకంటె లేనివాడికి యివ్వాలి అనే విషయములు అన్నీ పూర్తిగా విచారించిన తరువాతనే, యివ్వాలని అంటున్నాను. ప్రభుత్వము ఏవో కారణములు చూపించి ఇతను political sufferer కాబట్టి, ఈయనకు భూమిని temporary గా assign చేశాము, అని చెబుతూ, ఆ భూమిలో యిదివరకు ఇంకొక వ్యక్తి పదెనిమిది సంవత్సరములుగా సాగుచేస్తున్నప్పటికినీ, అతనికి హక్కులేదు, ఈ political sufferer కే ఆ భూమిని యిస్తున్నాము, ఆ భూమిని మొదటి encroacher అయినప్పటికినీ, ఆయన విడిచిపెట్టవలసిందేనని చెప్పడం ఈ ప్రభుత్వము యొక్క అనుచిత విధానమని తప్పనిసరిగా చెప్పవలసివస్తున్నది. First encroacher కే first preference యివ్వాలని B. S. O. లో ఉన్నప్పుడు, B. S. O. ను revise చేయకుండా, ప్రభుత్వము యీవిధముగా యిష్టమువచ్చిన ఆర్డరు ప్యాసుచేయడమనే విధానము అనుచిత విధానము అవునో, కాదో ప్రభుత్వమునే గ్రహించమని అంటున్నాను. ఆ విధముగా ఎందుకు ప్యాసుచేస్తున్నారో బోధపడడములేదు. ఇటువంటివి మా గుంటూరు జిల్లాలో చాలా కేసులున్నవి. హైకోర్టులో యీరోజునచూస్తే ఎన్నో writs వేసియున్నారు. ఈ writs అన్నింటిలోనూ హైకోర్టు stay orders యిచ్చారు. మామూలుగా జరిగే వ్యవహారము అంతాగూడ ఆగిపోయి యున్నది. అందువల్ల యీ fist encroacher పేదవాడు అయినప్పుడు, అతనికే ప్రభుత్వము first preference యిస్తే, వాళ్లయొక్క సాధకబాధకాలు చాలామటుకు తొలగించటానికి అవకాశము కలుగుతుంది. రాజకీయబాధితులకు భూములు యివ్వకూడదు అని నేను చెప్పడములేదు. రాజకీయబాధితులు అయినవారుకూడ పేదవారుగావుంటే, ఏవిధంగాను భూములు లేనివారుగావుంటే, వారికిగూడ భూములు తప్పనిసరిగా యివ్వవలసిందే. కాని, యీరాజకీయబాధితులు అనేవారుధనవంతులుగాను, యితరత్రా భూములున్నవారుగానుంటే, యిప్పుడు గవర్నమెంటు రాజకీయబాధితులకు భూములు యిస్తాము అని జి. ఓ. ప్యాసుచేసింది కాబట్టి, ఆ భూములువున్నవారుకూడ, మనముకూడ రాజకీయబాధితులము గనుక మనకు గూడ భూములువస్తాయి అనే ఉద్దేశ్యముతో ధరఖాస్తులు పెట్టుకుందాము, భూములు సంపాదించుకుందామని ముందుకువస్తే, పేదవారికి యివ్వకుండా ధనవంతులకు యివ్వటములో ప్రభుత్వమునకువచ్చే ప్రతిష్ఠ యేమిటి అని అడుగుతున్నాను. రాజకీయబాధితులుగా ఉన్నవారు నిజముగా భూములులేనివారుగా ఉంటే, పేదవారితోపాటు వారికిగూడ భూములు యివ్వడములో ప్రభుత్వముయొక్క ప్రతిష్ఠకు భంగముతేదని చెప్పగలను. ఎందుకంటే వారుకూడా పేదవారే. ఏవో ఒక కాంగ్రెసుపార్టీవారనో, సోషలిష్టుపార్టీవారనో, కమ్యూనిస్టుపార్టీవారనో ముందుకువచ్చినవారు పేదవారు, మిగతావారు పేదవారుకారు అనే ధోరణిలో మాట్లాడేవాడినికాను. అందువల్ల ప్రభుత్వం యీవిధానాన్ని మార్చుకోకపోతే, యీ బంజర్ల పంపకము విషయములో చాలాచిక్కులు ఏర్పడటానికి అవకాశము వున్నది. పోతే దీనికి యిప్పుడు జరుగుతున్న red - tapism ను గురించి చెప్పాలంటే, ఒక ఉదాహరణ చెప్పుతున్నాను. మా జిల్లాలో చీరాలదగ్గరగా, వాడరేవులో ఒక Fishermans Co-operative Society కి గాను సుమారు మూడువందల ఎకరాలు assign చేయటానికి 1948 వ సంవత్సరములో ఒక G. O. ప్రభుత్వము ప్యాసుచేశారు. దానినిగురించి, నేను క్రిందటిసారి

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri Pragada Kotaiah) [1st March 1956

బడ్జట్టు సెషనులోనే refer చేశాను. ఈరోజువరకూ దాన్నిగురించిన సమస్య ప్రభుత్వం పరిష్కారముచేయలేదు. ఆ red - tapism అనేది ఏస్థితిలో ఉంటున్నదో ప్రభుత్వమే గమనించాలని అంటున్నాను. ఇలాంటివి ఎన్నోవిషయాలు ప్రభుత్వ ముయొక్క దృష్టికి తీసుకొనిరాగలను. సంసాస్థానికి 1948 వ సంవత్సరములో యీ మూడువందల ఎకరాలకుగాను పట్టా యివ్వవలసిందని జి. ఓ. ప్యాసుచేస్తే, దాన్ని యింతవరకూ అమలుపరచలేదు. ఈరోజున మనము 1956 వ సంవత్సర ములో ఉన్నాము. ఇప్పటికి ఆ జి. ఓ. ప్యాసుఅయి దాదాపు ఎనిమిది సంవత్సర ములు అవుతున్నది. ఈవిషయము గతబడ్జెటు సందర్భములో తీసుకొనివచ్చి చెప్పాను. దాన్నిగురించి యింతవరకూ ఏమిపనీగూడ జరగలేదు. దీనినిబట్టి ప్రభుత్వ డిపార్టుమెంటులలో ప్రభుత్వముయొక్క పని, files లో ఏవిధంగా జరుగుతున్నదిన్నీ మనమే ఆలోచించుకోవాలి. దీన్నిగురించి అక్కడ స్థానికంగా ఉన్న తాహశ్శీలుదారునో, డిప్యూటీ తహశ్శీలుదారునో పలుకరించిచూస్తే, అబ్బో! మాకు విపరీతముగా పనులుంటూయున్నవి, ఇప్పుడు మేము వాటి విష యము చూడలేకపోతున్నాము, మాకు ఊపిరి త్రిప్పుకోటానికిగూడా టైము లేకుండాపున్నదని అన్నారు. అందువల్లనే నేను చాలా కాలముగా యీవిషయము చెబుతూవస్తున్నాను. ఈ బంజర్ల సమస్యఅంతా తలనొప్పిసమస్యగా ఏర్పడింది. ఈ తలనొప్పిని త్వరలో వదిలించుకోవాలంటే, ప్రస్తుతము జిల్లాలలో ఏమాత్రము బంజర్లుఉన్నవి, యివి అన్నీ పంపకముచేయటానికి ఎంత త్వరలో వీలు అవుతుందో చూడటానికి special staff ను వేయవలసివుంటుంది. అయితే, special staff అనగానే, డబ్బులేదని మన ముఖ్యమంత్రిగారు, ఆర్థికమంత్రిగారు అయిన గోపాల రెడ్డిగారు అంటారు. ఈ special staff కు అయ్యేఖర్చుఅంతా, ప్రభుత్వము బంజర్లు ఎవరికైతే యివ్వదలచుకున్నారో వారిమీదనే వేయండి, అందులో తప్పేమీలేదు. Special staff ను వేసి, దానికి ఒక Revenue Inspector గాని, ఒక Deputy Tahsildar ను గాని, లేకపోతే యింకా ఎవరినైనా ఆఫీసరును ప్రతితాలూకాకు ఒక్కొక్కరినివేసి యీ భూము లను పంపిణీచేయటానికి తలపెట్టితే, యీ సమస్య త్వరలో తేలుతుంది. అంతేకాని, యిప్పుడు జరిగే proceedure అంతాచూస్తే మాత్రము, యీసమస్య పరిష్కారము కావటానికి చాలాకాలము పట్టుతుంది. ఇందులో యీసమస్య యిప్పటికే చాలాచిక్కులలో ప్రవేశించింది. ఎక్కడచూచినా, తగాదాలు చిక్కు లు తప్ప మరేమీ కనబడదు. ఈ proceedure ను simplify చేయటానికి ప్రభుత్వము ఆలోచించాలి. Simplify ఎట్లాచేయడము అనేది, నాకు తెలియదు గాని, అదిఅంతా అనుభవమువున్న కలెక్టర్లను, రెవిన్యూబోర్డు మెంబర్లను సమావే శపరచి, యీ proceedure ను simplify చేసి, యీ సమస్యను త్వరలో పరిష్కారము అయ్యేటట్లు చూడాలి. అయితే యీసమస్య రెవిన్యూ డిపార్టు మెంటే పరిష్కారము చేయాలి అని అంటే, యిదిఅనుకున్నంత త్వరలో పరిష్కా రముకాదు. ఏ పది, పదిహేను సంవత్సరాలో పట్టుతుంది. కాబట్టి బంజరును పంపకము చేయాలి అని ప్రభుత్వముయొక్క అభిమతమే గనుక అయితే, త్వరలో special staff ను వేయండి, ఎక్కడచూచిన project affected area అని ప్రభుత్వము చెబుతున్నది. ప్రభుత్వానికి యింజనీర్లు తగినంతమందిలేరు, యింకా

ఎక్కువమంది కావాలంటున్నారు. అటువంటి సమయములో, యీ projects అన్నీ ఎప్పుడు తయారవుతాయి? ఈ సంవత్సరము ఒక ప్రాజెక్టుపర్పడవచ్చు, వచ్చే సంవత్సరము మరొకటి రావచ్చు. అదేమాదిరిగా సంవత్సరమునకొకటి చొప్పున ప్రాజెక్టులు వస్తూఉంటే యీ బంజర్లు అన్నీగూడ project affected lands క్రిందకు వస్తాయి. వాటికి ఏదో విలువ కట్టాలని అంటున్నారు. ఈ విలువతో బాటు ప్రభుత్వానికి అయ్యేసిబ్బందికి అయ్యేఖర్చులుకూడ వారిమీదనే వెయ్యాలి గదా, అవిఅన్నీ చేర్చి మహాఅయితే ఎకరానికి ఏ 10, లేక 15 రూపాయలో కావచ్చు. అంతకంటే అదనంగా పడదు. కాని యీఒక్క సంవత్సరములోనైనా special staff ద్వారా సులువుగా యీ సమస్యను పరిష్కరించటానికి అవకాశము ఉంటుందిగాని, యిప్పుడు ఉన్నపద్ధతి ప్రకారము కలెక్టర్లమీదనే ఆధారపడితే, అదియెంతో టైము తీసుకుంటుంది. కారణము యేమిటంటే కలెక్టర్లకు ఉన్నదేకొద్ది అవకాశము. ఆకొద్దిటైములో, N. E. S. Blocks చూచుకోవాలి. Planning వ్యవహారాలు చూడాలి. ఇంకా మామూలుగాఉన్న adminstration కు సంబంధించిన పనులుచూడాలి. ఇటువంటివి ఎన్నోపనులు వారికి ప్రభుత్వము అంటకట్టారు. ఇటువంటి పనులు ఎన్నోచూచుకోవాలి, గనుక యీ వ్యవహారము కూడ వారికే కట్టిపెట్టితే, యిదియిప్పట్లో సాధ్యమయ్యే పనికాదు. ఇకపోతే, Tahsildars వద్దకు వెళ్లితే యిప్పటికి మాచేతులలోఉన్న Takkavi loans కు వచ్చిన దరఖాస్తులను dispose of చేస్తేచాలు అనిఅంటారు. అవిచూడటానికే వారికి సాధ్యము కావడము లేదని అంటారు. ఇట్లా యీతహశీలుదార్లు అనేకమంది, అనేక రకాలుగా పనులు చూపించి మాట్లాడుతున్నారు. వారు చెప్పినదానిలోగూడ కొంతసత్యములేకపోలేదు. ఇదివరకురోజులలో దరఖాస్తుచేసేవాడేలేడు. అలాంటిది యిప్పటిరోజులలో ఎవడుపడితేవాడు, అక్కడగ్రామ మునసబుచేత సర్టిఫైచేయించి, యిక్కడ తహశీలుదారుకు పంపడము జరుగుతున్నది. ఈ విధముగా మనిషికి ఒక ధరఖాస్తు చొప్పున, అవసరమునకొక ధరఖాస్తువ్రాసి పంపడమువల్ల యీలాంటి ధరఖాస్తులు తహశీలుదారుకు ఎన్నోరావటము కద్దు. కాబట్టి కాగితములు, పనులు ఎక్కువలేకపోలేదు. పూర్వముకన్న కాగితములు పెరిగినవి. వాటితోబాటు పనులుకూడ పెరిగినవి. ఈధరఖాస్తులు అన్నీ చివరకు lodge అవుతాయో, ఇంకాఏమిఅవుతాయో, ఫలితము శూన్యము అయినా కాకపోయినా ముందు తహశీలుదారుకు ఆలస్యమునకు వంకదొరుకుతున్నది. ఈవిధముగా తంతులు జరుగుతున్నవి. కాబట్టి తహశీల్ళుదార్లు చెప్పేదానిలో సత్యములేకపోలేదు. అందుకనే special staff ను వేయమని అంటున్నాను. కాబట్టి బంజర్లు పంపిణీచేయాలి అనేది ప్రభుత్వము యొక్క అభిమతమే అయినట్లయితే, బంజర్లమీద సాధ్యమైనంతమటుకు ధనము రాబట్టాలి అని ప్రభుత్వానికి ఉద్దేశ్యమే గనుక ఉన్నట్లయితే, పేదవారికి నిజంగా సహాయము చేయాలి అనే ఉద్దేశ్యము ప్రభుత్వానికి ఉంటే, ప్రభుత్వానికి కావలసిన డబ్బు యీ పేదవారినుంచి పది సంవత్సరాలలోనో, 20 సంవత్సరాలలోనో తీర్చుకునేటట్లుగా పర్పాటుచేసి యింత అని నిర్ణయించండి. ఇది చేయటానికిగూడ special staff ను వేయకుండా ప్రభుత్వానికి సాధ్యముకాదు. ఇంతవరకు జరుగుతున్న proceedure మార్చటానికి, simplify చేయటానికి, పాతఅలవాట్లకు అలవాటుపడిన రెవిన్యూ ఉద్యోగస్థులను

సం[ప్రదించితే లాభములేదు. వారు అంగీకరించరుకూడా. ఈ పట్టాలు యిచ్చే పద్ధతిలోగూడ కొంతమటుకు యిదివరకునూదిరి complicated గా వాతుంఢా, simplify చేయటానికి [ప్రయత్నించాలి.

పోతే house sites కు సంబంధించిన చిక్కులు కొన్ని వచ్చినవి. ఒక ఉదాహరణ చెబుతున్నాను. ఒక పంచాయితీ ఏరియాలోగాని, మునిసిపల్ ఏరియాలోగాని ఒకవ్యక్తికి town site లో యిల్లువేసుకొని ఉంటాడు. ఆయన అక్కడనే ఏ ముప్పది సంవత్సరాలుగానో యిల్లు కట్టుకొని, రాతిగోడలు చుట్టూ [ప్రహారీ వగైరా కట్టుకొని ఉంటాడు. [ప్రతి సంవత్సరము ఆయనకు eviction నోటీసు రావడము, [ప్రతితడవ మునసబు కరణములకు డబ్బులు యిచ్చుకోవడము, జరుగుతూ ఉంటుంది. కాని ఎన్ని సంవత్సరాలు అయినా ఆసమస్య పరిష్కారముకాదు, కానివ్వరుకూడ. ఇందులో ఎన్నో ముడులు ఉన్నవి. అవియేమిటంటే, ఆయిల్లు కట్టుకొన్న ఆయన Town Planning Officer వద్దకు వెళ్ళి, ఆయింటిప్లాను ఆమోదించాలట. తరువాత రెవిన్యూ వారు గూడ ఒప్పుకోవాలట. తరువాత మునిసిపల్ కౌన్సిలు ఒప్పుకోవాలట. ఇంతమందిని కలుసుకొని వారి ఒప్పుదల తీసుకోటానికి సంవత్సరముల తరబడి జరుగుతుంది. ఇందులో ఒకరికొకరికి మధ్య సంబంధము ఉండదు. దీనికే ముడులు అంటున్నాను. ఈముడులు అన్నీ తప్పించుకుని బైటకు వచ్చేసరికి, వాళ్ళ పెద్దవాళ్లు జ్ఞాపకమునకు వస్తారు. ఇందాక డిపార్టుమెంటులమధ్య co-ordination లేదని మన స్థానిక సంస్థల మం[త్రిగారే చెప్పారు. ఎందుకంటే ఒక డిపార్టుమెంటు ఒక ధోరణిలో వెళ్లుతూఉంటే, మరొక డిపార్టుమెంటు మరొక ధోరణిలో పోతూఉంటుంది. దానికి దీనికి సంబంధము ఉండదు. దేనిదారి దానిదే అన్నట్లుగా పనులు జరుగుతూ ఉంటున్నవి. అదేవిధముగా Co-operative Department కు, Prohibition Department కు Co-ordination లేదు. అటువంటిది లేనందువల్లనే, యీరోజున నీరా సొసైటీలు పెట్టుకుంటాము, లైసెన్సు యివ్వమని అడిగితే, సొసైటీ రిజిష్టరు చేయరు. రిజిష్టరుచేయటానికి పైఅధికార్లు సిపార్సు చేయాలి. ఒకవేళ చేస్తే, రిజిష్టరు చేయరు. చేస్తే లైసెన్సు యివ్వడము అంతకన్నా కష్టము. నీరా సొసైటీలు పెట్టాలని అన్నా, licenses యివ్వాలని అన్నా ఎంతో కష్టమౌతున్నది.

**The Hon Sri A. B. NAGESWARA RAO:**—Co-ordination లేదు అని చెప్పలేదు. అదిఉన్నది గనుకనే, పనులు జరగటానికి చాలా ఆలస్యము జరుగుచున్నదని చెప్పాను.

**Sri PRAGADA KOTAIAH :**— ఈ Co-ordination కావలసినంతగా లేదంటాను. నేను వారితో కొంతవరకు ఏకీభవించుటకు అభ్యంతరంలేదు. కావలసినంతగా co - ordination ఉండదు. ఎందుకంటే prohibition department వారు ఆలోచించేదేమిటంటే, మేము enforce చెయ్యాలి, ఇందులో సాధకబాధకాలున్నాయి, మంచీ చెడ్డా మనుష్యులు న్నారు, ఈమనుష్యులను దృష్టిలో పెట్టుకుని మేము పనిచెయ్యాలన్నే ధోరణిలోనే వారు ఆలోచిస్తారు. అది న్యాయంకావచ్చు. Co-operative Depart-

ment ఏమని ఆలోచిస్తుందిఅంటే, "మమ్మల్ని సొసైటీలు పెట్టమన్నారు. వీరికి వృత్తి కల్పించవలసిన అవశ్యకత ఉంది. కాని వీరికి licence లేకుండా వృత్తి కల్పించడం ఏలాగు?" అని Co-operative Department వారంటారు. ఈరెండు రకాలైన అభిప్రాయాలను ఏదోవిధంగా సమన్వయం చెయ్యాలంటే కొంతకాలం పట్టక తప్పదు. చాలాసమస్యలమీద Co-operative డిపార్టుమెంటుకు, Agricultural Department కు, Revenue Department కు ఏ విధమైనటువంటి co-ordination కూడా లేదని నేను స్పష్టంగా చెప్పగలను. ఎందుకంటే landless labour కు tenants co-operative society లు పెట్టమంటే Revenue అధికార్లు వచ్చి ఇక్కడ భూమిఉంది మేము ఇస్తాం అని చెబితేతప్ప Co-operative Department పెట్టదు. కాని Co-operative Department కు మాత్రం దరఖాస్తులు విపరీతంగా వస్తూఉంటాయి. ఒకదానికి ఒకటి అర్థం లేకుండాఉంది. ప్రభుత్వం ఏదైనా చేయదలచుకుంటే చాలా స్పష్టమైన విధానం అవలంబించాలి గాని, ఊరికే ఏదోఒక మాట చెప్పాంఅంటే, దానివల్ల అనేక చిక్కులు ఉత్పన్నమై, పని కాలయాపన జరగడం అనేధోరణి ఎందువల్ల వస్తోందో అది జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ town sites వ్యవహారంలోకూడా నేనిప్పటికి మూడు సంవత్సరాలుగా తంటాలుపడుతున్నాను. ఇప్పటికి దాదాపుగా పది దరఖాస్తులు నేను స్వయంగా సంతకాలుచేసి ఇచ్చాను. వైకుంఠపురం అని ఒకటి, జయంతిపేట అని ఒకటి, జవహర్‌నగర్ అని ఒకటి, చీరాల area లో వందలమంది town sites లో కాపురం ఉన్నారు. వీటిని permanent గా assign చేయుటకు ఏదోమార్గం చూడవలసిందని మూడు, నాలుగు సంవత్సరాలుగా నేను దరఖాస్తులు ఇస్తే ఇవి ఏమౌతున్నాయో నాకు తెలియడంలేదు. వాటికి తిరిగి నాకు సమాధానంకూడా ఏమీరాలేదు. ఒక శాసనసభ్యుడు కాగితం ఇచ్చినతరువాత, దానికి reminder ను కూడా పంపిన తరువాత సమాధానంరానటువంటి పరిస్థితులలో ప్రభుత్వం జరుగుతున్నప్పుడు, ఇక సాధారణ పౌరులకు ప్రభుత్వంలో న్యాయంజరుగుతుందనుకోడానికి అవకాశంలేకుండా పోతోంది. కాబట్టి ఈలోటును సవరించటానికి ప్రభుత్వం ప్రయత్నం చెయ్యాలి. ఇల్లాంటివి ప్రభుత్వ దృష్టికి తీసుకురాకుండా ఏదోజరుగుతోందని గొణుక్కుంటే ప్రయోజనంలేదు కాబట్టేన్నీ, ముఖ్యమంత్రిగారు అదృష్టవశాత్తు ఇక్కడుండడం తటస్థించిందికాబట్టి, వారికి ప్రత్యేకంగా నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ బంజరు సమస్యలో మన Revenue మంత్రిగారుమాత్రం చాలాత్వరపడ్డారని చెప్పడానికి నేను వెనుకాడడంలేదు, సందేహించడంలేదుకూడా. ఎందుకంటే రొంపేరుకు సంబంధించిన ఒక కమిటీని ఏర్పాటుచేసి ఆ కమిటీ వారు సమగ్రంగా ఒకటిన్నర సంవత్సరాలు పరిస్థితులను పరిశీలించినపిమ్మట ఇదివరకు అధికారంలోయున్న ఆంధ్రప్రభుత్వం ఒక G. O. pass చేస్తే, ఈ ప్రభుత్వం వచ్చీరాకపూర్వమే ఏమీఆలోచించకుండా ఆ G. O. ను మార్పుచేసి ఏదో political sufferers కు భూములు కట్టబెట్టాలన్న ఆలోచనతో, తొందరపాటుతో ఒక G. O. ను pass చేయడంవల్ల, ఈవేళ దాదాపు నాలుగువేలమంది నిరాశ్రయులైనారు. ఇది ఎందుకు జరిపించవలసివచ్చింది ? చీరాలలో నాలుగువేలమంది నిరాశ్రయులయ్యారంటే మాకువచ్చిన నష్టం కష్టంలేదని బహుశః మీరనుకోవచ్చును. కాని దానివల్ల

ఏర్పడే దుష్ఫలితం యావత్తుజిల్లాకు వ్యాపిస్తుంది కాని అది ఒకచోట మాత్రమే నిలవదు. దాన్నిగురించి నేను గతసంవత్సరంగా ప్రభుత్వానికి అనేకసార్లు విజ్ఞప్తులు చేస్తున్నాను. సవినయంగా మనవిచేస్తున్నాను. మీరు భూమిని అందరికీ సర్దుబాటుచేయవచ్చు. ఉన్న G. O. ను మరల సవరించి మిగతా పేదవాళ్లతో పాటు రాజకీయబాధితులకుకూడా తలాకాస్త భూమి ఇవ్వమని చెపితే ఇబ్బంది లేదు. కాని ఒక రాజకీయబాధితుడికి 5 ఎకరాలు కట్టబెట్టడంకోసం అర ఎకరంచొప్పున ఆక్రమించుకున్నటువంటి పదిమంది పేదవాళ్లను మీరు వెనుకకు నెట్టిపారేస్తున్నారంటే అది ఎంత అన్యాయానికి దారితీస్తుందో మీరు స్పష్టంగా గ్రహించవచ్చును. దాన్ని మార్పుచేయవలసిందని అప్పటినుంచి ఇప్పటివరకూ చెప్పుతుంటే, ఇది న్యాయంకాకపోతే న్యాయంకాదని చెప్పవచ్చు బహిరంగంగా. ఇది న్యాయంకాదండి. ఒక్కసారి ప్రభుత్వం ఒకనిర్ణయంచేసిన తరువాత ఆ నిర్ణయాన్ని మీరు మార్పుచేసి రాష్ట్రంలో ఒక్క చీరాల area లోనే మూడువేల మందిని నిరాశ్రయులను చేస్తున్నారు. వారు ఎంతోడబ్బు తగలబెట్టారు దానిమీద. ఎంతో ఆశతో ఉన్నారు భూమివస్తుందని. కాని ఇప్పటికికూడా ఆ సమస్య పరిష్కారంకాకుండాఉంది. ఇది ఏదో చీరాలకుమాత్రమే సంబంధించినది, అది చాలా పరిమితమైన ప్రాంతమేగదా అని అనుకోవద్దు. దీనిని ముఖ్యమంత్రిగారు ప్రత్యేక శ్రద్ధతో పరిశీలనచేసి పరిష్కరించవలసిన ఆవశ్యకత ఉందని మనవిచేస్తున్నాను. ఇదేవిధంగా మామూలుగా forest areas ఉన్నాయి. ఈ forest areas ను సంబంధించి, మేము report లు పంపిస్తూంటే అధికార్లు ఏదో వ్రాస్తారు. వీరువచ్చి ఇక్కడ ఎసెంబ్లీలో చెబుతూఉంటారు. కాని వాస్తవపరిస్థితులు ఆవిధంగాలేవు. అక్కడ చెట్లేఉండవు. చెట్లుపెంచడానికి అవకాశంలేదు. ఏవిధంగా నేను కష్టపడి అభూమిలో మొక్కలునాటి తంటాలుపడుతానని చెబుతూఉంటే—ఇదంతా forest area, ఇది reserved కాబట్టి, మేము ఇప్పుడు dis-reserve చెయ్యం, ఆ భూమి ఇవ్వడానికి అవకాశంలేదని చెపుతూఉంటారు. ఒక్కసారి స్వయంగా చూస్తే అది forest కాదనీ, అక్కడ చెట్లు పెంచుటకు అవకాశం లేదనీ ఇప్పుడు అక్కడక్కడ పెంచే సర్వేమొక్కలకు కూడా ఎంతోడబ్బు వ్యయపరచవలసియున్నది. దానికి తగ్గ ఆదాయం ప్రభుత్వానికి రావడం లేదనే విషయాన్ని తెలియజేస్తున్నప్పుడు నూటికి నూరుపాళ్ళు అధికార్లమీదనే ఆధారపడడం అనేది చాలా శోచనీయం. అలా కాకుండా అనధికార్లు చెప్పే విషయాలకు కూడా కనీసం 25 percent ఐనా విలువ ఇచ్చుటకు ప్రభుత్వం ప్రయత్నం చెయ్యాలి. మా Departmental Heads ఏదివ్రాస్తే దాన్నిమాత్రమే అనుసరించాలనుకునే ధోరణి కనుక ప్రభుత్వానికి ఉన్నట్టుగాఉంటే ఈచర్చలు, ఈ కంఠశోష, యావత్తూ వృథాతప్ప దానివల్లవచ్చే ప్రయోజనంలేదు. ఎందుకంటే ఈ శాసనసభలో ఎన్నోహామీలు ఇస్తున్నారు. ఇచ్చినహామీలు అమలుజరుగుతూ ఉన్నాయా లేదా అనేపరిశీలన ఏమైనా ప్రభుత్వం చేస్తోందా? Departmental Secretary లైనా కనీసం ఆ notes చదువుతున్నారా? దాని విషయమై ప్రభుత్వం ఏమైనా చేస్తోందాఅంటే రవ్వంతకూడా ఏమీచేయడంలేదని నేనుమనవిచేస్తున్నాను. చేస్తున్నది ఏమైనాఉంటే ఒక్కటైనా చెప్పమని అడుగుతున్నాను. ఉదాహరణకు నిన్న Revenue మంత్రిగారు అక్కడక్కడో రైతులు ఎంతో నష్టపడ్డారు, రెమిషన్లు

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)



ఇవ్వడానికి నిర్ణయించేశాం. అప్పులు ఇవ్వడానికి నిర్ణయం చేశామంటే— మీరు ఏమాత్రం రెమిషన్లు ఇచ్చారు, ఏమాత్రం అప్పులు ఇచ్చారంటే, ఇది ఈ ప్రశ్నకు సంబంధించినది కాదన్నారు. మళ్ళామరొక member అడిగితే ఒకలక్ష రూపాయిలు అప్పిచ్చాం అన్నారు. ఈ విధంగా ఒక్కొక్క member అడిగిన ప్రశ్నలకు చాలా నిరాదరణంగా మాట్లాడడంమాత్రం సరియైనటువంటిది కాదేమోననీ, దాన్ని సవరించవలసిన బాధ్యత ముఖ్యమంత్రిగారిమీద ఉన్నదేమోనని మనవిచేస్తున్నాను. ఈవిధంగా ఒకే సమస్యనుగురించి ఒకసభ్యుడడిగినప్పుడు దానికి సంబంధించిన ప్రశ్నకాదని చెప్పడం, మరొక సభ్యుడడిగినప్పుడు దానికి సంబంధించిన వివరాలు ఇవ్వడం, ఒకరిని చాలానిరాదరణ చేయడం, ఎసెంబ్లీలో ఇచ్చిన హామీలుగాని, బైటకువచ్చినప్పుడు చెప్పేమాటలుగాని అమలుజరుగుతూ ఉన్నాయాలేదా అనిపరిశీలన చేయడానికి ప్రభుత్వం ఏదైనా పద్ధతి ఏర్పాటు చేసిందా? పద్ధతి ఏర్పాటుచేసినట్లుగా ఉంటే ఎసెంబ్లీలో చెప్పేటటువంటి మేము ఆలోచిస్తాం, చూస్తాం, పరిశీలనచేస్తాం అంటున్నారే, పరిశీలన చేస్తున్నారా? Assembly proceedings ఏమైనా Secretary లు మళ్ళీ చదువుతున్నారా? చదివి concerned Ministers కి notes వస్తున్నవా? వస్తేనిర్ణయాలు జరుగుతూ ఉన్నవా? నిర్ణయాలు జరగడం సంభవించేటట్లయితే పరిపాలన ఈవిధంగా ఉండదని చెబుతున్నాను. అందుచేత ప్రతిజిల్లాలో conferences పెట్టమని చెప్పాను. Departmental Heads లో, Agricultural, Revenue, Co-operative Department ల గెజెటెడ్ ఆఫీసర్లతో ప్రతినెలా కలెక్టరు యజమాన్యాన ఒక conference పెట్టి ఆలోచించి నిర్ణయం చేయవలసిన కాగితాలేవైతే ఉన్నవో ఆ pad లన్నీ ఆరోజు అక్కడకు మోసుకువచ్చి నలుగురూకూర్చుని ఆలోచించుకొని నిర్ణయాలు చెయ్యడానికి ప్రభుత్వం పూనుకుంటే చాలాసులువుగా పరిష్కారమవుతాయి. అంతేకాకుండా ఇప్పుడు లంచగొండితనం తగ్గించాలంటున్నారు. ఈ బంజర్ల విషయంలో అనేక petition లు పెడుతున్నారు. ఈ petition లు పెట్టడానికి గుమాస్తాలు లంచాలుతీసుకుంటూ యున్నారు. అనేకమంది తీసుకుంటున్నారు. ఋజువుచేయడం కష్టం. ప్రతి Collectorate లో ఒక Reception Office పెట్టండి. వచ్చేనష్టం ఏమిటి? ఎవరైనావస్తే ఏపనిమీద వచ్చారో, ఏవిధంగా చెయ్యాలో ఎలాచెయ్యాలో వచ్చినవారలకు సలహాఇచ్చినట్లయితే, లంచగొండితనం చాలామట్టుకు తగ్గడానికి అవకాశం ఉంటుంది. అల్లాకాకుండా ఇప్పుడు వెళ్ళినప్రతివారూ ఒకదరఖాస్తు form ఆగుమాస్తాను అడగడం, వాటికి లంచాలు పెట్టడం, ఎన్నిలంచాలు పెట్టినా pigeon-hole నుండి కాగితాలు కదలవు. నేను అనేకసార్లు మంత్రులకు మనవిచేశాను. మీరుమాప్రాంతాలకు వచ్చినప్పుడు మీటింగులు, ఉపన్యాసాలు మాత్రమేకాకుండా ఎప్పుడైనా Collectorate కు వెళ్ళండి. ఏదైనా section లోకి వెళ్ళండి. అక్కడ pigeon hole లో కాగితాలు తియ్యండి. అక్కడ గుమాస్తా personal register తియ్యండి. ఇన్ని నెలలు ఈ కాగితం వృధాగా ఎందుకున్నదని అడగండి. కనీసం నాలుగైదు చోట్ల మీరు ఆ విధంగా personal గా examine చెయ్యండి. Collectorate లో గాని, లేక Deputy తహశీల్దారు office లలో గాని, లేక Deputy Registrar Office లో గాని, అల్లాంటి office లలో

**surprise visit** లు చేసి **check** చేసి రాష్ట్రం మొత్తంమీద పదిమందిని శిక్షించి నట్లయితే **administration** లో ఇంతకంటే **efficiency** వచ్చుటకు అవకాశం ఉంది. కొన్నిఐనా నేనుచెప్పినవి సాధ్యమా అసాధ్యమా అనిపరిశీలన చేయ వలసిందంటున్నాను. నేను చెప్పింది యథాతథంగా అంగీకరించమనడం లేదు. అది అమలు పరచడంవల్ల ఉపయోగం ఉంటుందాలేదా ఆలోచించమని కోరుతు న్నాను. పట్టాలు యివ్వడం **simplify** చేయడం అనేది ఒకటి. **Special staff** వెయ్యడం అనేది ఒకటి. **First encroacher** పేదవాడైతే వాడికి **preference** ఇవ్వడం అనేది ఒకటి. ఈ రెండుమూడు విధానాలు కనుక ప్రభుత్వం అనుసరించి నట్లయితే బంజరు సమస్యచాలా తొందరగా పరిష్కారం కావడానికి అవకాశం ఉంటుంది. ఇప్పుడున్న ధోరణిలో మాత్రం పరిష్కారం కాదేమోనని భయపడు తున్నాను.

**Sri S. VEMAYYA :—** అధ్యక్షా, ఈ బంజరు సమస్య ప్రతిదినము గ్రామాలలో ప్రజలను ఎదురుకొంటున్న సమస్యయే. లోగడ పట్టాభూములు అన్నీ శివాయి జమాదార్లకు **preference** ఇవ్వడం జరుగుతూ ఉండేది. కాని **valuable lands** ఎక్కడైనా ఉంటే వాటిని యుద్ధంతరువాత పట్టాలు ఇవ్వడం ఆపివేసి **Grow More Food** స్కీముక్రింద ఆక్షేపణలేని భూములను సాగుబడిచెయ్యమని ప్రభుత్వం ఆదేశం ఇచ్చినందువల్ల అక్కడ పేదలందరూ బంజరుభూములను కష్టపడి సాగుకు లాయకీచేసి సాగుచేస్తున్నారు. సుమారు 12,13 సంవత్సరాలుగా సాగుబడి చేస్తూ నేటివరకు ప్రభుత్వానికి శిస్తులు చెల్లిస్తున్న భూములు రాష్ట్రం మొత్తంమీ. అన్నిజిల్లాలలోను ఉన్నవి. ఈనాటివరకు 1921 సంవత్సరంనుంచి శివాయిజమాక్రింద సాగుబడిచేస్తే ఆక్షేపణలేకుండా ఉన్నాకూడా పట్టాలేని సందర్భాలు చాలాఉన్నవి. ఎందువల్ల ఈవిధముగా జరుగుతున్నది అంటే, అక్కడ ఉన్న గ్రామాధికారులు వారి చెప్పుచేతలలో ఉంచుకొనే ఉద్దేశంతో ఈ విధముగా జరుగుతూఉంది. అటువంటి ఆక్షేపణలేని భూములకు వెంటనే పట్టాలుయిచ్చే విధానము ప్రభుత్వం తీసు కొనవలెనని నేను కోరుచున్నాను.

ఈరోజున అనేక గ్రామాలలో **eviction** ఆర్డర్లు ఇస్తున్నారు. ఇప్పుడు అప్పారావుగారు చెప్పినట్లు ఆక్షేపణీయమైన భూములు అంటే డొంకలు, వాగులు వగైరా ఆక్రమిస్తే ఇబ్బందే. వాటినుండి **eviction** చెయ్యవలసినదే. దానికి అందరమూ అంగీకరిస్తాము. కాని ఆక్షేపణలేని వాటినుంచి తొలగాలని, 20 వంతులు పెనాల్టీ కట్టితేగాని పంటతీసుకోకుండా చెయ్యడముకూడా ఈ ఫస లీలో జరుగుతూఉన్నది. నెల్లూరుతాలూకాలో 100/– 150/– కూడా ఎకరాకు పెనాల్టీవేస్తున్నారు. పైరులుకూడా జప్తుచేస్తున్నారు. 10, 15 సంవత్సరాలనుంచి ఆక్షేపణ లేనివాటికి యిప్పుడు ఆక్షేపణ. ఎందుకువచ్చింది? ఇది ఏమీ సబబుగాలేదు. ఆక్షేపణకరమైన భూములనుండి తొలగిపోడానికి వారు సిద్ధముగా ఉన్నారు. ఆక్షేపణ ఉందా లేదా అని తీర్మానించినపుడు ముఖ్యముగా డొంక, **communal lands** సమస్య వస్తుంది. వంక, డొంక, వాగు, పోరంబోకులు, గుంటపోరంబోకు చెరువుతట్టు భూములు ఉన్నవి. **Non delta** లో చెరువుతట్లుచేస్తే ఆయకట్టుదార్లకు ఇబ్బంది కలుగుతుంది. అది ఆక్రమించడము న్యాయముకాదు. వారిని తొలగిం చాలి. కాని డెల్టాతాలూకాలు ఉన్నవి. నెల్లూరుతాలూకాలో ఈరోజున ఇస్తే

ఆయకట్టుదార్లకు ఇబ్బందిలేదు. 10, 12 సంవత్సరాలనుంచి చేస్తున్నారు. ఆయకట్టుదార్లకు ఏమీ ఇబ్బందిలేదు. ఈసంవత్సరం ఇబ్బందికలిగిందని 100/-, 150/- జరిమానా వెయ్యడము ఏవిధముగానూ అర్థంలేదు. ఆ టాంకులు అన్నీ తనిఖీ చేయించి abandon చెయ్యడానికి ప్రభుత్వం పూనుకుంటే మా నెల్లూరు జిల్లాలో రెండు మూడు లక్షలు శిస్తులురావడానికి వీలుఉన్నది. ఇంతకుపూర్వము పాపిరెడ్డిపాలెం చెరువుఉన్నది. ఇంజనీరుబోర్డు మెంబరుకూడా తనిఖీచేసి ఇవ్వవచ్చును అన్నారు. మళ్ళీఏసందర్భములనో పురస్కరించుకొని partial గా abandon చేసి partial గా restore చెయ్యవలెనని అన్నారు. ఇప్పటివరకు వారు సాగుచేస్తున్నారు. తరుణవాయి టాంకు ఉంది. దానిక్రింద registered ఆయకట్టులేదు. దీనిని maintain చెయ్యటం అర్థంలేని విషయం. తరుణవాయి చెర్వును Revenue Department abandon చెయ్యవచ్చును అన్నారు. 400 ఎకరాలువారికి ఇవ్వవచ్చునని సిఫార్సుచేస్తే సూపరింటెండింగు ఇంజనీరుగారు దేనికైనా అవసరం వస్తుందని కలెక్టరు Executive Engineer ఆర్డరు నిలుపుదలచేస్తూ రైతులను తొలగించడము జరిగింది. వేగూరుచెరువుక్రింది 500 ఎకరాలు రైతులు కూలీలు అవసరంలేదంటున్నారు. సాగుకు ఇవ్వవచ్చని చెబుతున్నారు. అటువంటివి అన్నీ సేకరించి చెరువుతట్లు మినహాయించి రైతులకుఇస్తే ప్రభుత్వానికి బాగా ఆదాయం వస్తుంది.

భూములుఇచ్చే విధానముగురించి కోటయ్యగారు ఒకపద్ధతి చెప్పారు. 1948లో composite State లో గవర్నమెంటు విధానములో 5 ఎకరాలు మాగాణి, 10 ఎకరాల మెట్ట ఉన్నవారు గవర్నమెంటు భూమిని ఆక్రమించరాదు అన్నారు. కాని ఈరోజున భూములుఉన్నవారే శివాయిజమీలు సాగుబడిచేస్తున్నారు. కొవ్వూరు తాలూకాలో పర్వతరెడ్డి రమణారెడ్డి వారిబంధువులు ఒక్కొక్కరు 25, 50, 100 ఎకరాలు సాగుచేస్తున్నారు. వారికి పట్టాభూములుకూడా ఉన్నవి. కాగితముమీద ఈవిధానము అటువంటివారిని తొలగించనుని ఉన్నదిగాని నిజముగా, sincere గా ప్రభుత్వం apply చెయ్యడములేదు. భూములుఉన్నవారు సాగుచెయ్యనివ్వవద్దు, ఎవరైనా పేదలను చేసికొననివ్వండి అంటే, అదిఅమలు జరగడములేదు. స్థానికముగా జరిగేది ఏమిటంటే: జమాబందీ ఆఫీసర్లకు రెడ్డిగారుకాదు, మేమేచేస్తున్నాము అంటారు. మేమువెళ్లి అడిగితే మేముఊరికే చేస్తున్నాము, మక్తాలు తీసుకొంటున్నారు అంటారు. శివాయిజమాకు మక్తాతీసుకొనడం ఎంత దారుణమోచూడండి. గవర్నమెంటు భూమిసాగుబడి చేసేది labourers. వరుంబడి పెద్దవారిది. శిస్తు రైతుకట్టడం జరుగుతూఉంది. దానిని అరికట్టడానికి ప్రభుత్వం పూనుకొనలేదు.

పోతే ఫారెస్టు బంజర్ల విషయములో గవర్నమెంటు ఫారెస్టులను పెర్పరచడం అందరం సమర్థించాలి. గాని ఫారెస్టువారికి పనికిరాని భూములు ఉన్నవి. రాపూరు, నెల్లూరు, వెంకటగిరి తాలూకాలలో ఆవిధమైన భూములు ఉన్నవి. అవిసాగుకు ఇవ్వకుండా ఫారెస్టుక్రింద declare చెయ్యడము జరుగుతూఉంది. అవి disforest చేసి ప్రభుత్వంసాగుబడికిఇవ్వాలనికోరుచున్నారు. మాకొవ్వూరుతాలూకాలో దొవ్వేరు,కొత్తవంగల్లు,రేబాలలో కొంత disforest చేసినారు. అవి ఫారెస్టునుండి తొలగించి political sufferers కు ఇవ్వడానికి పూనుకొన్నట్లు ఉన్నది.

Board Standing Order 15, para 38 లో disforest చేసినప్పుడు స్థానికముగాఉన్న labourers కు ఇవ్వవలెనని ఉన్నది. Certain portion కు reserve చెయ్యవలెనని ఉన్నది. ఇది 1921 లో Labour Department ప్రారంభము అయినప్పుడు అన్నారు. అప్పుడు బ్రిటిషు ప్రభుత్వపుహైము. Reserve lands ఎరుకల, ఏనాదులకు Depressed Classes కు వినియోగించారు; క్రిమినలు ట్రైబు settlers కు గాని ఈ రోజున reservation భూములు Depressed Class కు ఇవ్వకుండా రాజకీయబాధితులకు మాత్రము reserve చేస్తున్నారు. ఒవ్వేరు, కొత్తవంగల్లు, రేఖాల వగైరా గ్రామాలలో భూములు labourers కు ఇవ్వడానికి వీలులేదని అనడము సబబుగాలేదు. రాజకీయ బాధితులకు ఇవ్వడము జరుగుతుందికూడా. కనీసం బోర్డుస్టాండింగు ఆర్డరు ప్రకారమం స్థానికముగాఉన్న పేదలకు కొంత ఇవ్వడానికి పూనుకుంటే కొంత అసంతృప్తి పోతుంది అని మనవిచేస్తున్నాను.

పోతే eviction విషయము చూద్దాము. ఎక్కడైనా సాగుబడిచేసే పేదల మీదనే ఈ eviction నోటీసులు ఇవ్వడము, fine లు వెయ్యడము జరుగుతున్నదిగాని పెద్దపెద్దవారు సాగుచేస్తున్నా వారిమీద పెనాల్టీలు వెయ్యడము మాత్రము జరుగలేదు. ఉదాహరణకు ఆత్మకూరు తాలూకా వడగండ్లలో T. పేరారెడ్డి 40 ఎకరాల శివాయిజమా సాగుచేస్తున్నారు. అక్కడపేదవారు, హరిజనులు తమకు ఇవ్వాలని అంటే ఇవ్వకుండా పేరారెడ్డిగారికి ఇవ్వడము సబబు కాదు. గాని ఆయనను తొలగించాలంటే ప్రభుత్వముదాకా వచ్చింది. ప్రభుత్వం తొలిగించవలెనని ఆర్డరు వేస్తే అది అమలుజరుపకుండానే రివిజన్ పిటీషను పెట్టారు. రివిజను stay order stage లో ఉంది. పేరారెడ్డి చేతిలో ఉన్నది. ఇది ఐదుసంవత్సరములనుండి జరుగుతూవుంది. హరిజనులకు కాగితాలమీద ఉత్తర్వులు ఇవ్వడమేగాని ఆయనను తొలగించి ఇవ్వడము జరుగలేదు. కాని eviction చేసే సందర్భంలో ఇక్కడ ధనవంతులను ఏవిధంగా తొలగిస్తున్నారు, పేదవాండ్లను ఏవిధంగా తొలగిస్తున్నారన్నది మనకు స్పష్టంగా అర్థం అవుతూ ఉన్నది. మా తాలూకాలోనే లేబూరి సుబ్బారెడ్డి గారు ఉన్నారు. ఆయనకు కాస్త భూమి ఉన్నది. ఆయన అక్కడ స్థానికంగా ఉన్నటువంటి చాలా పెద్దలు. చిన్నచిన్న లస్కర్లు వాళ్ళు చేస్తున్నట్టి భూమిని వాళ్ళు సాగుచేసి ఎకరాకు 200 రూపాయల వరకు ఖర్చు పెట్టి అక్కడ బుచ్చిరెడ్డి పాలెంలో మన ముఖ్య మంత్రిగారి బంధువుల వద్ద 200 రూపాయలు అప్పు తెచ్చి సాగు చేసుకుంటే వారిని తొలగించి తరువాత లేబూరు సుబ్బారెడ్డిగార్కి lease కు యిచ్చారు. పోనీ 5 సంవత్సరాలు లీజు అయిపోతే, తర్వాత నీకు యిస్తామని స్థానికంగా ఇంజినీయరు వగైరాలు చెప్పారు. పోనీ ఓర్చుకో నాయనా, 5 సంవత్సరాలు రేపటికో అయిపోతుంది, తర్వాత తీసుకుందాము. అని చెప్పితే 5 సంవత్సరాలు expire అయి పోతుంది, వచ్చే నెలలో యిస్తామని ఇంజినీయరు చెప్పుతూనే ఉన్నాడు. లోపల యేమి జరుగుతుందో తెలియ లేదు గాని ఆ ఫసలీ ఆఖరు అయ్యే లోపుగానే మళ్లీ ఒక 5 సంవత్సరాలు గవర్నమెంటు పొడిగించారు అని ఉన్నవాళ్లకే యిచ్చుకోవడం, ఈ లేని వాళ్లను యిబ్బంది పెట్టడం, యీ ప్రభుత్వ విధానములో కనబడుతుంది గాని ఇది నిజంగా

సిన్సియర్ గా ఈ ఉన్నవాళ్లు తొలగిపోయి పేదవాండ్లకే ఈ లీజు యివ్వండి, ఆ కౌలు వీళ్లకే యివ్వండి, అనే విధానం అవలంబించ లేదు అని నేను ఖచ్చితంగా వీరికి మనవి చేస్తున్నాను. కాని యివి అన్నీ కూడా దృష్టిలో ఉంచుకొని వెంటనే ఈ విధానాన్ని మానుకొని ఉన్నవాళ్లు ఎవరూ కూడదని చెప్పి లేనివాళ్లకు భూములు యివ్వడంలో కౌలుకు యిచ్చే పద్ధతిగానీ, పట్టాలకు యిచ్చే విషయంలో గాని, తరువాత **temporary** గా సాగుబడి చేసుకునేటప్పుడు గాని, యివ్వాలని చెప్పి నేను మనవి చేస్తున్నాను. పోతే ముఖ్యమంత్రిగార్కి ఒక విజ్ఞప్తి చేయవలసి ఉంది. గత ఫసలీ జమాబంది అయినంత వరకు కూడా ఈ పెనాల్టీలు వసూలుచేయవద్దని మనవి చేసినప్పుడు ఇదే శాసనసభలో **penalties** జమాబంది అయినంతవరకు వసూలుచేయవద్దని చెప్పి ముఖ్యమంత్రిగారు ఒక్క ఉత్తరవు చేశారు. ఆవిధంగా జరిగినందువల్ల జమాబందిలో సామాన్యంగా ఒక జుల్మానా వగైరాలు వేసినప్పుడు ఒక రివాయిజమీదారుమీద జమాబందిలోకిపోయి ఒక అర్జీ దాఖలుచేసుకుంటే ఆయన కాస్త తగ్గించడం వగైరా జరుగుతుంది. దానిమీద అప్పీలు పెట్టుకోవచ్చు, లేకుంటే పెట్టవచ్చు. కాబట్టి **It is subject to revision by the Jamabandi Officer.** ఇప్పుడు నెల్లూరుజిల్లాలో తీసుకొన్నట్లయితే ఎకరాకు 100, 150 రూపాయలు వేసి మీరు ఆ డబ్బుకడితేగానీ ఆ పైరు కోసుకోనేదానికి లేదు అని ఆర్డరుచేశారు. కాని అయ్యా, జమాబందివరకు ఆపండి, శిస్తుమాత్రం తీసుకోండి. పెనాల్టీలు జమాబందిలో కాస్త తగ్గింపు జరుగవచ్చు. అంత దనుక ఆపండి అనిచెప్పి అక్కడ స్థానికంగా మేము **Sub-collector** ను చూచాము, తాసీల్దారును చూచాము. ఇంకా ఎవర్ని కలెక్టర్ని చూచినాకూడా అక్కడ యేమీ జరుగలేదు. కానీ నేను **D. O.** ల ద్వారాను, ట్రంకుకాల్సుద్వారాను రెవిన్యూ సెక్రటేరియట్ తో సంబంధం పెట్టుకొని ఎప్పుడో క్రెడిషనల్ గా ఉంది. జమాబంది అయినంతవరకుగూడా పెనాల్టీలు వసూలుచేయరు. ఇది **subject to revision by Jamabandi Officers.** దీనిని వెంటనే ఆపుదల చేయాలన్నప్పుడు నెల్లూరుజిల్లాకుమాత్రం రెండురోజులక్రితమే ఎక్కడెక్కడఅఫెక్టు అయిందో వాటినిమాత్రం వసూలుచేయవద్దని చెప్పి నెల్లూరుతాలూకాకుమాత్రమే వచ్చింది. కాని ఇప్పటికే కొంతమంది వసూలుచేశారు. అనేకచోట్ల కిస్తీలుక్రింద కుప్పలున్నాయి. కాని జప్తీలువగైరాలు చెయ్యవద్దు, జమాబంది అయినంతవరకు వచ్చిందిగాని ఆర్డరు, ఈ జప్తీలు చేసిఉన్న సంగతి తొలగించమని మాకు లేదు కాబట్టి, ఈజప్తీలక్రిందనే ఉంటాయి అనిచెప్పుతున్నారు. కాబట్టి ముఖ్యమంత్రిగారు వెంటనే యిప్పుడు ఈ జమాబంది అయినంతవరకు ఈ పెనాల్టీలుగానీ, జప్తీలుగాని అన్నీ ఆపి, ఈ జమాబంది అయినతర్వాత అది జమాబంది ఆఫీసరు నిర్ణయించినరేటుప్రకారము తర్వాతవసూలుచేసుకోవచ్చునని చెప్పి ఇప్పుడుముఖ్యంగా ఒక **statement** యిస్తారనిచెప్పి నేను కోరుతున్నాను. స్థానికంగా మేము యిప్పుడు కట్టుతాము. రేపు జమాబంది ఆఫీసరు తగ్గించవచ్చును అన్నప్పుడు అక్కడ స్థానికంగా చెప్పేదేమిటంటే నిజంగా **refund** తీసుకునేదాన్కి వస్తుంది. ఒక్కసారి కట్టినప్పుడు, జమాబంది ఆఫీసరు అది **refund** తీసుకోవడం అంటే ముఖ్యమంత్రిగార్కి బహుశా పరిచయం ఉందోలేదోగానీ అనేకమందికి

**Refund** సంగతిగాని జ్ఞాపకం చేసుకుంటే రెమిషన్ వగైరాలు ఉన్నవాళ్లకు తెలుసు. ఒకసారి **Refund** అంటే వారిచేతులనుండి రైతుల దగ్గరకు రావడం అంటే 5 రూపాయల దగ్గరనుంచో లేక 10 రూపాయలకో **Refund** మొదలు పెట్టామంటే 20 రూపాయలు ఖర్చుపెట్టుకుంటేగానీ 5 రూపాయిలు **Refund** వచ్చేపరిస్థితులే ఉండవు. కానీ అదికూడారాదు. సంతకం పెట్టించుకొని బయటికి పంపించే రహస్యం అనేకమందికి స్పష్టంగా అక్కడ ప్రాక్టికల్ గా తెలిసినవాండ్లకు తెలిసిఉంటుంది. అందువల్ల **Refund** అనేపద్ధతి ఎందుకు, మరలతిరగడం ఎందుకు. ఇప్పుడేకోంచెం ఆ జమాబంది అయినంతవరకు ఆపాలనిచెప్పి నేను మనవిచేస్తున్నాను. దానిని వెంటనే ముఖ్యమంత్రిగారు గత ఫసలిలో యిచ్చినట్లుగానే ఒక ఆర్డరు యిప్పుడు పంపిస్తారు అనిచెప్పి, ఇదేమారిగానే చేసినట్లయితే ఇతర జిల్లాలలో అన్నిచోట్ల అదిఎక్కడెక్కడ జరుగుతుందో వారందరికీకూడా జమాబందిఅయ్యేంత వరకు ఉండదు. ఇదిపెద్ద గవర్నమెంటుకు వచ్చేనష్టం ఏవిధంగాను ఉండదు. దాన్ని ఉత్తరవు చేయాలని నేను మనవిచేస్తున్నాను. ఈవిషయాన్ని గురించి **Board Standing order** లో యేమిఉందంటే **general** గా ఈపెనాలిటీ వేసినప్పుడు వారిదగ్గర వసూలు చేయాలని ఉంది. జమాబంది వరకు కూడా కాచుకొని ఉండమనిఉంది. కాని మామూలుగా ఈరోజున ఎక్కడఅయినా చూడండి. మనం పురాణాల్నుంచి ఎత్తుకున్నా మనం జమాబందికి మూటలు కట్టుకొని పోవడం, అక్కడఏదో త్రోసేయడం, నవాబులుగాని, రాజులు గాని, జరుగుతుంది. జమాబంది వరకే ముందుగానే వసూలుచెయ్యడం పద్ధతి యీసంవత్సరమే మనరాష్ట్రంలోనే మా నెల్లూరు జిల్లాలోనే ప్రారంభం అయింది గాని, నాకుతెలిసినంత వరకు జమాబందికి ముందేపెనాల్టీలు కట్టించి, జప్తీలుచేసి ఏలంపాడిన పద్ధతి ఈ సంవత్సరమే కనబడుతుంది. అందువల్ల జమాబంది అయినంతవరకు జమాబందీలో తగ్గిస్తారు, పెచ్చుచేస్తారు. దానికి అప్పీలు చేస్తారు. తర్వాత తీసుకోవచ్చు అని ఉత్తరవు చేస్తారని నేను మనవి చేస్తున్నాను. పోతే ఈఆక్షేపణలేని భూములను తీసికొన్నప్పుడు, బ్రిటిష్ ప్రభుత్వంవారు ఉన్నప్పుడు **Prohibitory order book** అనిచెప్పి ఒకటి **open** చేసి వారియిష్టం వచ్చినట్లుగా విచక్షణలేకుండాగూడా అన్నిటినీ ప్రొహిబిటరీ ఆర్డరు బుక్కుకు ఎక్కించారు. ఇప్పుడు ఉదాహరణకు ఇక్కడ పెనుబర్తిఅనే గ్రామంఉంది. అక్కడ రెండుమూడు వందల ఎకరాలు ఒకేసర్వేనెంబరు ఉంది. దానికి ఎలాంటి ఆక్షేపణ లేదు. అది ఎందువల్ల **Prohibitory order book** లో **enter** చేశారో మాకుఅర్థం కాలేదు. అక్కడఉన్న **Sub-Collector** గాని, కలెక్టరుగాని యివ్వవచ్చు పట్టాలకు అనిచెప్పుతున్నారు. కాని, మరల **Prohibitory order book** లోనుంచి తొలగించ డానికి లేదు అని చెప్పుతున్నారు. కాబట్టి దీన్నిగురించి అసెంబ్లీలో గానీ అనేకచోట్ల తీర్మాన రూపకంగా కూడా తీసుకుని వచ్చినప్పుడు ఇది చూస్తానని చెప్పారు. ఈ **Prohibitory order book** లో నిజంగా కమ్యూనల్ **Land** గా ఉండి, ఎన్ క్రోచ్ చేయకూడదనేటటువంటి వాటినుంచి ఇటువంటి వన్నీకూడా తొలిగించి సాగుబడులకు గాని ఇంకేదేనికైనా ఉపయోగించుకునే దానికొరకు యిచ్చేదానికి ఉత్తరవులు చెయ్యాలని చెప్పి దీనిని ముఖ్యమంత్రిగారిని అడుగుతున్నాను. ముఖ్యంగా

ఈభూములు యిచ్చేటప్పుడు కోటయ్యగారు ప్రొసీజరు విషయం ముఖ్యంగా చెప్పారు. Procedure విషయంపోతే యిప్పుడు దాన్నిగాని పట్టాకివ్వడంమొదలుపెడితే ఈరోజు దరఖాస్తు పెడ్తే నాలుగు సంవత్సరాలకుకూడా రాదు. ఎందువల్ల అంటే ఫలానాదని ఏ Memorandum అని వగైరాలకు 15 దినాలు నోటీసులిస్తూ పోవాలికాని మొన్న ప్రభుత్వంవారు ఒకవిధానాన్ని అవలంబించారు కాని పొలిటికల్ సఫరరుకు యిటువంటి ప్రొసీజరు ఏదికూడా అవలంబించనక్కరలేదు. వెంటనే పట్టాలకివ్వవచ్చునని ఒకపుత్తరువు చేశారు. అది తొందరగా చేయడానికి బాగావుంటుంది. అందువల్ల ప్రొసీజరు అనేదాన్ని ఈ Board Standing order ప్రకారంగానే మొదలుపెట్టినట్లయితే నాలుగు సంవత్సరాలకు కూడా ఒకపట్టా దరఖాస్తులు తెగవు. అందుచేత అదికాకుండా వెంటనే యిచ్చేటటువంటి విధానానికి ఈప్రొసీజరు లేకుండానే పట్టాలకిచ్చి తరువాత Sub-Division వగైరాలు దానిప్రకారము ఏర్పాటు చేసుకొనేదానికి అవలంబించవలెనని నేను మనవిచేస్తున్నాను. పోతే ఈ Field Labour Co-operative Society ని గురించి ఒక విషయం మాత్రము మనవి చేయవలసివున్నది. అనేకచోట్ల ఈ దేవస్థానం భూములు వగైరాలు వున్నవి. ఇవి Field Labour Co-operative Society కు యిస్తామని చెప్పి ప్రభుత్వం వారు చెప్పడం జరిగింది. కాని స్థానికంగా ఒక Field Labour Co-operative Society ని రిజిష్టరు చేయమని మేము దరఖాస్తు చేసుకుంటే, అక్కడ కో-ఆపరేటివ్ డిపార్టుమెంటు వాళ్ళు ఏమి చెపుతున్నారంటే, ఎక్కడైన భూములున్నాయా, వాళ్ళు యిస్తామని చెప్పుతున్నారా, ఖచ్చితముగా తెలుసుకొని వస్తేగాని మేము రిజిష్టరు చేయమని చెబుతున్నారు. ముందు మీరు రిజిష్టరుచేయించుకోండి. ఆతరువాత మీకు భూముల విషయం చెప్తాననిచెప్పి ఇక్కడ Temple Endowment Department గాని, Revenue Departmentగాని ఇంకెవరో ఈవిధంగాచెప్పుతున్నారు. కాని ఈవిధానం గాకుండా వాళ్ళు వెంటనే రిజిష్టరు చేయాలనిగాని ఇచ్చినట్లయితే రిజిష్టరు చేసిన తరువాత తప్పకుండా Society లకు preference లు యివ్వాలని చెప్పివుంటే, తప్పకుండా యిస్తారు. ఇది ఇప్పుడు పరస్పర విరుద్ధంగా ఈ Co-operative Department కు Endowment Department కు, Revenue Department కు మధ్య ఎంతమాత్రము co-ordination కుదరటంలేదు. కాబట్టి ఈ lands యిచ్చే విషయంలో వెంటనే Register చేయాలని చెప్పి వెంటనే ఈ Temple lands అంతాకూడా Field Labour Societies కి యివ్వాలని ఆర్డర్లు యివ్వవలెనని నేను మనవిచేస్తున్నాను. ఈసందర్భములో అక్కడ మా నేయగుంటపాడులో ఒక Co-operative Society విషయం చెబుతాను. Co-operative movement ను అభివృద్ధిచేయాలనేది మన ప్రభుత్వవిధానం అని అంటున్నప్పుడు మా నెగుంటపాడు Co-operative Society Register చేసినతరువాత ఒకనలభై ఎకరాలవరకు కూడా ఆసొసైటీకి స్వాధీనముచేయకుండా అక్కడ స్థానికంగా వున్నటువంటి Temple Trusteeతిరగబడివుంటేప్రభుత్వంఅతనిమీదఏమాత్రమైనచర్యతీసికొని అది స్వాధీనపరచడానికిపూనుకోలేదు. కాని అక్కడకొన్నిభూములుమాత్రమే సొసైటీకి అప్పజెప్పారు. కొన్నిభూములు మాత్రము ఆవిధంగానే తగాదా పెట్టి ఆ Trusteeని తీసేసినామని చెప్పినమా, నన్నెవరు తీసేసేది, నేనే కొలిపించుకుంటాను, ఆగింజలు

కొలవండి అనిచెప్పి అగింజలు కొలిపించమంటున్నారనిచెప్పి ఈరోజున తెలుస్తున్నది. కాబట్టి ఈవిషయము ఏవిధంగా ఎంతచచ్చుగావుందో Co-operative movement ఈవిధానంలో ఎంతబలపడుతావుందో మనకుబాగా తెలుస్తున్నది. ఇంకాపోతే Estate గ్రామాలవిషయము తీసుకున్నట్లయితే Venkatagiri Estateలో అనేకగ్రామాల్లో భూములు ఈరోజువరకు కూడా వున్నవి, ఈబంజరు భూములన్నీ కూడా సర్వే కాలేదని, యిది మీరు స్వాగుబడి చేయడానికి వీలులేదనిచెప్పి వాళ్లు ఆటంక పరచడం జరుగుతున్నది. సర్వే అయినా కాకపోయినా ఈ Estate గ్రామాల్లోని ఆక్షేపణలేని భూములన్నీ కూడా సాగుబడిచేసుకోవచ్చునని చెప్పి ఉత్తరువులివ్వాలని, తరువాత ఈ Project affected Area అనే కారణంతో ఎవరూకూడా సాగుబడి చేయడానికి వీలులేదనిచెప్పడానికి ఒకసాకు దొరుకుతుంది. కాని ఆవిధంగాకాకుండా పట్టాలకివ్వనివ్వండి, యివ్వకపోవనివ్వండి, తెంపరోరిగానేమో ఆక్షేపణలేని భూములన్నీకూడా వాళ్లు సాగుబడిచేసుకొనేదానికి దీంట్లోలేదుగాని క్రొత్తగావచ్చిన పుస్తకంలో Board Standing order 15 (A) అని చెప్పి క్రొత్తగా యింకొక chapter చేర్చారు. దానికింప తాత్కాలికంగా యివ్వోచ్చు అనివుంది. స్థానికంగావుండే వాళ్లు ఏమిచెప్పుతున్నారంటే మాకేమి భూములివ్వమనిలేదు. ఇది Project affected Area. మీరెవ్వరుకూడా దీనిని ముట్టుకోవడానికి వీలులేదు. మీరు దరఖాస్తుపెట్టుకుంటే reject చేస్తామని చెప్పుతున్నారు. కాని తెంపరరీగా పట్టాలివ్వపనిలేదు. కనీసము టెంపొరరీగా సాగుబడిచేసుకొనేదానికి Board Standing order 15 A లో provision వున్నప్పటికికూడా స్థానికంగావున్నవాళ్లు నిరాకరిస్తున్నారు. ఇట్లు నిరాకరించకుండా తాత్కాలికంగా వాళ్లు సాగుబడి చేసుకొనేదానికి ఉత్తరవులిప్పించడానికి ఈ ప్రభుత్వము పుత్తరవు జారీచేయాలని చెప్పి నేను మీద్వారా ముఖ్యమంత్రిగారిని అడుగుతున్నాను. నేనడిగినటువంటి విషయములో ఈజమాబంది జరిగేలోగా ప్రభుత్వం వెంటనే ఉత్తరవులు జారీచేయాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri A. KALESWARA RAO :— అధ్యక్షమహాశయా, ఈ తీర్మానం అతివ్యాప్తిగా ఉన్నందున నేను దీనిని వ్యతిరేకించవలసివస్తున్నది, నిజమే. ప్రభుత్వం చేతుల్లో లక్షలకొలదిమాత్రమేకాదు; బహుశా రెండుకోట్ల ఎకరాలవరకు బంజరు భూములున్నాయి. వాటిలో ముఖ్యమైన అవసర కార్యములకు పోగా తక్కిన భూములు పేదవారికి కుల, మత విచక్షణలేకుండా ఊరికే ఇవ్వడం ధర్మమైనదే. ఆ సిద్ధాంతంతో నేనూ ఏకీభవిస్తున్నాను. అన్నిభూములు అందరుపేదవాళ్లకు వెంటనే పంచవలసిందని అతివ్యాప్తమైన ఈ తీర్మానాన్ని ప్రతిఘటించకతప్పదు. అందరిలోనిక ఒకజాతివారున్నారు, వారు చాలా దురదృష్టవంతులు. ఇదివరకు ధైర్యంగా, ఉత్సాహంగా బ్రతుకుపోయారు. ఆ ధర్మములతో వారు జీవించారు. అటువంటివారు 1947 వ సంవత్సరములో మద్రాసు రెవిన్యూ మంత్రిగారు భూములు ఇస్తాము అని ప్రకటించడంతో అప్పటినుంచి రాజకీయబాధితులైనారు. అదివరకు రాజకీయ ధీరులు. వారే రాజకీయబాధితులైనారు. తిరగడంతో సరిపోతుంది. కరణం, మునసబు దగ్గరనుంచి గుమాస్తాదగ్గరనుంచి రివెన్యూ ఇనస్పెక్టరువరకు 20, 30 సార్లైనా ఎనిమిది సంవత్సరాలైనా సమస్య పూర్తి కాకుండా ఉన్నది రాజకీయధీరులు రాజకీయబాధితులు రాజకీయభీరులు అయినారు. ఈ

రకంగా దురదృష్టవంతమైన ఒకతరగతి దేశంలో ఏర్పడింది. వారిని చూస్తే ప్రతి వారికి ఓర్వలేనితనం. దేశంకోసం కష్టపడ్డారువారు. సుందరయ్యగారు నేను ఇక్కడికి మెంబర్లుగా రావడానికిగాని దేశంలో డెమోక్రసీ ఏర్పడడానికి వారు కష్టపడ్డారు. ప్రతిచోట సైన్యంలో ఉన్నవారికి, ప్రాణాలు అర్పించినవారి కుటుంబాలకు ఇస్తారు. అట్లాగే మనం ఇస్తున్నాము. దీనిని ఓర్వలేనితనంతో చూడవద్దని సోదరులను ప్రార్థిస్తున్నాను. నేను భూమి దరఖాస్తుపెట్టినవాణ్ణికాను, పెట్టలేదు, పెట్టను, నాకు అక్కరలేదు. పేదవాళ్లకే భూమినివ్వాలనేది న్యాయమే కాని, దేశానికి చేసిన సేవకు గుర్తుగా ఇస్తున్నారుకనుక భాగ్యవంతులుకూడా వంశ పారంపర్యంగా, "మా తాతగారు దేశానికి ఇంతసేవ చేశారు, ఈ అయిదు ఎకరాల భూమి మాకు ఇచ్చారు" అని కొందరు దరఖాస్తులు పెట్టుకుంటే ఇస్తే తప్పు లేదేమో. ఈ విధంగా కొందరు పెట్టారేమోనని భావిస్తున్నాను. అన్ని భూములు అందరికీ ఇమ్మన్నారు. రాజకీయ బాధితుల సమస్య చాలా త్వరగా పరిష్కరించవలసిందని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నాను. చాలావరకు అయిపోయినాయి. మూడువంతుల భాగం ఇచ్చేశారు. ఆంధ్రరాష్ట్రం మొత్తంమీద ఇప్పుడు మూడువేల మందికన్న ఎక్కువ ఉన్నట్లు కనిపించదు. తడుణం పల్లం 5 ఎకరాలు గాని మెట్ట 10 ఎకరాలు కాని—రాయలసీమలో పేదభూములు కనుక 15 ఎకరాలు పెట్టినారు న్యాయమే —వంచి వెంటనే ఈసమస్య పరిష్కారం చేయాలని ప్రభుత్వం వారిని అభ్యర్థిస్తున్నాను. రాజకీయ బాధితుల విషయంలో ప్రతివారు అడ్డమే. మొదలు పెట్టినపుడు నేను భూములకు బదులు డబ్బు ఇవ్వండి అనిఅన్నాను. సరే ఎదో ఒకపద్ధతి పెట్టారు. ఇపుడు వెనుకకు పోవడం కష్టం. ప్రతివారు చూచి అడ్డం పెట్టే వారే. ఒకమంత్రిగారు భూములు ఇస్తుంటే మరొక బాధ్యత గలవారే "జొరబడండి" అనిచెప్పిన రోజులు ఉన్నాయి. ఒకవైపున రాజకీయ బాధితులకు భూములు ఇవ్వాలని ప్రభుత్వం చెప్పిన రోజులున్నాయి. మరొకవైపున మీరు జొరబడండి అని పేదవాళ్లను రెచ్చగొట్టి అందులో ప్రవేశ పెట్టిన రోజులున్నాయి. బాధ్యత గలిగిన వారే. వీరిని చూస్తే ఓర్వలేనితనం. రాజగోపాలాచారి గారు ఆమధ్య ఆపు చేశారు. ఈ విషయంలో చాలా ఆలస్యం జరుగుచున్నది, ఆఖరున వచ్చిన G.O. బాగానే ఉన్నది. వాళ్లకు **assignment** ఇచ్చాము అని **order** పడిన తరువాత పట్టా రాక పోయినా భాయంకాకపోయినా, పేదవాళ్లు కానిభాగ్యవంతులుకానిఎవరుప్రవేశించినా, రాజకీయబాధితులకే ఇవ్వాలనేది సబబైనసంగతే. పేదవారనేపేరుతో రాజకీయబాధితులకు భూములు ఇచ్చేటటువంటి ఉద్యమం చెడగొట్టకూడదు. పేదవారు, పేదవారుఅంటారు. ఇదిఅరాజకమా? భూములుఎవరివి? ప్రతివారు లెక్కలేకుండా ప్రవేశిస్తున్నారు. అడగరు. అడగకుండా ప్రవేశిస్తారు. గవర్నమెంటు ఇస్తే హక్కు వస్తున్నది. ఎవరు ప్రవేశిస్తే వారికే హక్కు ఉన్నదా? గవర్నమెంటు భూములు **assignment** ఇచ్చారు. **Order pass** అయినది. అటువంటప్పుడు ఇతరు లెవరైనా ప్రవేశిస్తే లేచిపోవాలి. **Permission** లేకుండా ప్రవేశించిన వాళ్లు వెళ్లిపోవలసిన **risk** తీసుకునే ప్రవేశించారనేది సిద్ధాంతం. అంతమాత్రం చేతనే మన సానుయితి తప్పు త్రోవన ఉండ కూడదని, కూడని వారికి సానుభూతి చూపడం చాలా తప్పు. ఇప్పుడు గవర్నమెంటు ఆఖరున **pass** చేసిన ఆర్డర్లు సరిఅయినవే. రొంపేరు భూములు విషయంలో కూడా సరిఅయినవే. ప్రపంచంలో లక్షలమంది

పేదవారున్నారు. వారిని గురించి లబద్ధాల సానుభూతి, అన్యాయమైన సానుభూతి ఉండడం తప్పు అని మనవి చేస్తున్నాను. రాజకీయ బాధితులు అంటే special. లక్షల ఎకరాలలో 30 వేల ఎకరాలు అయితే చాలును. దానితో పేదవారలిపోతారు. మళ్ళీ మీదగ్గరకురారు. దీనికి రాద్ధాంత సిద్ధాంతాలు ఏందుకు? రాజకీయబాధితులను గురించి రెండుమాటలు చెబుతాను. వారికి గ్రామాలకుదగ్గరగా ఇస్తేమంచిది. చాలాదూరానికినెట్టారు. వారికి అనుకూలంగాలేదు. ఊరిలో అడ్డంతగలడానికి ప్రోత్సాహంచేసేవారున్నారుగా — వారు అడ్డంతగిలి బాధలుపెడుతున్నారు. వారిని కోర్టులకు పంపకుండా ఆటంకాయింపులు తొలగించి దగ్గరగా ఉండే భూములు ఇచ్చి వారి సమస్య చక్కగా తృప్తికరంగా పరిష్కరించాలని మొదటి ప్రార్థన. ఈ విషయంలో ఒక plan లేకుండా వుంది. ఎరుకలు, ఏనాదులు అంటూ ఈమధ్య వచ్చారు. చాలా రోజులు హరిజనులు తప్ప మరొక మాట వినిపించలేదు. ఇప్పుడు ఎరుకలవాళ్లు, ఏనాదులు, పాములవాళ్లు, బుడబుక్కలవాళ్లు మొదలైన జాతులు అన్నీ పేదవాళ్లనే మాట ఇపుడు వస్తున్నది. ఇన్నాళ్లనుంచి జరుగుతున్నా, ఒక plan లేదు. గ్రామానికి అవసరమయిన భూములు వదలి పెట్ట వలసిందే. చాలా గ్రామాలలో స్త్రీలు చెంబుపట్టుకుని వెళ్లడానికి స్థలం లేదు.పశువులు తిరగడానికి స్థలంలేదు. ధాన్యంకొట్టుకోడానికి స్థలంలేదు. నాగరికత ఎక్కువైన కొలది ఇంటివరకు వ్యవసాయమే అవుతోంది. గవర్నమెంటు ప్రథమ కర్తవ్యం ఏమిటంటే, గ్రామానికి మనుష్యులకు పశువులకు చెరువు వేస్తే కానీ నీళ్లు అయినా లేకుండా తీసివేస్తింది. జమిందారులు చెరువులు అమ్ముకున్నారు. 1802 సంవత్సరంలో గవర్నమెంటు ఇచ్చారు, పశువులకుగాను, బహిష్టు అయినపుడు స్త్రీలు స్నానం చేయడానికి గాను లేకుండా చెరువులు పాడు చేశారు; డొంకలు పాడు చేశారు. ఈ జమీలు ఇప్పుడు గవర్నమెంటు చేతిలోనికి వచ్చినాయి. కాబట్టి గ్రామానికి కావలసిన డొంకలు, చెరువులు, విడతీయాలి. అక్కడ పేదలనే ప్రశ్నలేదు. రాజకీయ బాధితులు కూడా అందులో చేర కూడదు. వాళ్లకు కూడా చెరువు, డొంక ఇవ్వకూడదు. వారికిచ్చినా తప్పే.

మనప్రధాన మంత్రిగారు విశాలాంధ్ర వస్తున్నదని చెప్పారు. ఇక కౌన్సిలు ఏర్పాటుచేసి తెలంగాణాలో వచ్చే ఆదాయమును అక్కడే వినియోగించి వాళ్ళకు ఏవిధమైన నష్టమురాకుండా చేస్తామని హామీలుకూడా ఇచ్చారు. కనుక మనము చక్కగా మనప్రాంతములో పన్నులువేసుకొని, అమ్మవలసిన భూములు అమ్మివేసి, మనకుకావలసిన ప్రాజెక్టులు కట్టుకొని ఆర్థికవిషయములో వీలైనంత స్వయంపోషకంగా ఉండకపోతే మనకు దెబ్బతగులుతుంది. మనము అప్రదిష్టపాలవుతాము. ఆర్థికంగా మనము బాగుపడాలని, వారిని బాగుచేయాలనే ఉద్దేశ్యముతోనే మనము విశాలాంధ్రను ఏర్పాటుచేసుకుంటున్నాము. వారికి లోటువస్తే మనము సర్దవలసి ఉంటుంది. వారిని విద్యావంతులుగా చేయాలి. ఆ హామీలు అన్నీ మనవారు ఇచ్చారు. ఆబాధ్యత మనపై ఉన్నదికూడా. అప్రకారంగా జరుగబోతున్నది. బిల్లు సుమారు 5,6 రోజులలో రాబోతున్నది. బిల్లు ఎట్లాగో వస్తున్నది గదా అని announce చేయడము మానివేశారు. అదినిశ్చయము అయిపోయింది.

ప్రాజెక్టు area లో ఉన్న భూములను ప్రభుత్వంవారు మార్కెట్టు ధరలకు అమ్ముకుంటున్నారు అన్నారు. అప్రాంతంలో కూడా పేదవారు ఉన్నారు. పేద

వారు లేనిచోటులేదు. అక్కడ పేదప్రజానీకము కోసము మనము సానుభూతి చూపించ నవసరములేదు. ఆర్థిక విషయములో మనము ప్రభుత్వమునకు తోడ్పడాలి.

ఎంతోకాలమునుంచి విశాలాంధ్రకొరకు అన్నిపార్టీలు కలసి హర్తాళ్ళు చేశారు. మనఆంధ్రదేశము బహుజాగ్రత్తగా చేసిందని అన్నిపత్రికలు నిర్ణయించాయి. ఎక్కడ అల్లరులు జరుగలేదు. కలకత్తా మొదలైనచోట్ల హర్తాళ్ళు చేయాలన్నా చాలా బాధపడుతున్నారు. మనప్రభుత్వము అన్నిపార్టీలు కలసి ఏకంగాఉన్నాయి కనుక చాలాప్రశాంతంగా చేశాము. దానితో ఆంధ్రదేశానికి బ్రహ్మాండమైన credit వచ్చింది అట్లా ప్రశాంతంగా, ఉదరం ఏకతాటిమీద నడిపించి విశాలాంధ్రను సంపాదించుకున్నాము. ఆబిల్లులో 120 సెక్షనుల వరకు ఉన్నాయన్నారు. అందువల్ల మనకు రావడం కొంచెం ఆలస్యం అవుతున్నది.

ఇప్పుడు ప్రాజెక్టుక్రింద ఉన్న భూములను, కొంతమంది భాగ్యవంతులు Grow-more food scheme క్రింద ఆక్రమించుకొని ఉన్నారు. ఇప్పుడు వారి నందరినీ తప్పకుండా వెళ్ళగొట్టవలసిందే. తక్కిన భూముల విషయములో Colonization పెట్టి, ఒకప్లాను తయారుచేయవలయునని 1937 సంవత్సరములో మనము అనుకున్నాము. చదువుకున్నవారిలో నిరుద్యోగులుగా ఉన్నటువంటి దరిద్రులు ఈరోజున ఎంతోమంది ఉన్నారు. వారందరికీ చక్కగా కాలనీలు కట్టించి ఇవ్వండి. ఆభూములన్నింటికి నీటివసతి గైరా సదుపాయమును అన్నీచేసి వారికి ఇవ్వండి.

ఇంకా మనదేశములో ఎరుకలు, యానాదులు మొదలైనవారు ఎక్కడ వారికి నిలకడమైన స్థావరములేక ఇండ్లూ, వాకిళ్ళూ లేక ఊరులవెంబడి తిరుగుతూ చెట్లక్రింద ఉంటూ, తిండిదొరకక దొంగతనములుకూడా చేస్తున్నారు. విదేశీయులు ఎవరు అయినా మనదేశమునకు వచ్చి ఈచెట్లక్రింద ఉండేవారినిచూచి నవ్వుతారు. మనకు చాలా సిగ్గుచేటు అవుతుంది. అందువల్ల అట్లా తిరుగుతూ ఉండేవారికి ముందు స్థిరనివాసములు ఏర్పరుచుటకుగాను కాలనీలు కట్టించి ఇచ్చి, కొన్ని షరతులమీద వారికి భూములను ఇచ్చి, ఎద్దులు, విత్తనములు సరఫరాచేసి వారిని Co-operative society గా form చేస్తే బాగుంటుంది.

An Hon. Member :— అండమాన్సుకు పంపితే బాగుంటుంది.

Sri A. KALESWARA RAO :— మన ఆంధ్రదేశమే అండమాన్సు. ఇంకా అక్కడకు పంపనవసరములేదు. మన దేశములోనే చాలాభూములు ఉన్నాయి చాలాఅడవులుఉన్నాయి. విశాలాంధ్రవస్తే ఇంకా ఎక్కువ విశాలంగా ఉంటుంది. కాబట్టి అక్కడకు పంపనక్కరలేదు. ఇంకా ఎవరైనా మనదేశమునకు వస్తానంటే వారినికూడా welcome చేయవచ్చును. తగాదా ఏమీలేదు.

అసలు ఇటువంటి సమస్యలు ఏమీ పరిష్కారము కావడములేదు. బస్తీల లోకూడా ఇటువంటి సమస్యలే ఎదుర్కొంటున్నాము. పోరంబోకులు ఆక్రమించుకుంటున్నారు. అందులో సంవత్సరముల తరబడివున్నా వారికి పట్టాలు ఇవ్వడములేదు. హెచ్చుగా పెనాల్టీలువేస్తున్నారు. అట్లావేయడము చాలాతప్పు.

వెళ్లగొట్టితే వెళ్లగొట్టాలి లేక వారు ఉన్నంతకాలం ఉండనీయాలిగాని పెనాల్టీలు హెచ్చుగా వేయడం సబబుకాదు. మీ రూలు ప్రకారము దానిని రాజకీయబాధితులకు ఇవ్వవచ్చునన్నా, లేక అది ప్రాజెక్టుభూమి అయినా వారిని వెళ్లగొట్టాలిగాని, ఇటువంటి పెనాలిటీలు 20 రెట్లు అని, 15 రెట్లు అని వేయడం సరిగాదు. అందువల్ల ఇటువంటివన్నీ ఆపుటకు ప్రభుత్వమువారు ఉత్తరువులు జారీచేయాలని కోరుతున్నాను.

వలసలుగా తిరుగుతున్న అనాగరికులకు సర్వ సదుపాయములు కల్పించి వారికి యిండ్లు నిర్మించి, వారికి పాఠశాలలు కట్టించి, ఇంకా చర్చీలుకాని, దేవాలయాలుకాని తక్షణం నిర్మించాలని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. నేను దానిని బెజవాడ విషయములోకూడా చెప్పాను. అక్కడ ఎన్నోసంవత్సరముల నుంచి గుడిసెలు వేసుకొని ఉన్నవారికి పట్టాలు యివ్వడంలేదు. అందువల్ల వారికి ఆ భూమిమీద హక్కు ఉండటంలేదు. ఒక్క గుడిసెమీదే హక్కు ఉంటున్నది. వాడికి అవసరంవస్తే ఎక్కడా అప్పుపుట్టదు. అందువల్ల వాడికి 'నా అనే' ఆస్తి అనేది ఏమీ లేదుకాబట్టి, అక్కడకు ఎంతోమంది మంత్రులు, అధికారులు వచ్చి చూచారు, ఏమీ పనిజరగలేదు. బహుశ నాకు 20 ఏండ్లనుంచి ఆవిషయం తెలుసు.

కో-ఆపరేటివ్‌సొసైటీలద్వారా ఇండ్లు కట్టిస్తున్నాము అంటున్నారు. అవి ధనవంతులకుమాత్రమే. అడయారులో, గాంధీనగరంలో, కో-ఆపరేటివు సొసైటీల ద్వారా ఎన్నోఇండ్లు కట్టుతున్నారు. అవన్నియూ భాగ్యవంతులకే. పేదవారికి వాటిల్లో ఏమాత్రము స్థానములేదు. అందువల్ల ప్రత్యేకంగా ఒకడిపార్టుమెంటును వేసి పేదవారిని ఎదుర్కొనే యిటువంటి సమస్యలన్నీ వీలైనంత త్వరగా పరిష్కారముచేస్తే ప్రజలకు చాలా లాభముగా ఉంటుంది. అందులో ముందు వలసలుగా తిరిగేవారికి, అవకాశం యివ్వాలి. తరువాత పేదవారికి, పేదకులాల వారికి, జనరలుగా లేనివారికి, తరువాత ఇతరకులాలవారికి అనేరీతిగా యివ్వాలి. ఇట్లాచేస్తే మనయొక్క ప్రతిష్ఠ చాలా హెచ్చుతుంది. అందువల్ల ప్రధానమంత్రి గారు ఇటువంటి సందిగ్ధావస్థలో ఉన్న సమస్యలయందు ఎక్కువ శ్రద్ధవహించి పనిచేయాలని కోరుతున్నాను. మనదేశములో ఇటువంటి పరిస్థితులు ఉండటం మన అనాగరికతకు కారణమని నేను చెబుతున్నాను. అందువల్ల వీటివిషయమై వెంటనే చర్యతీసుకోవలసిందిగా కోరుతున్నాను.

**Sri L. LAKSHMANA DAS** :— అధ్యక్షా, ఈదినం శంకరయ్యగారు తీసికొనివచ్చిన తీర్మానాన్ని బలపరచడమనేది చాలా కష్టమైనవిషయం. ఎవరూకూడా బలపరచలేరేమోనని అనుకొంటున్నాను. శంకరయ్యగారుకూడా తప్పకుండా దీనిని **with draw** చేసుకుంటారనే నేను భావిస్తున్నాను. ఎందుకంటే **this Assembly recommends to the Government that all Banjar and Poramboke Govt. lands may be given free to all the landless poor and poor ryots** అన్నారు. **All kinds of poramboke lands** అనీ అన్నది నిజంగా యివ్వడానికి సాధ్యమా, అనేదికూడా అందరూ ఆలోచించవలసినవిషయమే. **Main purpose** గురించి మనం మాట్లాడుకొనేటప్పుడు అసలు యీ బంజరుభూములసమస్య మనం అనుకున్నంత తేలికైన సమస్యకాదని నేను

మనవిచేస్తున్నాను. బంజరుభూమి బీదలకు యివ్వాలనే విషయంలో కాంగ్రెసు ప్రభుత్వం మొదటినుంచీ నిర్ణయంచేసుకుంది. ఎప్పుడైనాసరే కాంగ్రెసుప్రభుత్వం యిదిచేస్తుందని మొదటినుంచీ చెపుతూనేవున్నది. బంజరుభూములు దేశంలో ఎన్నివున్నవి, దేశంలో యీనాడు జరుగుతున్న యీబంజరుభూముల సమస్యలవిషయంలో చర్చలకంటే దేశంలో ఎంతబంజరుభూమివున్నది అనేది పూర్తిగాతెలుసుకోవలసి యున్నది. తరువాత ఈ బంజరు భూములను బీదలకు పంచటం విషయంలో మొట్టమొదట ప్రభుత్వం తీసికొనవలసినచర్య Poramboke landsలో దేశంలో ఏగ్రామానికి ఎంత భూమి అదనంగా వుండాలి. ఆగ్రామానికి ఎంత భూమి ఆగ్రామంలో వున్న పశువుల గురించి గాని యితర సౌకర్యాలను గురించి ఎంత భూమి కేటాయించాలనే నిర్ణయం చేయకుండా ఈ భూములను పంచిపెడుతామనే ప్రకటనలు చేయడము గాని, పంచిపెట్టమని కోరడం గాని మంచి పనిగాదు అని నేను భావిస్తున్నాను. రాజకీయ బాధితులను గురించి వెంకటేశ్వర్లు గార్కి చాలా కష్టంగా వుంది. నిజంగా యీనాడు మనం యింత స్వేచ్ఛగా యీదేశంలో పరిపాలన చేసుకొంటున్నామంటే దీనికి కారకులు ఎవరూ అని నేను వెంకటేశ్వర్లు గార్ని అడుగుతున్నాను. దేశస్వాతంత్ర్యం గురించి సర్వమూ త్యాగం చేసి 1942 వ సంవత్సరములో పరాజకీయ పెత్త యీనాడు బాధితుడ సని భూములు కోరుకున్నా సరే యీనాడు కాంగ్రెసు వాదిగా వున్న ప్రతి ఒక్కరు కూడా ఆనాడు ఉద్యమంలో పాల్గొన్న వారు తిరిగి బ్రతికి వస్తామా, తిరిగి దేశంలో పరిపాలన చేస్తామా, అనే ఆశపెట్టుకొని చేసినటువంటిదికాదని దేశానికి స్వాతంత్ర్యం తీసుకు వస్తామనే సంపూర్ణమైన సంకల్పంతో ఎటువంటి త్యాగానికైనా పూనుకొన్న వారిని రాజకీయ బాధితులనే దానికంటే రాజకీయ యోధులని, వీరులని నామకరణం చేసి గోపాలరెడ్డి గారు చెప్పినట్లుగా వార్కి వీర మాన్యం అనే పేరుతో యిచ్చివుంటే నేను చాలా సంతోషించి వుండేవాడిని. నిజంగా కమ్యూనిస్టు సోదరులకు ఈవేళ చాలా కష్టంగా వుండవచ్చు, రాజకీయ బాధితులకు భూములివ్వడమేమిటని. కాని ఆనాడు స్వాతంత్ర్య సమరంలో చేసిన త్యాగాలను ఒకసారి జ్ఞాపకం చేసుకుంటే భారత దేశంలో నిజంగా గాంధీ గారి నాయకత్వం చేసిన సేవకు యీమాత్రం భూములిస్తే తప్పాయని ప్రశ్నిస్తున్నాను. అందుచేత అటువంటి దుగ్ధలు పెట్టుకోకూడదని నేను మనవి చేస్తున్నాను, రాజకీయ బాధితులకు భూములివ్వడంలో ప్రతి ఒక్కరు కూడా ఆమోదించాలి. అది మనం సమర్థించ వలసిన విషయం. అది మనం పోషణ చేసు కోవడం వల్ల ప్రతి ఒక్కరను క్రిందికి వెళ్లి పోతున్నా మేమో అనేది మనం గమనించాలని నేను ముఖ్యంగా వెంకటేశ్వర్లు గార్ని కోరుతున్నాను. అందుచేత రాజకీయ బాధితుల భూములవిషయంలో దానినిగురించి ప్రత్యేకంగా ఎవరూ ఎటువంటి విచారము చూపవలసినపనిలేదు. ప్రతిఒక్కరు న్యాయంగా వారికి యివియిచ్చితీరవలసినదే. దేశంలోవున్న బంజరుభూముల పంపకంవిషయంలో ప్రభుత్వం తలపెడుతూనేవుంది. ప్రభుత్వం అదే ఆలోచనలోవుంది. కాంగ్రెసు ప్రభుత్వం యిప్పుడుకూడా బీదలను అభివృద్ధిచెయ్యాలనే తలంపుతోనేవున్నది. మొదటినుంచీ చెబుతూవస్తున్నది. అది క్రియా రూపంలో అనేక రూపాలు దాల్చుకొనివచ్చింది. ఈనాడు మహారాజులనందరిని వెళ్లగొట్టారంటే ధనవంతులకు మేలు

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri L. Lakshmana Das) [1st March 1956

చేయడానికిచేశారా? జమీందారీలను రద్దుచేశారంటే బీదలనుగురించికాక ధనవంతులకు మేలుచేయడానికి చేశారా? ఈనాడు జమీందారీ రద్దుచేసింటంటే ఎవర్నిగురించి చేసింది? ధనవంతులకు పత్తాడిగా వెనుకనుండి ప్రభుత్వం సహాయంచేస్తున్నదని విమర్శించడం చాలా ప్రమాదకరమైన విషయం. అటువంటి విమర్శలు తగ్గించుకొని దేశంలో ఉన్న సామాన్యమైన ప్రజానీకాన్ని అభివృద్ధిచేయాలనే సంకల్పంతో ప్రభుత్వం పూనుకొంటున్నదని ప్రతిఒక్కరు తెలుసుకోవాలి. అలాంటిపరిస్థితులు వున్నప్పుడు యదార్థంగా యిదిఎంతవరకు ఆచరణయోగ్యంగావున్నది? ఇది ఆచరణయోగ్యంగా వుండేటప్పుడు ప్రభుత్వంచేయవలసిన విధానంగురించి చెప్పడం మనవిధి. అయితే ఈబంజరుల విషయం ఎంతవరకు ఆచరణయోగ్యమో ప్రతి ఒక్కరము చర్చించుకోవాలి. ఈనాడు మన గ్రామాలలోవున్న సౌకర్యాలను చూచుకోవాలి. గ్రామానికి ఎంతభూమి అదనంగా వుంచాలి, జనాభా పెరుగుతున్న సమయంలో గ్రామానికి ఎంతభూమి అదనంగా కేటాయించాలి, అక్కడవున్న పశువులకు ఎంతవరకు స్థలంవుంచాలి, వెళ్లేమార్గాలు ఎంతవరకు వుంచుకోవాలి, అనేవిషయాలను గమనించుకోకుండా భూములన్నీ యినాడు temporary గావైనాసరే పట్టాలివ్వండి, తరువాత చూసుకుందామని చెప్పడం అంతగాభావ్యంకాదని నేను భావిస్తున్నాను. నిజంగా భూములు యిచ్చేటప్పుడు ప్రభుత్వం దీనినిగురించి ప్రత్యేకమైన శ్రద్ధతీసికొని దానినిగురించి ఒక కమిటీవేసి దేశంలో ఎంత భూమి ఎంతవరకు యితరులకు యివ్వడానికి అవకాశం వున్నది అనేది గమనించకుండా మనంభూములు పంచుతాము అనే యీప్రచారం కేవలం బూటకమే అవుతుందిఇది. బీదలకు మేలుకోసంచేసిన ప్రచారం మాత్రం కాదని నేనుమనవిచేస్తున్నాను. నిజంగా బీదలకు మేలుచేయాలంటే ఈనాడు దేశంలో **collective farms, Co-operative farms** కావాలని మనమందరము కోరుతున్నాము. ఇలాంటప్పుడు ఈనాడు భూములన్నీ ముక్కముక్కలుగా చెక్కచెక్కలుగా బీదలకు పంచిపెట్టిన తరువాత ఈ **collective farms** గురించి ఎక్కడనుంచి మనభూములను క్రొత్తగా తెప్పించుకోగలము? అని నేను ప్రశ్నిస్తున్నాను. అంతేకాదు ఈనాడు **land reform** కూడా వస్తుంది.

ధనవంతులు ఆభూములను ఆక్రమించుకొన్నారు, ఈ భూములను ఆక్రమించుకున్నారుఅని చెప్తున్నారు. ఇవి బ్రిటిష్ రాజ్యంనాడు జరిగిన విషయాలు. కొద్దిరోజుల్లో **land reforms** ప్రభుత్వం తీసుకురాబోతున్నది. **Land reforms** తీసికొనివచ్చి యింతభూమికంటే హెచ్చుభూమిని సాగుచేయడానికి వీలులేదని నిర్ణయించేసిన తరువాత దేశంలో అదనంగా ఎంతభూమి వుంటుంది. ఎంతభూమి మనం యితరులకు పంచిపెట్టడానికో, **collective farms** పెట్టడానికో, **Co-operative farms** పెట్టడానికో అవకాశం వుంటుందనేది మనంతేల్చుకోడానికి అవకాశం వుంటుంది. ఇప్పుడు దేశంలో జమీందారీ **area** లో చాలా భూములున్నాయి. కొండల ప్రాంతాల్లో భూములున్నాయి. అవన్నీపంచడానికి వీలులేదు. కొండలపైనున్న సవరవాళ్లని కొండలనుంచి దించడానికి మనం ప్రయత్నం చేస్తున్నాము. పోడువ్యవసాయం దేశానికి మంచిది కాదని మనమందరము ఆమోదిస్తున్నాము. అలాంటప్పుడు కొండలమీద నున్న సవరవాళ్లని ఆ **forest lands** లో వాళ్లని **settle** చేయడానికి తగిన పథకాలు వేసుకో

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri L. Lakshmana Das) [1st March 1956

చాలి. ఈలాంటి భూమి సమస్యను సామాన్యంగా అడిగి వాళ్లందరికి యిచ్చేసి తృప్తిచేద్దామంటే అలా తృప్తిపెట్టడానికి అవకాశంలేదు. దేశంలో బీదతనం ఎంతవున్నది, దేశంలో ఎంతభూమివున్నది, పంచిపెడితే ఎంతమందికి సరిపో తుంది, ఎంతమందిని మనం తృప్తిపరచగలం, అనేదికూడా మనం గమ నించాలి, దేశాన్ని అభివృద్ధి చేసుకోడానికి తగిన మార్గాల నన్వేషిం చడానికి యిది ఒక సాధన కావచ్చును. కాని వెంటనే బంజరు భూములు పంచండి. బంజరుభూములను పంచమని మేము తీర్మానంచేస్తే కాం గ్రెసువారు దీనిని వ్యతిరేకించారని ప్రచారంచేసుకోడానికి తీర్మానం తీసు కొనివచ్చిందేగాని నిజంగా యిది కార్యరూపంలో ఆచరణ యోగ్యముగా వుందా, లేదా అని యోచించి చేసినపుడు ఎవరుకూడా యీ తీర్మానాన్ని అంగీకరించరని మాత్రం నేను భావిస్తున్నాను. **All kinds of Porambokes** Government lands may be given free to all landless poor అన్నారు.

**Poramboke lands** అన్నీ మనం పంచిపెట్టగలమా? **Poramboke lands** అన్నీ పంచిపెట్టినప్పుడు దేశంఏవిధంగా అభివృద్ధిపొందుతుంది? ఈనాడుయీ **L. D. works** అయితే నేమి అభివృద్ధిప్రణాళికలు అయితేనేమి, రోడ్లువేసుకొనే టప్పుడు పూర్వులు విడిచిపెట్టిన బంజరుభూములన్నీ వ్యవసాయంలోకూడి అక్కడ రోడ్లువేసుకోడానికి వీలులేని పరిస్థితులు వస్తున్నాయి.

జనాభా పెరుగుతూవుండేటప్పుడు ఆ జనాభాకు ఎంతవరకు మనం అధికంగా వుంచాలి అనేది చూచుకోవలసిన పరిస్థితులున్నాయి. అంతా వ్యవసాయంక్రింద మార్చి అందరినీ వ్యవసాయంమీదనే ఆధారపెట్టి గ్రామానికి సౌభాగ్యంలేకుండా సౌకర్యంలేకుండా చేసుకుంటే దేశం ఎలా అభివృద్ధిపొందుతుందని నేను అడుగు తున్నాను. అందుచేత యీ సమస్యను చాలా దీర్ఘంగా ఆలోచించాలి. దానికి సరియైన చర్యలను ప్రభుత్వం తీసుకోవాలి. ఆ చర్యలు తీసుకోడానికి ముందు భూములు దేశంలో, ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రంలో ఎంత భూమి వుంది? ఆ బంజరు భూములు జమీందారీ area లో ఎన్ని వున్నాయో గవర్నమెంటు area లో ఎన్నివున్నాయో మొదట స్పష్టంగా లెక్కలుతీసుకోవాలి. ఈ లెక్కలను స్పష్టంగా తీసుకొని దేశంలో ఏ గ్రామానికి ఎంతభూమి కేటాయించవలసి యున్నది? ఇంకొక నూరేండ్లకు సరిపడు భూమికూడా ఆ గ్రామానికి కేటా యించవలసియున్నది. ఆ గ్రామానికి కావలసిన భూమిని వుంచినతరువాత మిగిలిన భూమిని ఎవరెవరికి పంచాలి? వీరందరికి పంచిపెట్టడానికి సరిపడుభూమి దేశ ములో వున్నదా? అనేదికూడా తెలుసుకోవాలి. ఒకప్రక్కన మనమందరము కూడా collective farms వుండాలి, co-operative farms ద్వారా దేశాన్ని అభివృద్ధిచేయాలని ఒక సంకల్పం చేసుకొనేటప్పుడు యిది మళ్ళీ ముక్కముక్కలు, చెక్కచెక్కలుచేసి సామాన్యంగా అందరికి పంచి పెడతామనుకోవ టముకూడా చాలాపొరపాటని నేను మనవిచేస్తున్నాను. అంతేకాదు యీనాడు దేశంలో మన గ్రామంలోవున్న ప్రజానీకంకంటే వీధిలో యిల్లులేక, వాకిళ్లులేక అలమటిస్తూ ఎల్లప్పుడూ తిండిలేక దేశంలో యీవూరునుంచి ఆవూరికి, ఆవూ రునుంచి యీవూరికి దేశమంతా తిరుగుతున్న బీదప్రజలు వున్నవాళ్లు

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

1st March 1956] (Sri L. Lakshmana Das)

మనం సౌభాగ్యవంతంగా వున్నామని చెప్పుకోడానికి మనం యీ గ్రామసౌఖ్యమే చూసుకొంటున్నాము అనుకోవడం చాలా పొరపాటు. వీరిని settle చేయవలసిన అవసరం వున్నది. వీరందరికీ కొన్ని స్థలాలు కేటాయించాలి. ఆ స్థలాలలో వాళ్లకు ఇళ్లుకట్టాలి. వాళ్లకుకూడా వృత్తులు కల్పించే విధానాలను చూసుకోవాలి. అటువంటివారినందరిని మనం ముందుకు తీసుకొనివచ్చి యీ గ్రామంలోనైతేనేమి! ఎక్కడెక్కడ స్థలాలున్నాయో ఆ స్థలాలలోనైతేనేమి వారందరినీ వుంచుకోవాలి. ఇటువంటి పరిస్థితులన్నీ దేశంలో వున్నాయి. అనేక ప్రధానమైన సమస్యలు ముఖ్యంగా బీదతనం, beggar problem వున్నది. అన్నిటికంటే దేశాన్ని beggar problem పీడిస్తున్నది. ఇటువంటి పరిస్థితులన్నీ దేశంలోఉన్నాయి. అనేకప్రధానమైన సమస్యలుఉన్నాయి. అందులో బీదతనంకూడా ఉన్నది. ఈ Beggar problem దేశాన్ని పీడిస్తున్నది. ఈ beggar problem solve చేయాలని ఎన్నాళ్లనుంచో మనం ప్రయత్నం చేస్తున్నాము. అది దేశసౌభాగ్యానికి మంచిదికాదని, క్షేమముకాదని మనవి చేస్తున్నాను. వీధులలో తిరుగుతున్న beggars ను ఏవిధంగా సంరక్షించాలన్నది మనము ప్రస్తుతము యోచన చేయవలసినది మన ప్రథమకర్తవ్యము. దేశంలో ఎవరికైనా మేలుచేయాలని ప్రభుత్వం పూనుకొంటే మొట్టమొదటగా దేశం ఈ అడుక్కునే విధానాన్ని లేకుండాచేయడము మనప్రథమసమస్య. అది చేసిననాడే దేశం సౌభాగ్యవంతమని చెప్పుకోవాలి. మన వీధులలో అడుక్కునేవాళ్లు తినడానికి తిండిలేకుండా ముష్టి ఎత్తుకుతిరిగేవాళ్లు ఉన్ననాళ్లు మనంవిజ్ఞాన వంతులమని గాని, నాగరికులమని గాని చెప్పుకోవడానికి వీలులేదు. ఇలాంటి పరిస్థితులలో వాళ్లను ఏవిధంగా రక్షించాలి, ఏ విధంగా కాపాడాలి, ఏ విధంగా వాళ్లకి పనులు కల్పించాలి, ఏ విధంగా వసతులు కల్పించాలి అనేది మనకుప్రధానమైన సమస్య. ఇటువంటి సమస్యలు మనముందు ఎన్నో ఉన్నాయి. ఇలాంటి పరిస్థితులలో మనం కాపాడి మనం పోషించవలసిన భూమిఉన్నది. ఈభూమిని ఏవిధంగా settle చేసుకోవాలి, ఏవిధంగా అభివృద్ధిచేయాలి, ఏవిధంగా పంచిపెట్టాలిఅన్నది Land Reforms Act లో తీసుకొస్తున్నారు. ఆ Land Reformsలో ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క కుటుంబానికి ఎంతభూమి ఉండాలి అన్నది తేలిన తరువాత దేశంలో ఇంకెంత భూమి ఉంటుంది, ఆ భూమిని ఏ విధంగా మనం అభివృద్ధి చేయాలి, ముక్కచెక్కలుగా చేసి దేశంలోపంటను తగ్గించుకోవడమా ? లేక సమిష్టివ్యవసాయము ద్వారా అభివృద్ధి చేయడమా అనే ఒక బ్రహ్మాండమైన సమస్య మన ఎదుట ఉంటుంది. ఈనాడు భూమిని ముక్కలు చేసి పంచిపెడతాము అనే విషయం ఈ తీర్మానంలో తీసుకురావడానికి ఇది సమయం కాదని మనవిచేస్తున్నాను. అయితే ఈతీర్మానాన్ని తీసుకువచ్చేటప్పుడు ప్రభుత్వంకూడా ఒక విషయం ఆలోచించుకోవాలి. ఈ భూసమస్య పరిష్కరించడానికి ప్రభుత్వం సరైన చర్యలు ఇప్పటినుంచి ప్రారంభిస్తే తప్ప ఏ మూడు నాలుగు సంవత్సరాలకో గాని పూర్తి చేయలేము. దేశంలో ఎంతభూమిఉన్నదో సమగ్రంగా ఒకlistతయారుచేసుకోవాలి. ఎంతభూమిని పంచిపెట్టడానికి అవకాశము ఉంటుందో తెలుసుకొనేందుకు సమగ్రమైన కమిటీనివేసి, ఆ కమిటీద్వారా చర్యలు తీసుకొంటే ఈ భూములను సరైన విధంగా పంచిపెట్టడానికి అవకాశం ఉంటుంది. ఇదే సరైనటువంటి మార్గము. ఈ

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

[1st March 1956 (Sri L. Lakshmana Das)

భూములపైన ఎటువంటివృత్తులుకల్పించడానికి అవకాశంఉంటుందో, ఎవరెవరికి దానిపైన ప్రాధాన్యత ఇవ్వడానికి, హక్కులు ఇవ్వడానికి అవకాశం ఉంటుందనే పరిశీలన చేయవలసిన అవసరం ఉంది. అందుచేత నేను ముఖ్యంగా నా మిత్రుడు శంకరరెడ్డిగారిని (శంకరయ్యగారన్నా, శంకరరెడ్డిగారన్నా ఒక్కటే) ఈ తీర్మానం ఉపసంహరించుకోమని కోరుతున్నాను. ఇప్పుడు ఈ తీర్మానాన్ని pass చేసినంత మాత్రాన ప్రయోజనంలేదు. ఇది చాలా ఆచరణయోగ్యముకాని తీర్మానము. ఈతీర్మానాన్ని ప్రభుత్వం ఒకొక్కప్పుడు అంగీకరించినా, ప్రభుత్వ సభ్యులమైన మేముగూడా అంగీకరించి ఈ తీర్మానాన్ని pass చేసిన దీనిని ఏ ప్రభుత్వంగాని, ఎవ్వరుకూడా అమలుపరచలేరని మనవిచేస్తున్నాను. అమలుపరచడానికి వీలులేని ఈ తీర్మానాన్ని తీసుకువచ్చి దానిపైన చర్చలు సాగించడంకంటె సమగ్రమైన ఆలోచనలుచేసి (శంకరయ్యగారు తమ ఉపన్యాసంలోకూడా చెప్పాలని కోరుతున్నాను) ఈతీర్మానాన్ని ఉపసంహరించుకుంటూ, ఈ భూములను ఏవిధంగా ముందుకు తీసుకురావాలి, labour ను, అడుక్కునేవాళ్ళను, సంరక్షించడానికి ఈ భూములు ఉపయోగపడతాయో లేదో చెప్పటం చాలామంచిదని మనవిచేస్తున్నాను. అందుచేత ముఖ్యంగా నేనుకూడా దేశంలోఉన్న బంజరు భూముల విషయంలో హృదయపూర్వకంగా ఒక విషయం మనవిచేస్తున్నాను. ప్రభుత్వం దీనినిగురించి సరైనచర్యలు తీసుకోవాలి. దీనికి ప్రత్యేకమైన Department ను appoint చేసి దానికి ప్రత్యేకమైన Committee ని నియమించి ఈభూములను ఏవిధంగా ఎవరెవరికి ఇవ్వడానికి అవకాశాలు ఉంటాయి, దానిని ఏవిధంగా మనం అభివృద్ధిచేసుకోవాలి, దానివల్ల దేశంలోఉన్న అనేక సమస్యలలో ప్రధానమైన ఈ beggar సమస్యను, ఇతర కూలీల సమస్యనుగాని తీర్చడానికి ఎంతవరకు ఈ భూమి ఉపకరించగలదు, గ్రామ సౌభాగ్యానికి కావలసినభూమి ఎంతవరకు విడిచిపెట్టడానికి అవకాశం ఉంటుంది అనే ప్రధానసమస్యలన్నిటిపైన చర్చించి సమగ్రమైన రిపోర్టును తయారుచేసి, దేశంలోఉన్న భూముల list ను దేశంముందు చూపెంచాలి. దేశంలో పదికోట్లు ఉన్నాయని, ప్రభుత్వం ఈ భూములను పంచిపెట్టకుండా రాజకీయ బాధితులకు ఇస్తోందని ఇతరులుచెప్పే ఉపన్యాసాలు ఆపుచేసేందుకుగాను దేశంలో ఉన్నభూములు ఇన్ని, ఈభూములపై ఆధారపడిఉన్న సమస్యలు ఇన్నిఉన్నాయి, వీట్ని తీర్చుకోవడానికి ఇంత అవసరం ఉంటుంది అని వారికి తెలియజేయాలి ముఖ్యంగా కొండభూముల విషయంలో.

**Sri V. KURMAYYA** :—ఇది చాలా important resolution కాబట్టి దీనిమీద మాట్లాడదలచినవారు చాలమంది ఉన్నారు. అందరికి chance ఇప్పించవలసిందిగా కోరుతున్నాను. మాకుకూడా Agriculture labour ఉందికాబట్టి మేముకూడా మాట్లాడేందుకు, Speaker గారు time limit చేసి అవకాశం ఇప్పించవలసిందిగా కోరుతున్నాను.

**Sri L. LAKSHMANA DAS**:— అందుచేత ఒక సమగ్రమైన రిపోర్టు ప్రభుత్వం తయారుచెయ్యాలి అని కోరుతున్నాను. ముఖ్యంగా కమ్యూనిస్టు సోదరులు ఏ సమస్యవచ్చినా రాజకీయబాధితులకు భూములు ఇస్తున్నారనే ఉపన్యాసం చెయ్యవద్దు. రాజకీయబాధితులకు ఇవ్వడం ప్రతిదేశంలోను ప్రతిఒక్కరికి కనీస

ధర్మమని భావించాలి. కమ్యూనిస్టుపార్టీకిగాని, మరేపార్టీకిగాని చెందినప్పటికి రాజకీయబాధితులనేవాళ్లు చేసిన త్యాగాలుమాత్రం మరచిపోవద్దని మనవి చేస్తూ విజ్ఞప్తిచేస్తున్నాను. ఈ విషయంలో ప్రభుత్వంవారు ఒక సమగ్రమైన report ను తయారుచేసేవరకు, ఈ భూములవిషయమై సరైన సలహాలు, సూచనలు లెక్కలు వచ్చే వరకు ఎటువంటి చర్యలు తీసుకోవద్దని కోరుతున్నాను. సంబంధించినవారుకూడా ఈ తీర్మానం ఉపసంహరించుకొని ఈ భూములను అభివృద్ధిచేసుకొనేటందుకు భూముల వల్ల వారికి సహాయం చేయగలమని సభ ఉపన్యాసాలలో చెప్పాలని కోరు తున్నాను. ఏది ఎలాఉన్నా ఈ తీర్మానంమాత్రం ఆచరణయోగ్యమైనది కాదు. దీనివల్ల ఎటువంటి ప్రయోజనం ఉండదు. కాబట్టి దీనిని ఉపసంహరించుకోమని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

**Sri V. KODANDARAMI REDDI:**—అధ్యక్షా, బంజరుభూములు గురించి కోవ్వూరు, నెల్లూరు తాలూకాలలో కొంత అలజడి ఉన్నవిషయంలో నేను య్యగారు చెప్పింది అంతా యదార్థం. కాని ఇది ఏవిధంగా ప్రారంభం అయింది, ఏవిధంగా అంత్యమవుతుందనే విషయం మనం చర్చించవలసిఉన్నది. యుద్ధ కాలంలో grow more food campaign క్రింద కొన్ని చెరువుపోరంబోకుల్లో భూమి వారికి, భూములులేనివారికి సాగుబడి చేసుకోవలసిందిగా Government వారు కొంతభూమి ఇచ్చిఉన్నారు. వాటిని వారు అదేవిధంగా సాగుబడిచేస్తే కొంత అభివృద్ధిచేయగా కొంత ఫలితంవచ్చింది. అటువంటి భూములు ఉన్నాయి. ఇప్పుడు మనం యోచించవలసింది కోవ్వూరు, నెల్లూరు తాలూకాలలో ప్రతిగ్రామానికి కూడా చెరువులు ఎక్కువగా ఉంటున్నాయి. నీటి సప్లై లేనప్పుడు గ్రామాలలోని చెరువులనీరు ఆధారంగా సాగుబడిచేసుకోవడం ఏర్పడింది. ముందువ్యక్తిగారు non-delta గ్రామాదులలో చెరువులు అవసరంగాని delta గ్రామాదులలో చెరు వులు అవసరంలేదని చెప్పిఉన్నారు. దానితో నేను ఏమాత్రం ఏకీభవించను. Precarious supply ఉండేటప్పటికి చెరువులు చాలా అవసరం. అందువల్ల డెల్టాగ్రామలలో ముఖ్యంగా ఇప్పుడు ప్రస్తుతం నెల్లూరుకు పెన్నానుండి supply లేనప్పుడు అక్కడివారికి చెరువులు ఉండడం అవసరం. ఈసంవత్సరం నెల్లూరు తాలూకాలో ఈ చెరువుపోరంబోకు భూములకు పెనాల్టి విధించిన సంగతి వాస్తవము. అది కొన్నిజిల్లాలలో ఆందోళనగా ఉన్నది. అయితే ఈ ఆందోళనను సర్దుబాటు చేయవలెనని Government వారిదృష్టికి తీసుకురావడం ముఖ్యమైనది. ఇప్పుడు గ్రామచెరువులలో F. T. L. M. W. L. అని ఉన్నాయి. F. T. L. అంటే full tank level, M. W. L. అంటే maximum water level. ఈ రెంటికి పైన ఏమాత్రం భూమి ఉన్నప్పటికి బంజరుభూములను ఇతరులకు, లేనివారికి ఇవ్వడంలో ఏరైతుకు, ఏగ్రామంలోకూడా ఆక్షేపణ ఉండదు. కాని ఇప్పుడుజరిగే విషయం ఏమిటంటే F. T. L. లోపలవుంటే ఇచ్చివేయడమా, M. W. L. లోపలవుంటే ఇచ్చివేయడమా అని. గ్రామాలలో సాగుబడిచేసుకొనే భూములున్న ప్పుడు చెరువుకట్టలు తెగగొట్టడం వంటివి ఏర్పడుతూ ఉన్నవి. ఈ అలజడి లేకుండా Government వారు కలెక్టర్లకు పూర్తి అధికారం ఇస్తే ఏగ్రామాలలో ఆ గ్రామ రైతులను కనుక్కొనే అవకాశం వస్తుంది. M. W. L. పైనవుండే

భూమిని భూములు లేనివారికి పంచడానికి ఏ రైతుకూడా ఆక్షేపణచేయడు. అదే విధంగా Government వారు గాని, మీరుగాని వారికి ఏదోవిధంగా సహాయపడిన వారు అవుతారని నాయొక్క సూచన.

ఈ సంవత్సరం జరిగినటువంటి penalties విషయంలో, గవర్నమెంటు వారు పీటని జమాబందివరకు stay చేస్తూ ఇటీవలనే ఉత్తరువు పంపించారు. భూమిశిస్తుమటుకు కట్టవలసిందన్నారు, penalties, stay చేశారు. ఇదేదో ఒక ఆశతో ప్రతిసంవత్సరము సాగుచేసుకొంటున్నామని ఈ సంవత్సరంకూడ సాగు చేయడం జరిగింది. ఇకమీదట ఈ విషయములో దర్యాప్తుచేసి కలెక్టర్లు నిర్వచనగా ఈ ఈ గ్రామాలలో ఇన్ని ఎకరాలు సాగుబడి చేసుకోవచ్చును, ఇంతకుపైన సాగుబడి చేసుకోకూడదు అని ఉత్తరువులుచేసి ఈ penalties ను ఒకవిధంగా సడలిస్తే కొంత బాగుంటుందని సూచిస్తున్నాను. మనమిత్రులు వేమయ్య మొదలైనటువంటివారికి ఒక విషయము చెప్పుతున్నాను. వారు గ్రామాలలోకి వెళ్లినప్పుడు, ఆ యా గ్రామాలతో ఎంతవరకు భూమి సాగుబడికి ఇవ్వవచ్చును, అనేటటువంటి విషయాలు, గ్రామస్తులతో కలుసుకొని మాట్లాడుకొంటె కొంతవరకు ఈ అలజడి లేకుండాపోతుంది. కాని, చెరువుపట్లంతా వీళ్లు సాగుచేసుకోవచ్చు అన్నప్పుడు, ఆ అమాయకులు సాగుచేసుకోవడం, తరువాత, వెళ్లిపొమ్మనడం, అప్పుడు మేము బాధపడడం, వారు బాధపడడం జరుగుతోంది. కనుక అట్లాంటిది జరుగకుండా చూడాలి. నాకు తెలిసినంతవరకు ఏ రైతులుకూడ, వారి గ్రామాలలో ఉండే బీదరైతులను హింసపెట్టి వారి భూములను ఆక్రమిస్తారనేది ఎప్పటికీకూడ నేను ఒప్పుకోను. కనుక కమ్యూనిస్టు సోదరులు అటువంటి అవకాశాలు ఇవ్వకుండా, ప్రతి గ్రామంలోను ప్రజలలో సద్భావం కుదురిస్తే గ్రామాదులు బాగుపడతాయని వారికి సూచిస్తున్నాను. తరువాత రాజకీయబాధితుల సమస్య, ఇప్పుడున్న సమస్యలలో ఒక పెద్ద సమస్యగా ఉన్నది. ఆ విషయంగురించి కాశేశ్వరరావుగారు విపులంగా చెప్పివున్నారు. మన ఉమ్మడి మద్రాసురాష్ట్రంలోనే ఇది ప్రారంభమైంది. రాజకీయబాధితులకు భూములివ్వడము కొంతవరకు జరగడం, తరువాత రాజగోపాలాచారిగారి ప్రభుత్వములో, వారు దీన్ని ఆపుదలచేయమన్నారు. దానితో దేశములో పెద్ద ఆందోళన ఏర్పడింది. కొంతమందికేమో ఇదివరకే ఇచ్చేశారు. కాని ఇవ్వకుండాఉండే భూములు లేనివాళ్లు మాత్రము చాలా ఇబ్బంది పడుతున్నారు. కొన్నిచోట్ల assignments కూడ అయి, పట్టాలు ఇవ్వబోయేసరికి, రాజకీయబాధితులకు భూములు ఇచ్చేది ఆపుచేయవలసిందనే ఉత్తరువులు అడ్డము వచ్చి ఇవ్వకుండా నిలిపివేయబడింది. ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత, దీనికి ప్రత్యేకంగా ఒక కలెక్టరును నియమించి, ప్రతిజిల్లాలోను చూచి, ఏయేజిల్లాలో ఎంతవరకు భూములు ఇవ్వడానికి అనుకూలంగా ఉంటుందో చూచి వారికి ఇచ్చివేయవలసిందిగా ఒక ఉత్తరువుచేశారు. కాని ఆ ప్రత్యేక ఉద్యోగిని నియమించిన ఫలితంగాని, ఆయనచేసినపనిగాని మాకు ఈనాటికి తెలియడంలేదు. ఇటీవలనే రెవిన్యూమంత్రి చంద్రమౌళిగారు ఈ political sufferers కు భూములు పంపిణి విషయం చాలా శ్రద్ధగాచూచి, ప్రతిజిల్లా కలెక్టరుకు ఖచ్చితమైన తాకీదు పంపిన విషయము అందరికిని తెలిసినదే. అది అమలుజరుగుతూఉండగా, ఇటీవల మరల

గవర్నమెంటువారు ఇంకొక ఉత్తరువు పంపించారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు వస్తున్నది కాబట్టి ఈ ప్రాజెక్టు ఏరియాలో ఎవరికి భూములు యివ్వకూడదన్నారు. ఇట్టి ప్రాజెక్టు ఏరియాలో భూములు పంపకముచేయడంలో కొంత ఇబ్బంది ఉన్న మాట నిజమే. కాని నెల్లూరుజిల్లాకు సంబంధించినంతవరకు, నెల్లూరుతాలూకాలలో, రాజకీయబాధితులు డెల్టాగ్రామాలలోనే భూములు కోరుతున్నారు. ఇప్పుడు నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఎప్పుడో second phase లోనో, third phase లోనే వస్తుందని ఊహించుకొని, ఈరోజే అ project area లో ఉండే భూములను ఇవ్వడం ఆపివేయడమనేది అంత సముచితముకాదని నా అభిప్రాయం. ఒకవేళ ఒకభూమి project area లో చేరివున్నప్పటికినీ, దానికి ఒక market value వేసిఅయినా, ఈ political sufferers కు ముందు భూములు పంపకం చేసి తమకర్తవ్యాన్ని నెరవేర్చవలసిందని నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత వేమయ్యగారు పెద్ద భూస్వాములు బంజరుభూములంతా ఆక్రమించుకొని సాగుచేస్తున్నారని, కొవ్వూరులోని కొన్ని ఉదాహరణలు చెప్పారు. అయితే నాకు తెలిసినంతవరకు, పెద్దభూస్వాములు బంజరుభూములు మొదలైనవి సాగు చేసుకొంటున్నారనేది ఎక్కడాకూడలేదు అని చెప్పగలను. కాని గ్రామాలలో ఒక భూస్వామికి 50, 60 ఎకరాలున్నప్పుడు, దాంట్లో మధ్యన ఎక్కడో ఒకటి అర ఎకరా బంజరు ఉంటే, దానిని సాగుచేస్తూ ఉండవచ్చు. కాని ఎక్కువ విస్తీర్ణంగల బంజర్లను ఎవరుకూడ సాగుబడిచేయడంలేదని నేను వారికి ప్రత్యుత్తరం చెప్పుతున్నాను.

తరువాత ఈ Field Labour Societies కు గ్రామాదులలోని దేవస్థానము భూములను ఇవ్వవలసిందిగా చెప్పుతున్నారు. అయితే ఈ Field Labour Societies యొక్క ఉద్దేశమేమిటో నాకు అర్థంకావడంలేదు. దేవస్థానములకు కావలసిన ఒరుంబడులుతీసుకొని, వాటి కైంకర్యములకు ఉపయోగించుకొనేనిమిత్తము ఈ భూములు ఏర్పాటుచేయబడియున్నవి. ఒక భూమిని వేలముపేస్తే ఒక పుట్టి ధాన్యంవచ్చే పరిస్థితిలో, దానిని Field Labour Society కి ఇచ్చి, అది ఇచ్చే పందుము తీసుకొని, ఆవిధంగా దానివల్ల వచ్చే ఒరుంబడి వాళ్లు ఎందుకు తగ్గించుకోవలెనో నాకు అర్థంకావడంలేదు. మనమంత్రి సంజీవయ్యగారు చెప్పినట్లు 10 వేలకో, 5 వేలకో contract కు ఇవ్వవచ్చు. అంతేగాని, భూములు auction పెట్టకుండా ఇవ్వడమంటే దేవాలయాలకువచ్చే ఒరుంబడి తగ్గిపోతుంది. ఆభూముల యొక్క అభివృద్ధికూడ తగ్గిపోతుందని నేను సూచిస్తున్నాను. తరువాత రాజకీయ బాధితులకు భూములిచ్చే విషయంలో, ఈ భూములు ఒక్కొక్క జిల్లాకు మొత్తం 2 వేలు, 3 వేలు ఎకరాలకుపైన ఉండవు. అటువంటప్పుడు, ఈ భూములు వారికిచ్చేవిషయంలో కమ్యూనిస్టు సోదరులు ఎందుకు ఆక్షేపణ చేస్తున్నారో నాకు అర్థంకావడంలేదు. వారికి ముందు ఇచ్చినందువల్ల, అవతలవారికి ఇవ్వవద్దు అనేవారు ఎవరులేరు. వారు, వీరు కొంత సర్దుబాటుచేసుకొని ఈ రాజకీయబాధితులకు ముందు ఇచ్చేటట్లు, ఇటీవల కలెక్టర్లకు ఇచ్చిన ఆర్డర్లు సడలించి, ప్రాజెక్టు ఏరియాలో ఉన్నవాటినికూడ market value తీసుకొని, ఇదివరకు assign చేసిన రాజకీయబాధితులకు మరల భూములు ఇవ్వవలసిందని ప్రభుత్వమును

కోరుతూ, ఈతీర్మానాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తూ, కొన్ని విషయాలు గవర్నమెంటు ఆచరణలో పెట్టడం అవసరమని తెలుపుతూ విరమిస్తున్నాను.

*Sri V. VISWESWARA RAO :— అధ్యక్షమహాశయా ! ఈ బంజర్లనుగురించి మాట్లాడుతూ, ప్రత్యేకించి కొంతమంది కాంగ్రెస్ మిత్రులు, కాంగ్రెస్ రాజకీయబాధితులంటే కమ్యూనిస్టులకు ఏదో కక్ష ఉన్నదని చిత్రించడం జరుగుతున్నది. అయితే రాజకీయబాధితులందరికీ భూములివ్వాలి అనే సమస్య నేడు మనము పరిష్కరించవలసింది ఉన్నదికదా ! ఈనాడు చాలామంది రాజకీయ బాధితులకు భూములిచ్చారు. కాని ఆ ఇచ్చిన భూములు, ఎవరెవరికి, ఏయే ప్రాంతాల్లో ఎంతెంత ఇచ్చారో పరిశీలిస్తే, ఒక్కవిషయముమాత్రం ఈ కాంగ్రెసు నాయకులు స్పష్టంగా చూడగలుగుతారు. కృష్ణాజిల్లాకు సంబంధించినంతవరకు కాంగ్రెసు కమిటీలలో ఉండే పెద్దలకు ఈ భూములు పంచేటటువంటి పెద్దలకు మాగాణిప్రాంతాల్లో మంచి భూములివ్వడం జరిగింది. అదేపరిస్థితులలో మరి కొంతమంది రాజకీయబాధితులకు ఎందుకు పనికిరాని భూములిచ్చారు. ఆవిధంగా కృష్ణాజిల్లాలో కొన్నిప్రాంతాలలో సుమారు 3, 4 సంవత్సరములక్రితం ఇచ్చినటువంటి భూములు ఈనాటికి సాగుకు రాలేదు అని చెప్పగలను. శ్రీ కాశీశ్వరరావుగారు ఇతర మిత్రులు కాంగ్రెస్ రాజకీయబాధితులకు భూములు ఇవ్వకుండా కమ్యూనిస్టులు ఏదో చేస్తున్నారని చెప్పారు. వారికి ఒకవిషయము మనవిచేస్తున్నాను. కాంగ్రెసువాదులలోనే బీదవాళ్లకు ఇచ్చేటటువంటి భూములు ఎందుకు పనికిరానివిగా ఉంటున్నాయి; అధికారములో ఉన్నటువంటి పెద్దలకు, కాంగ్రెసు నాయకులకు, రాజకీయబాధితులనే పేరుతో మంచిమంచి భూములు సాగుకు అనువైన భూములు ఇవ్వడం జరుగుతున్నది. ఇది వారు గ్రహించవలసిందని కోరుచున్నాను. కాంగ్రెస్ రాజకీయబాధితులకు భూములు ఇవ్వవద్దు అని కాదు మేము చెప్పేది. వారికి భూములిచ్చేటప్పుడు, అక్కడ ఇదివరకే సాగుచేసుకొంటున్నటువంటి బీదప్రజలను తొలగించి, ఆభూములు కాంగ్రెసు రాజకీయబాధితులకు ఇవ్వవలసిన అవసరంలేదు అని వారికి మరొకసారి మనవిచేయవలసిఉంటుంది. రెండవది మన ముఖ్యమంత్రిగారు ఏ ప్రభుత్వమైనాసరే ఎప్పుడైనాసరే బీద ప్రజలకు పట్టాలు ఇచ్చిందా అని కోటయ్యగారు మాట్లాడే సందర్భంలో అడిగారు. దానికి నేను సమాధానమిస్తున్నాను. శ్రీ కోటిరెడ్డిగారు మంత్రిగా ఉన్నప్పుడు, క్రిష్ణాజిల్లాలో పర్యటనచేస్తూ, బీదలకు బంజర్లు పట్టాలిస్తామని చెప్పినట్లు ఫొటోలతో సహా పేపర్లలో ప్రకటించడం జరిగింది. ఆ రోజులలోచేసిన శాసనసభా తీర్మానమును అనుసరించిగాని, లేక ప్రభుత్వమే ఆనాడు బీదలకు బంజర్లు ఇవ్వాలనే దృష్టిలో గాని ఆవిధంగా క్రిష్ణాజిల్లాలో వారు చెప్పినట్లు కొన్నిపత్రాలు ఇచ్చినట్లు పత్రికలలో ప్రకటించబడింది. ఇదితప్పు అని ముఖ్యమంత్రిగారు చెప్పగలుగుతారేమో నాకు తెలియదు. ఆవిధంగా దివి తాలూకాలోకూడ జరిగింది.

(Interruption by the Hon. Dr. B. GOPALA REDDI)

ఏమంత్రిగారైనా, ఏప్రభుత్వమైనా బీదలకు భూములు పంచిపెట్టిందా అని గోపాల రెడ్డిగారు అడిగినందుకు చెప్పుతున్నాను. మనరాష్ట్రములోనే మనప్రభుత్వమే, కొద్ది మందికి మాత్రము పట్టాలుఇచ్చి మేముకూడ బంజర్లను పంచిపెడుతున్నామని చెప్పారు. కాని ఆ విధానాన్ని మార్చుకోడానికి ఎందుకు ప్రయత్నము జరుగు

ఉన్నదో నేను తెలుసుకోలేకుండా ఉన్నాను. క్రిష్ణాజిల్లాలో 'కొల్లేటి బంజర్లు' అని కొన్నివేల ఎకరాలు ఉన్నాయి. అక్కడ సుమారు 30, 40 వేల ఎకరాలు సాగుకు అనువైన భూములు ఉన్నాయి. ఆప్రాంతాలలో వడ్డరులు మొదలగు చాల మంది బీదప్రజలు చాలా సంవత్సరములుగా వాటిమీద ఆధారపడి జీవిస్తూ ఉన్నారు. అక్కడ అధికవర్షాలు వచ్చి వరదలు వచ్చి ఆప్రాంతాలలో నివసించే అవకాశము లేకపోయినప్పటికిని, అక్కడనే దోనీల్లో కాపురము చేస్తూ నివసిస్తూ ఉంటున్నారు.

గతకొద్దిసంవత్సరాలుగా పేదవాళ్ళు అనేకరూపాలలో కష్టించి సాగుచేసుకొంటున్న భూములను యీనాడు పెద్దపెద్ద భూస్వాములకు ప్రభుత్వము యివ్వడము జరుగుతున్నది. ఉదహారణకు పశ్చిమగోదావరి జిల్లాలో గాదవాటి కనకయ్యగారని ఉన్నారు. వారికికొన్నివేల యకరాలభూమి కొల్లేటిప్రాంతములోనిది యిచ్చారు. ఇదేమాదిరిగా గోకేటిరాజుగారని యింకొకరు ఉన్నారు. ఆయనకుగూడ కొన్నివేల యకరాలు యిచ్చారు. ఈ విధముగా ఉదహారణలు చెప్పాలంటే, ప్రభుత్వము పెద్దపెద్ద భూస్వాములకు ఈ బంజర్లను యిచ్చినచోట్లు అనేకములు ఉన్నవి. ఆ ప్రాంతాలలో సుమారు నల్భైవేల యకరాలుఉంటే అందులో సుమారు 25,30 వేల ఎకరాలవరకు ప్రభుత్వము పెద్దపెద్దభూస్వాములకే యిచ్చింది. దీనిని గత మంత్రివర్గము దృష్టికి, అప్పట్లో రెవిన్యూమంత్రిగాఉన్న కోటిరెడ్డిగారి దృష్టికి నేనుతీసుకొనిరాగా, వారు ఆ ప్రాంతాలలో పర్యటించి, అదిన్యాయము కాదనిగూడ చెప్పారు. ఇది మేము అంగీకరించము అక్కడస్థానికంగా సాగుచేసుకుంటున్న పేదరైతులకే యిస్తామనిగూడ చెప్పారు. ఈ భూములను భూస్వాములు స్వయముగా సాగుచేస్తున్నారంటే, అదేమి కాదు. వారు ప్రభుత్వానికి, పేదరైతులకుమధ్య దళారులుగా ఏర్పడి, పేదవాళ్ల చేత సాగుచేయించి, పండినపంటలో అర్థముఅని, మూడవవంతుఅని, యీ మాదిరిగా, యింజనులు మాత్రము సప్లయిచేసి, నీరుతోడుకొంటున్నట్లుగా నటించి, రైతులనుంచి ఆ భూస్వాములు పండించిన పంటలో భాగము కాజేస్తున్నారు. పేరుకు భూస్వాములు, చేసేదిఅంతా పేదరైతులు. ఈ విధముగా అక్కడ సాగు జరుగుతున్నది. ఎల్లకాలము, సంవత్సరము పొడుగునా కష్టపడేది పేదరైతులు, తీరా, పంటలో భాగము కాజేసేది భూస్వాములు. ఆ విధముగా జరుగుచున్నది; కొన్నికొన్నిచోట్ల భూమినిబట్టి ఎకరానికి రెండుబస్తాలు, మూడుబస్తాలకన్న ఈ పేదరైతులకు మిగలనేమిగలదు. ఈ విషయము గతమంత్రివర్గము దృష్టికిని, మంత్రిగారి దృష్టికిగూడ తీసికొనిరాగా, అదివిచారించి, ఆ భూములను పేదవారికే యిస్తామనిగూడ చెప్పారు. రైతులు పేదవాళ్లు అయినందువల్ల, వాళ్ళు యింజనులు కొనుక్కొని నీరు తోడుకోలేక పోయినందువల్ల, యీ పెద్దభూస్వాములు యింజనులు సప్లయిచేసినట్లు, సాగుచేస్తున్నట్లునటిస్తున్నారు. ఇంజను స్వంతదార్లను, సాగుచేసే యీ పేదరైతులను సమావేశపరచి, యింజనులు ఎక్కడెక్కడ కావాలో ఎక్కడెక్కడ పేద రైతులు యీ యింజనులు కొనుక్కొకలుగుతారో యికమీదటనైనా, ఎవరైతే యింజనులు వారు స్వంతముగా సప్లయిచేసుకోగలుగుతారో విచారించి, వారికే ఆ భూములను యిస్తామని మంత్రిగారు చెప్పారు. జిల్లాకలెక్టరుగారు సమావేశం ఒకదానిని ఏర్పాటుచేశారు, ఆ మాటమీద కొంత

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

1st March 1956] (Sri V. Visweswara Rao)

మందిరైతులు యింజనులు తెచ్చుకొని పెట్టుకోవడముగూడ జరిగింది. కొన్ని గ్రామాలలోని రైతులు, సొసైటీలుగూడ ఏర్పాటుచేసుకుంటామని ప్రభుత్వానికి చెప్పుకోవడము జరిగింది. కాని వారికి యింతవరకూ ఆభూములు మాత్రము యివ్వలేదు. మరల ఆ కనకయ్యగారికి, గోశేటి రాజుగారికి యివ్వడమే జరిగింది. వీరు యిద్దరు యిదివరకు మాదిరిగా రైతులచేత సాగుచేయించి, వారివద్దనుంచి పంటలో అర్థము, ముప్పాతిక భాగము కాజేయడము జరుగుతున్నది. నీటి విషయములోగూడ యీ భూస్వాములు సహాయము చేయరు. యిప్పటికి రెండుసంవత్సరాలుగా వాళ్లకు నీరుగూడ సప్లయిచేసే అవకాశము లేకుండా పోయింది. కారణము ఏమిటంటే, ప్రభుత్వమే రెండవ పంటకుగాను యీ కొల్లేటి భూములకంతటికి నీరు సప్లయి చేయడమనేది జరుగుతున్నది. కాబట్టి, ఆభూస్వాములు అదనంగా నీరు సప్లయి చేయవలసిన అవసరములేదు. దీన్నిబట్టి చూస్తే, ప్రభుత్వమే యీపెద్ద భూస్వాములను దళారులుగా ఉపయోగిస్తున్నట్లుగా తేలుతున్నది. ప్రభుత్వము యీ భూస్వాములకు భూములు కట్టబెట్టి, రైతులవద్దనుంచి కొన్ని వేలరూపాయలు ప్రతి సంవత్సరము భూస్వాములు సంపాదించుకోవడానికి అవకాశం యివ్వడం జరుగుతున్నది. ఈవిధముగా ప్రభుత్వముచేయడము న్యాయముకాదు. ఈభూములన్నీ అక్కడ యిదివరకునుంచీ సాగుచేస్తున్న పేదరైతులకే యివ్వడము అవసరము అని ప్రభుత్వము దృష్టికి తెస్తున్నాను. ఇదిగాక కృష్ణాజిల్లాలో assessed waste lands అని కొన్ని వేలవరకూ ఎకరాలభూమి బంజర్లుగా ఉన్నది. ఈమధ్యనే అక్కడ చిన్నాపురము ప్రాంతంలో యిప్పటికి సుమారు 18, 20 సంవత్సరాలుగా సాగుచేస్తున్న రైతులు ఉంటూఉన్నారు. ఈసంవత్సరము వారికిసరిగా అమనుకు పంటకోసుకునే సమయములో, అంటే నవంబరు, డిశంబరు నెలలలో, మంచికోతల సమయములో వారినందరినీ evict చేస్తామని ప్రభుత్వమునుంచి eviction నోటీసులు వచ్చినవి. అప్పటికి పైరుకోసుకోలేదు. ఈనోటీసులో కారణము యేమిచెప్పాగంటే, పర్మిషనులేకుండా భూములలో ప్రవేశించి సాగుచేశారు కాబట్టి evict చేస్తామని నోటీసు యిచ్చారు. కాని ఆభూములన్నీగూడ assessed waste lands కాబట్టి, వాటిని సాగుకు యివ్వవచ్చును అని ప్రభుత్వము చెప్పింది, ఆవిధముగా అక్కడి రైతులు సుమారు 18 సంవత్సరములనుంచి సాగుచేస్తున్నారు. ప్రభుత్వము శిస్తువిధించి, వసూలుకూడ చేస్తున్నది. రైతులవద్ద రసీదులుకూడ ఉన్నవి. ఇవి అన్నీ జరిగినతరువాత గూడ యిటువంటి ఆర్డర్సు యిచ్చారు. ఈనోటీసులు అందినవెంటనే రైతులు కలెక్టరువద్దకు వెళ్ళి, యిన్ని సంవత్సరాలుగా మేము సాగుచేస్తున్నాము, భూమికి శిస్తుకట్టుతున్నాము, రసీదులుగూడ ఉన్నవని చూపించి, పంటతయారుగా ఉన్నది, దాన్నికోసుకొని పోనివ్వండి, అని ఒక్కరోజులో, రెండురోజులో వాయిదా యివ్వమని అడిగితే, వారు అప్పుడు అందుకు ఒప్పుకున్నారు. తరువాత ఆభూములలో కొన్నింటిని యిప్పుడు రాజకీయ బాధితులకు కేటాయిస్తారట. ఇటువంటి విధానము ప్రభుత్వము ఎందువల్ల అవలంబిస్తున్నదో అర్థము కావడములేదు. ఆ భూములు అన్నీ assessed waste. సాగుకు యివ్వవచ్చును. ఇప్పటికి 18, 20 సంవత్సరాలుగా సాగుచేస్తున్నారు. ఆ భూములను యింకా ఎవ్వరికీ గూడ యివ్వలేదు,

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)



పోనీ, అవి ఏమైనా project affected area లో ఉన్నవా అంటే, అదేమికాదు. ఆభూములు వాళ్ళకు యివ్వడానికి, వారు సాగుచేసుకోటానికి ఎవరూ ఏమీ అభ్యంతరము పెట్టలేదు. పైగా ఎక్కడినుంచో కాలువను వారంతటవారే త్రవ్వుకొని, వచ్చి, వారిభూములకు నీరు సప్లయిచేసుకుంటున్నారు. ఇవి అన్నీగూడ యింతవరకూ ప్రభుత్వము అంగీకరించినదే. క్రిందనుంచి రిపోర్టుసుకూడ వున్నవి. కాని యింతటిలోకి ప్రభుత్వము యీ eviction notices జారీచేయుటము ఎందుకో తెలియడములేదు. కారణము విచారించగా, యిదివరకు G. M. F. Scheme క్రింద అప్పుడు అధిక ఆహారోత్పత్తి అవసరమైనందున యిచ్చాము, యిప్పుడు ఆ అవసరము తీరిపోయింది గనుక భూములను విడవవలసిందని నోటీసులు యిచ్చారు. ఈనాడు ప్రభుత్వమునుంచి మరల కొత్తరూలు ప్రకారము పర్మిషను పొందవలసి ఉన్నది. ఆవిధముగా పొందలేదని, eviction notices యిచ్చాము అనికూడ చెప్పారు. ఆనాడు ప్రభుత్వముయొక్క అవసరానికి రైతులు కష్టించి భూములు సాగుచేశారు. ఈనాడు ఉచితముగా విడిచివెళ్ళమని అంటే, యిది ఎంతటి దుస్సాధ్యమో ప్రభుత్వమే గ్రహించాలి. వారిని నిజముగా భూములనుంచి తొలగించవలసిన అవసరములేనేలేదు. ప్రభుత్వమువారు యీ భూములు యివ్వవచ్చును అని నోటితో oral గా చెబుతారేగాని తీరా, కాగితముమీదకు వచ్చేసరికి, యీభూములకు పట్టాలుయివ్వటానికి వీలులేదని అంటున్నారు. ఇదేవిధముగా కృష్ణాజిల్లాలో చూచుకుంటే జమీందారీ ప్రాంతాలు ఎన్నోఉన్నవి. చాలా జమీందారీ ప్రాంతాలు ప్రభుత్వము స్వాధీనము చేసుకున్నది. ఈప్రాంతాలలోని జమీందార్లు ఆ భూములను వారికే పట్టాలకు యివ్వవలసిందని ప్రభుత్వాన్ని కోరితే, ప్రభుత్వము యివ్వలేమ తరువాత A. S. O. కోర్టులు ట్రిబ్యూనల్ కోర్టులో, యీ భూములకు పట్టాలను యివ్వమనికోరితే, అక్కడగూడ యివ్వలేదు. ఈభూములు అనేక సంవత్సరాలుగా రైతులు సాగుచేసుకుంటున్నారు. తిరువూరు తాలూకాలో అనేక గ్రామాలలో యిటువంటి భూములు ఉన్నవి. అక్కడనే కొండూరు అనేగ్రామము ఉన్నది. రెడ్డిగూడెము ఉన్నది. కోకిలంపాడు, తునికపాడు వగైరా గ్రామాదులు ఉన్నవి. ఈ గ్రామాలలోవున్న బంజర్లు అన్నీ వ్యవసాయకూలీలే సాగుచేస్తున్నారు. అక్కడ యిదివరకు జమీందారీ గ్రామాలలోవున్న మొఖాసాదార్లు యీభూములకు పట్టాలు యివ్వమనికోరగా, ప్రభుత్వము నిరాకరించింది. అయినప్పటికీ ఆగ్రామాలలో ఉన్న పేదరైతులకే యీభూములు యివ్వడము న్యాయము. ప్రభుత్వము ఆవిధముగాచేయకుండా 144 వ సెక్షనో, మరే యితరసెక్షనో ఉపయోగించి, వారందరినీ యీభూములనుంచి తొలగించాలని ప్రయత్నములు జరుగుచున్నవి. ఈవిధముగా ప్రభుత్వము చేయడము న్యాయముకాదు. అసలు ప్రభుత్వమే జమీందార్లకు పట్టా యివ్వడముగాని, జమీందార్లకు ఆభూములమీద హక్కు ఉన్నదని చెప్పడముగాని తగదు. కాబట్టి ఆభూములను ఆపేదరైతులకే యివ్వాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

మరొక ఉదాహరణ చెప్పదలచాను. బెజవాడ తాలూకాలో చంద్రాల అనే గ్రామానికి నేను వెళ్ళినప్పుడు, అక్కడ బంజరు భూములను స్వయముగా చూచాను. రైతులు సాగుచేస్తున్నారు. అడంగలులో మాత్రము వాగుపోరంబోకు అనిగాని, చెరువు పోరంబోకు అనిగాని వ్రాసియున్నది. కాని నిజముగా

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)



చూస్తే, యీభూములతో వాగుకుగాని, చెరువుకుగాని ఎలాంటి సంబంధము లేదు. కాని అక్కడఉన్న అజ్మాయిషీ ఆఫీసర్లుగూడ దీనియందు శ్రద్ధ వహించి, యీ తప్పును సవరించేటట్లు చేయలేదు. వాళ్ళుగూడ కళ్ళుమూసుకొని, యిదివరకు అడంగల్‌లో ఏవిధముగా వ్రాసియున్నదో, అదే పేరుతో జరుపుతున్నారు. ఆవిధముగా వ్రాసినందువల్ల, **highest penalties** కు ఆ రైతులు గురి అవుతున్నారు. అడంగలులో పేరుమార్చినట్లయితే, యింత ఎక్కువ పెనాల్టీలుపడవు. ఆ అజ్మాయిషీ ఆఫీసర్లుగూడ లెక్కచేయడములేదు. అడంగలులో వ్రాసిన ప్రకారము ఆపోరంబోకుల యొక్క **purpose serve** కావడములేదు. కాని **highest penalties** చెల్లించడము జరుగుచున్నది. ఇది సరియైన పద్ధతికాదు. జమీందారీ ప్రాంతాలలో ఒకవేళ ఎక్కడైనా పేరు వరసకు ఆవిధముగా పిలచినా, **actual**గా, ఏ **purpose** కోసము యేభూములు ఏర్పాటుచేశారో ఆ **purpose** కోసము జరుగుతున్నవా లేదా అని చూచేవారు. కాని యిక్కడ ఆవిధముగా జరగడములేదు. అజ్మాయిషీ ఆఫీసర్లుకూడా తగినమార్పులు చేయించలేదు. ఆవిధముగా పేర్లు మార్పించకపోతే ఎప్పటికైనా ఆ రైతులు ఆభూములనుంచి తొలగించబడే అవకాశము కలుగుతుంది. పేర్లు మార్పించి రైతులకు పట్టాలు యివ్వవలసియున్నది. అప్పుడు యీ **highest penalties** కూడ తప్పిపోగలవు. ఇదేవిధముగా 1942 సంవత్సరము నుంచి **G. M. F.** స్కీముక్రింద రైతులకు సాగుకు యిచ్చిన భూములు వేలకొద్దీ ఉన్నవి. ఆనాడు ఆభూములు యిచ్చాము, యిప్పుడు ఆ స్కీములేదు కాబట్టి భూములనుంచి తొలగండి అని అంటున్నారు. లేకపోతే **heavy penalties** వేస్తామని గూడ అంటున్నారు. ఆనాడు **G. M. F.** స్కీము క్రింద ప్రభుత్వము **encourage** చేసిన రైతులకు భూములుయిచ్చారు. ప్రభుత్వము ఆనాడుచేసినది యీనాడు ఎందుకు చేయకూడదు? ఈనాడు వారిని భూములనుంచి తొలగించవలసిన అవసరము యేమివచ్చింది? ఆనాడు అధికఉత్పత్తిచేయాలి అని ప్రభుత్వం చెప్పింది. ఈనాడు మాత్రము ఆఉత్పత్తి అవసరము ఎక్కడికి పోయింది? ఒకసారి ప్రభుత్వము తన అవసరముకోసము భూములలో రైతులను ప్రవేశపెట్టి, యీనాడు తన అవసరము తీరిపోగానే, భూములనుంచి తొలగమని చెప్పడము సరియైనపద్ధతేనా అని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. కాబట్టి ఆవిధముగా కష్టపడి భూములను సాగుచేసి, పంటలు పండించేస్థితికి తెచ్చిన ఆ రైతులను తొలగించకుండా, వారికష్టమునకు ప్రత్యామ్నాయముగా యీభూములను వారికే యివ్వమని విజ్ఞప్తి చేస్తున్నాను.

తరువాత అడవి బంజర్లు అనేవి ఉన్నవి. ఈ విషయము ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారి దృష్టికి ఎన్నోసార్లు తీసుకొనిరావడము జరిగింది. అడవి బంజర్లలో చెట్లు పెంచాలని అన్నారు. ఈ బంజర్లలో ప్రభుత్వమువారి తరఫున నాటిన చెట్లు చూచాను. రైతులు సాగుచేస్తున్న భూములలో కుమిరీసిస్టముక్రింద నాటిన చెట్లు చూచాను. వీటికి వాటికి ఎంతో తేడాలు ఉన్నవి. ప్రభుత్వము వేసినచెట్లుఅన్నీ చాలాభాగము మొలవనేలేదు. రైతులు నాటినవి ఎంతోబాగాఉన్నవని. ఆ రైతులు వెళ్ళి చెప్పినప్పటికినీ, వారు చెప్పినది వినక, మేము చెప్పినప్రకారమే చెట్లను నాటాలి అని ఉద్యోగస్థులు చెబుతున్నారు. ఆ భూములు రైతులకు యివ్వటానికి వీలులేదని చెబుతున్నారు.

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri V. Visweswara Rao) [1st March 1956

కుమిరీసిస్టము క్రింద ఒక forest areaను ప్రభుత్వము యిచ్చారు, అక్కడచెట్లు నాటాము. సుమారు మూడు బస్తాలు గింజలు నాటటమయినది. రైతులు వేసినవి బాగా మొలచినవి. అవి compare చేసి కూడ ఉద్యోగస్థులు మీకంటె మేమేబాగా నాటాము అని చెబుతారు. నిజస్థితి compare చేసి చూస్తే తెలుస్తుంది. ఉద్యోగస్థులు నాటిన చెట్లు అన్నియు బ్రతుకలేదు. బహుశ ఏపదిపర సెంటో, ఇరవై పర సెంటో బ్రతికిఉండవచ్చు. కాని ఉద్యోగస్థులు పైకి వ్రాసుకునే రిపోర్టులుమాత్రము చాలా బాగాయున్నవని, వారికి అనుగుణముగా వ్రాసుకుంటూ ఉంటారు. ఇది యేమిటి అని అడిగితే, మమ్ములను ద్వితీయపంచవర్షప్రణాళికలో చెట్లు పెంచమని అన్నారని చెబుతారు. రైతులు పెంచే చెట్లకు, ఉద్యోగస్థులుపెంచే చెట్లకు చాలా తేడాలు ఉన్నవి. ఆ చెట్లుపెంచే ప్రాంతాలు ఒక పర్యాయము మంత్రిగారు చూస్తారని ఆశిస్తున్నాను. Kumiri System fail అయిందని కాగితాలమీద వ్రాస్తూ ఉంటారు. కాని యీ system క్రింద చెట్లను ఎవరు పెంచినా, ఎవరు నాటినా' ఎప్పుడు నాటినా, అది failure యేఅయిందని, అవుతుందని వ్రాస్తారట. మీరు ఏమి చెప్పినా, ఎవరు ఎన్ని చెప్పినా మేమునమ్మము. ఈsystem fail అయించని వాళ్ళు వ్రాస్తారు. Fail అయిందని ప్రభుత్వము నమ్మి, యీ system ను రద్దుచేయటానికి ప్రభుత్వము చూస్తున్నది. యదార్థముగా, అక్కడ పెంచినచెట్లు అన్నీ ముఖ్యమంత్రిగారే స్వయముగా ఒక పర్యాయము చూస్తే ఉన్నవాస్తవము బైట పడుతుంది. రైతులు యీ సిస్టము బాగానే ఉన్నదని చెప్పిన సిద్ధాంతమును ప్రభుత్వము "కాదు" అని చెప్పవలచుచున్నది. ఇదికూడ నేను ప్రభుత్వముదృష్టికి తెస్తున్నాను. ఇటువంటి ప్రత్యేకసమస్యలు ఉన్నప్పుడు ప్రభుత్వము వాటిని శ్రద్ధతో గమనించాలని కోరుతూ విరమిస్తున్నాను.

* **Sri K. PUNNAYYA** :— అధ్యక్షా ! సభలో బంజరు భూముల విషయమై అనేకసార్లు చర్చలు జరిగి ఉన్నాయి. ఈ తీర్మానం కేవలం రాజకీయ బాధితులను దృష్టిలో పెట్టుకొనిమాత్రమే ప్రతిపాదించబడిందని చెప్పడంలో నాకేమీ సందేహంలేదు. ఐతే పేదప్రజలకు సంబంధించిన, ముఖ్యంగా హరిజనులకు సంబంధించిన వ్యవహారాలలో బంజరుభూముల పంపకం విషయాన్ని గురించి ప్రభుత్వం సానుభూతికరమైన దృక్పథం వహించినా స్థానికంగా ఉండే ఉద్యోగస్థులు, గ్రామస్థులు సానుభూతికరమైన దృక్పథం వహించడంలేదు. గత పది సంవత్సరాలుగా హరిజనులకు బంజరుభూములివ్వాలని ప్రభుత్వం సంకల్పించుకున్నది. అందుకు అనుగుణ్యామైన G. O. లు pass చేసింది. తక్కిన జిల్లాలలో అనుభవం ఎట్లావున్నా ముఖ్యంగా శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలలోమాత్రం హరిజనులకు 5% భూమిఅయినా లభించలేదు. ఈ విషయం ఇదివరకు Budget Session లో చెప్పిఉన్నాము, ఈరోజుకూడా చెబుతున్నాం. మా విశాఖపట్టణం శ్రీకాకుళం జిల్లాలనుంచి General seats నుంచి వచ్చినటువంటి, Reserved seats నుంచి వచ్చినటువంటి candidates అందరూ ఈ విషయాన్ని గురించి చెబుతున్నారు. Landless poor అంటే ప్రతిఒక్కరూకూడా ఇప్పుడు landlees poor గానే పరిగణింపబడుతున్నారు. State Harijan Welfare Committee లో కూడా మేము ఈ విషయం చెప్పి 'preference must be given to Harijans' అని తీర్మానము చేయించి ఉన్నాము. ఇంకెవ్వరికీ ఇవ్వకూడదని మేము చెప్పడము

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri K. Punnayya) [1st March 1956

లేదు. హరిజనులకు మొదటిస్థానం ఇవ్వాలనిమాత్రమే మా అభిప్రాయము. ఇది వఱకు ఉన్నదికాని, ఇటీవల మన communist సోదరుల ప్రతిఘావిశేషాలచేత కాబోలు ఈ preference వెనుకకు పోయింది. చివఱకు హరిజనులకు భూమి లభించకుండాపోతోంది. ఈ విషయంలో ప్రభుత్వం పునరాలోచించి హరిజనులకు ఈ preference ఇవ్వాలని కోరుతున్నాను. మిత్రులు కొందరు nomadic tribes విషయంచెప్పారు. వారికి భూములు ఏర్పాటుచేసి స్థిరవాసములు కల్పించాలనే అభిప్రాయం తెలియజేస్తున్నారు. అదిచాలా సంతోషకరమైన విషయం. ఈ విషయంలో హరిజనులకంటే వారికే మొదటి preference ఇవ్వవచ్చు. గ్రామాలలో caste Hindus యొక్క బలానికి తట్టుకోలేకుండాయున్నారు, హరిజనులు. కరణాల, గ్రామపెద్దల, ఒత్తిడి ఆఫీసర్లపై ఎక్కువగా ఉంటుంది. హరిజన శాసన సభ్యులు జిల్లాలో ఏ ఒకరో ఇద్దరో ఉంటే వాళ్ళు ఈ officer లతో, మంత్రులతో నిత్యము చెప్పుకోవడం కష్టంగా ఉంటుంది. అందుచేత G. O. లో స్పష్టంగా preference must be given to Harijans అని వ్రాస్తే హరిజనులకు మేలు కలుగుతుందని నా అభిప్రాయం. మాజిల్లాలో వేలాది ఎకరాలు బంజరులుగా ఉన్నాయి. ఈ భూములు పెద్దపెద్ద భూస్వాముల, పెద్ద రైతుల ఆక్రమణక్రింద ఉన్నాయి. ఈ ఆక్రమణ తొలగించాలని యిదివరకు కోరినట్లుగానే మరల నేను హృదయపూర్వకంగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. పెద్దపెద్ద భూస్వాములు ఆక్రమించిఉంటే వారిని తొలగించాలని G. O. లో స్పష్టంగా ఉన్నది. స్థానిక officer లు దానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నారు. ఇటీవల నేను ఒక case జిల్లా కలెక్టరుకు తెలియజేశాను. ప్రభుత్వానికికూడా తెలియజేశాను. 500 ఎకరాలు కలిగిన ఒక భూస్వామి, 15 వ్యవసాయకూలీ కుటుంబములచే ఆక్రమింపబడిన భూమిపై దరఖాస్తుపెట్టి ఆక్రమించ ప్రయత్నంచేస్తూఉంటే, హరిజనులకు న్యాయముచేకూరలేదు సరికదా స్థానిక అధికారులు హరిజనులకు మరొక భూమి చేస్తున్నారు. ఈక్రొత్తగా ఏర్పాటు ఈయనున్నభూమి ఆదివరకే మరిఒక గ్రూపు హరిజనులచే ఆక్రమింపబడిఉన్నది. అటుల ఉభయులమధ్య తగాదాలను సృష్టించుచున్నారు. ఈ హరిజనులకు వ్యతిరేకులైన officer ల విషయమై ప్రభుత్వం శ్రద్ధవహించి మందలిస్తుందని ఆశిస్తున్నాను.

హరిజనులలో చాలామంది objection లేనటువంటి బంజరుభూమికి దరఖాస్తు పెట్టుకుంటున్నారు. అభ్యంతరం ఉన్నటువంటి భూములు ఇవ్వకూడదని మా అభిప్రాయం. అభ్యంతరంలేని భూములే హరిజనులకు ఇవ్వాలని మాకోరిక. అవి కూడా ఇవ్వకుండా దానికి లేనిపోని సమస్యలు సృష్టించి హరిజనులకు భూములు లభించకుండాచేస్తున్నారని ప్రభుత్వదృష్టికి మరలతీసుకువస్తున్నాను. ఇక penalties విషయమై ఇదివరకు మేము చెప్పిఉన్నాం. మా జిల్లాలో penalties వసూలు చేస్తున్నారు. ఈ విషయం మరొకసారి ప్రభుత్వం జిల్లా officer లకు instructions ఇచ్చి ఇబ్బందులు తొలగిస్తారని నమ్ముతున్నాను. రాజకీయబాధితులకు బంజరుభూములు ఇవ్వకూడదని మేము చెప్పడంలేదు. వారికివ్వగా మిగిలిన భూములు అభ్యంతరంలేనిభూములు యిచ్చేవిషయంలో మొదటిస్థానంహరిజనులకు ఇవ్వాలని ప్రభుత్వం ఆజ్ఞలు పంపుతుందని ఆశిస్తున్నాను.

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

[1st March 1956

**Sri C. P. THIMMA REDDI** :—అధ్యక్షుమహాశయా! బంజరుభూముల విషయంలో, ప్రతివ్యక్తిగూడ భూములుకావాలని ఆసక్తిచూపుతున్నాడు. ఎందుకు కావాలంటున్నాడంటే దానివల్ల లాభంఉంటుందినే. ఒకప్పుడు భూములు ఎవరికీ అవసరంలేని రోజులుండేవి. మళ్ళీ అలాంటిరోజులు వస్తాయేమో. భూములు గిట్టుబాటు కావడంలేదంటే ఎవరూ ఆశించరు. మాప్రాంతంలో ఒక బ్రాహ్మణునికి 2 వేల ఎకరాల భూమిఉంటే అందరినీ పిలిచి వ్రాసిఇచ్చాడు. అంటే అవిఆనాడుపన్ను కూడా గిట్టనిరోజులు. దానివల్ల లాభంకల్గుతుంది, సుఖంకల్గుతుంది అంటే, ఏదో పుట్టెడు గింజలు వస్తాయంటే భూమికావాలని అందరూ కోరుతారు. రాజకీయ పార్టీలవారు వారిని రెచ్చగొడుతూ ఉంటారు. ఏదో ఆహ్లాదంగా మాటలు చెప్పి రెచ్చగొడతారు. ఇంతకుముందు గ్రామాలలో నారిగాళ్ళని ఉండేవారు. వాళ్ళు అత్తమాటలు అత్తగారినగ్గర. కోడలు మాటలు కోడలికి చెబుతూ ఉండేవారు. అందువల్ల వారు ఇంటికిపోతే అత్తఉన్నా పెడుతుంది, కోడలున్నా పెడుతుంది. ఇద్దరివల్ల ఉపయోగం పొందేవారు. అలాగే నేటిరోజులలో పార్టీలవారంతా ఏమిచేస్తున్నారంటే కేవలం భవిష్యత్తును గురించితప్ప, జరిగే దాన్నిగురించి మాట్లాడడంలేదు. రెచ్చగొట్టేవిధానం పరిపాటిఐంది. వ్యక్తులను ఎట్లామాట్లాడి బోల్తాకొట్టించాలో అది బాగా తెలుసుకున్నారు. భూమి ఎవరికి కావాలంటే—అన్నం ఎవరికి కావాలంటే ఆకలి ఉన్నవారికి— అట్లాగనే ఎవరు దానివల్ల ఉపయోగం పొందుతారో, ఎవరుదాన్ని అభివృద్ధిలోకి తీసుకువస్తారో వారికి అవసరం. దేశానికికాని, కుటుంబానికికాని ఎవరయ్యా ఉపకారిఅంటే, ఎక్కువ కష్టంచేసి, తక్కువ ఎవడు ఖర్చుచేస్తాడో వాడు ఉపకారి. అనగా ఎక్కువ ఆదాయం సంపాదించి తక్కువ ఖర్చుచేసేవారు దేశానికి ఉపకారం చేసేవారు. కాని తక్కువ సంపాదనచేసి, ఎక్కువ ఖర్చుపెట్టేవారు దేశద్రోహులు. అది కావాలి ఇదికావాలి అని అందరూ చెబుతారు. వచ్చే ఆదాయంమాత్రం చూడరు. నిత్యకృత్యాలకు ఖర్చు ఎక్కువవుతోంది. వ్యవసాయం దెబ్బతింటోంది.

ఈనాడు వ్యవసాయము దెబ్బతింటున్నది. ఇటువంటి రోజులలో వ్యవసాయంచేసేవారు ఎవరైనా ఉంటారా, అనే ప్రశ్నకూడా ఈనాడు ఉన్నది. పల్లెలలో ప్రస్తుతము చాలా విపరీతముగా ఉన్నది. పట్నంలో ఉన్నవారికి తెలియకపోవచ్చును. ఎప్పటికి ఏమౌతుందో తెలియదు ఈ భూముల పరిస్థితి. వద్దు అనే పరిస్థితికూడా ఏర్పడవచ్చును. ఇప్పుడు భూములమీద కొంత వస్తుంది. మళ్ళీసంవత్సరం రాకపోవచ్చు. ఉద్యోగంవల్ల ఆదాయం వస్తుంది. ఎలాగ కూర్చున్నా ఉద్యోగస్థులకు జీతాలు వస్తవి. పనిచేసినా చెయ్యకపోయినా సక్రమముగా జరిగిపోతుంది అని అందరు ఉద్యోగాలకు పోతున్నారు. దేనిమీద గిట్టుబాటు ఉంటుందో దానిమీద పడడం సహజం. వ్యాపారం బాగుంటే దానిమీద పోతారు. **History repeats itself.** ప్రకృతికూడా ఆ మాదిరిగానే ఉంటుంది. **Routine** లో మారుతూ మారుతూ పోతూఉంటుంది.

ఎక్కడచూసినా బంజరుభూమి కావాలనిఆభూమి కావాలని, ఈభూమి కావాలని అనడంతప్ప ఇంక ఏమీలేదు. క్రిందివారికి ముఖ్యముగా ఏమైనా గిట్టుబాటు అవుతుందా ? పూర్వం భూమిలేనివారు లేరు. ప్రతివారికి భూమిఉండేది అంతా ఈనాముక్రింద ఉండేది. అప్పుడు గ్రామాలలోచూస్తే అందరి భూములు వీడుగా

ఉంటేవి. నానాఅవస్థలు పడేవారు. రైతుకు భూమి కావలసినదే. సాగు చేసేవారికి భూమి ఉండవలసినదే. గాని ఇప్పుడు మాట్లాడేవారికి భూమి, కావలెను అంటున్నారు. వారు ఎప్పుడూ మాట్లాడేవారేగాని, చేసే వారుకాదు, నిజముగా అనుభవించేవారికి రైతులైనాసరే, కూలీ అయినా సరే, ఏ వర్గస్థులైనాసరే దానిని ఆధారముగా చేస్తుకొనేవారికి భూములు కావలసినదే. కర్నూలు town లో ఉండి పల్లెలలో భూమి కావలెనంటే ఏమిటి అర్థం? గ్రామంలో ఉండి వ్యవసాయంచేసే ఏ వ్యక్తికైనా భూమి కావలెనడంలో నేను ఏకీభవిస్తున్నాను, కాని ఉద్యోగముచేస్తూ town లో ఉంటూ ఉన్నవారికి భూములు ఇవ్వడము సమంజసముకాదు.

ప్రతి గ్రామములో ప్రత్యేకపనులకు కేటాయించబడిన బంజర్లు ఉన్నవి. శ్మశానం, పోరంబోకు, డొంక పోరంబోకు, రస్తా పోరంబోకు, Tank Beds అని ఉన్నవి. ఉత్తరోత్తరా ఏదైనా ఉపయోగపడుతుందని వాటిని ఉంచారు కాబట్టి వాటిని ఉత్తర్వులు పుచ్చుకొని చెయ్యవలెను. కాని పంపిణీ కావలెనని అంటు న్నారు. మామూలుగా జరుగుతునే ఉన్నది. బంజరుభూములను పేదవారు సాగు ఒడిచేస్తే పెనాల్టీ వేస్తున్నారు. ఇదివరకు పెనాల్టీలేదు. నెల్లూరుమిత్రులు చెప్పారు ముందుగానే పెనాల్టీ వేస్తున్నారని. ఎంతవరకు అవసరమో, ఎంతవరకు వెయ్య వచ్చునో ఆలోచించి గవర్నమెంటువారికి అవసరం అయితే తీసుకోవచ్చును. అంతేగాని పట్టాలు ఇవ్వవలసిన అగత్యంలేదా? రస్తా ఉంటుంది. మట్టిదగ్గరలో ఉంటుందని వెయ్యడానికి అక్కడ పెట్టారు. K. C. Canal కు అటుగోలుసు ఇటు గోలుసు పెట్టారు. ప్రమాదంవస్తే మట్టికోసము పెట్టారు. రైతుకు పట్టాఇస్తే గవర్నమెంటుకూడా దానిలో ప్రవేశించడానికి అవకాశం ఉండదు. సాధక బాధకాలు ఉండవచ్చును. బీదలకు అవకాశం ఇస్తే పట్టాఇవ్వకుండా పెనాల్టీ ఎక్కువ వెయ్యకుండా క్రమముగా జరిగితే బాగానే ఉంటుంది. ప్రత్యేకను పట్టాలు ఇవ్వకుండా ఈవిధముగా చెయ్యవలెనని మనవి చేస్తున్నాను. ఈభూములు వస్తాయి, పోతాయి. వీటికి ఎక్కువ ప్రాధాన్యము ఇవ్వవలసిన అగత్యంలేదు అని నేను మనవిచేస్తున్నాను.

**Sri V. KURMAYYA :—** అధ్యక్షా, ఈ బంజరు భూములసమస్య దాదాపు 20 సంవత్సరాలనుంచి కాంగ్రెసు ప్రభుత్వం ఆలోచిస్తున్నది. 1937 సంవత్సరం రాజగోపాలాచారి నాయకత్వంలో ప్రథమ కాంగ్రెసు ప్రభుత్వం ఏర్ప డినపుడుకూడా ఈ భూములు ఏమిచెయ్యవలెననే విషయం ఆలోచిస్తూనే ఉన్నారు. ఇప్పటికి 20 సంవత్సరాలు అయినా ఈ సమస్య పరిష్కారము కాకపోవడము విచారకరమైన విషయము. అప్పుడు ప్రథమ కాంగ్రెసు ప్రభుత్వములో రాజ గోపాలాచారి 27 నెలలు మాత్రము ఉండినారు. తరువాత కారణాంతరాలవల్ల దేశస్వతంత్రంకోసం లెజెస్లేటర్సు జైళ్ళకు వెళ్ళడం, మళ్లీ Advisor's ప్రభుత్వం చేతులలోకి రావడము, తిరిగి 1946 లో కాంగ్రెసుప్రభుత్వం రావడము, ప్రధాన మంత్రి ప్రకాశంగారి నాయకత్వం క్రింద ఈ భూములను ఏమిచెయ్యడమని విచా రించడము ప్రారంభించారు. అప్పుడు బంజర్లను ఉచితంగా పేదలకు ఇవ్వ వలెనని అన్నారు. అప్పుడు హరిజనులకు preference ఇవ్వాలని అన్నారు. ఎందుకు ఇవ్వాలని కొంతమంది కమ్యూనిస్టులు ఒప్పుకోలేదు. హరి

GRANT OF BANJAR OR PORAMBOKE GOVERNMENT LANDS TO LANDLESS POOR—(Contd.)

(Sri V. Kurmayya) [1st March 1956

జనులకు కాంగ్రెసుచేసిన సహాయము మరువజాలము. Landless labour, కార్మిక రాజ్యం అని చెబుతూ హరిజనులకు ఈ ప్రిఫరెన్సులేకుండా చేస్తున్నది ఈ కమ్యూనిస్టులే. రెండవసారి ప్రకాశంగారి మంత్రివర్గానికి బలము లేకపోవడంవల్ల ఈ perference పోయి, టాడీ టాపర్సు అనేమాట వచ్చిందని తెలుస్తుంది. హరిజనులంటే అగ్రికల్చరలు లేబరర్సు, వ్యవసాయముమీదఆధారపడి భూమిలోపండించే వారికి మనము ఇవ్వవలెను, రైతు మనకు వెన్నెముక అని చెప్పినపుడు రాత్రి పగలు కష్టపడి తన భార్యాపిల్లలుకూడా కలసి వ్యవసాయము చేస్తున్న వారికి preference ఇవ్వడం న్యాయంకాదా ? Backward classes అని చెప్పి కమ్మర వారికి, అగ్నికులక్షత్రియులకు, యాదవులకు ఇవ్వడము న్యాయంకాదు. ఉద్యోగస్థులు, M. L. A. లు వారే ఉండడముచేత హరిజనులమాట మరచిపోయినారు. Preference లేకపోతే అన్యాయం జరుగుతుందని భయపడుచున్నాను. అదే మా పున్నయ్యగారు కూడా చెప్పారు. కాశీశ్వరరావుగారు ప్రకాశంగారి time లో educated unemployed కు colonization పెట్టవలెనని అన్నప్పుడు మేమంతా ఎదిరించాము. చదువుకున్నవారు వ్యవసాయము చేస్తారా! మనమందరము రైతు కుటుంబానికి చెందినవారమే. మనము వ్యవసాయము చేయ్యగలమా? ఎంతమంది నాగళ్లుపట్టగలరు? పశువులకాయగలరా? అనిఅన్నాము. నాకు, నాభార్యకు పాలుతియ్యడం చేతకాదు. చెప్పడానికి సిగ్గుపడుతున్నాను. కాబట్టి పండించి దున్నేవాడికి preference ఇవ్వడము న్యాయము. ఈ బంజరు సమస్య చాలా ముఖ్యమైనది. కమ్యూనిస్టులు తీసుకువచ్చిన తీర్మానము వల్ల చిక్కులు ఏర్పడడముతప్ప పరిష్కారముకాదు అని నేను చెబుతున్నాను. హరిజనులైన కూర్మయ్యగారు, శ్రీనివాసరావుగారు, తదితరులము support చెయ్యము. చెయ్యడానికి వీలులేదు. ప్రభుత్వం మాచేతులలో పెట్టుకొని ఈ పని సాధింపగలము, ఈ ప్రభుత్వముచేత సాధింప చేస్తాము, G. O లు ఉన్నవి. కాని అమలులోనికి రాలేదు. దీనికి కారణము unsympathetic officers ఉండడముచేతను, కాబినెటు మంత్రులకు గ్రామాలలో కష్టాలు తెలియకపోవడంచేతను. ఈ చిక్కులు తెలియకపోవడంచేత delay అవుతున్నది. అంతేగాని ప్రభుత్వం తప్పు ఏమీలేదు. శివాయిజమీలు విషయమై G. O. లు ఉన్నవి. గాని ఏమీ జరగలేదు.

రాష్ట్రములో Political Sufferers కు భూములిస్తున్నారని opposition party వారుచెప్పారు. రాష్ట్రములో పొలిటికల్ సఫరర్లను ఎవరువెళ్లగొట్టారు అనేవిషయము తెలుసు. అక్కడక్కడ వుంటే వుండవచ్చు. ఆ G. O. ల్లో కొన్ని చిక్కులుండటంవలన జరిగిందేకాని Political Sufferers ను సాధ్యమైనంతవరకు ఎక్కడాకూడా వెళ్లగొట్టి వీళ్లకు యివ్వడం అనేదిలేదు. అయితే ఆమధ్య కళా వెంకట్రావుగారు Revenue మంత్రిగా వున్నప్పుడు ఒకసారి శివాయిజమాదారు తొలగించబడినట్లయితే ఒక సంవత్సరం వారు చేసుకోకపోయినట్లయితే. దానిని Temporary గా Political sufferers కు యిచ్చి వున్నట్లయితే, దాన్నితొలగించవద్దన్నారు. దానికింద వస్తే కొన్ని కేసులురావచ్చు. కాని కాంగ్రెసుకు వున్నటువంటి అభిమానము హరిజనులమీద వర్ణనాతీతము. కమ్యూనిస్టుపార్టీ ఈ తీర్మానం పెట్టినందువల్ల ఈ పనులేమీ జరుగవు, గాంధీగారు నిజంగా కాంగ్రెసు

సాయకుడు. ఆయనకాలములోనే హరిజనులకు Reservations, విద్యాసౌకర్యాలు, అస్పృశ్యతానివారణ, యివన్నీకూడా జరిగినప్పుడు ఈ సమస్య కూడా పరిష్కారము చేయలేకపోతామా అంటే చేస్తాము. ఇతే ఒక మాటమాత్రము చెప్పుతున్నాను, మా ఆర్థికమంత్రిగారిది మా Revenue మంత్రిగారిది తోలువుందే, (Skin) అది చాలమందంగా వుంది. అది మాత్రము నేను చెప్పగలను. మందంగా వున్నప్పుడు సూదిపెట్టి పొడుస్తున్నప్పుడు అదిదిగకపోవడంచేత దాంట్లో sensation వుండదు. ఇంకా కొద్దిగా చెబుతాను. ఒకసారికాకపోతే రెండుసార్లు, మూడుసార్లు, నాలుగుసార్లు, వారి చెవిదగ్గరికివెళ్ళి శంఖముపెట్టి వారి చెవిలోచెప్పి ఈ పనిని సాధిస్తామనిచెప్పి మాకు ధైర్యమున్నది. ఎందుచేతనంటే వారికనేక పనులుండుటవల్ల, వారికి ఆకలిఅనేది తెలియకపోవడంవల్ల, వారు శ్రీమంతులుగా, (Born with Silver Spoon) వుండటంనల్ల వారికి ఈ బీదలయొక్క కష్టాలు తెలియడంలేదు. ఇనన్నీకూడా మేము సాధిస్తాము. ఈ గోపాలరెడ్డిగారి నాయకత్వముక్రిందే సాధిస్తామనే నమ్మకముంది. ఒకవేళ మనకు విశాలాంధ్రవస్తుంది. అప్పుడే అక్కడ హైద్రాబాదులో భూసంస్కరణలు చేశారు. ఈ యొక్క బంజరుభూముల సమస్య జరిగిన జరగకపోయిన, భూసంస్కరణల సమస్య రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద తీసుకొని వస్తున్నప్పుడు యివన్నీ కూడా పరిష్కార మవుతాయి. అయితే యిక బంజరు భూముల్లో గ్రామములో వుండేటటువంటి వారియొక్క గొడ్లు మేయకుండా, అది మేయకుండా, ఇది మేయకుండా, వీళ్ళకిచ్చేస్తారనడం వట్టి slogan. హరిజనులుకూడా అటువంటి స్థలాన్ని కోరడంలేదు. కాబట్టి మీరంతాకూడా ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకోండి. ప్రభుత్వంతోటి మంత్రివర్గంతోటి మేము అందరు హరిజనులు చేరి మాట్లాడి ఒక కమిటీకూడా వేశారు గనుక దానిద్వారా మేము దీన్ని పరిష్కరించగలమని మేము మీకు హామీకూడా యిస్తాము. దీన్ని మీరు withdraw చేయాలని కోరుతున్నాను.

*Sri N. K. LINGAM:—అధ్యక్షా ! ఇప్పుడు ముఖ్యమైన సమస్య బంజరు భూముల పంపిణి. పంపిణీలో రాజకీయ బాధితులకు ఈ భూములు ఇవ్వవద్దని మా హరిజన శాసనసభ్యులుగాని యితరసభ్యులుగాని చెప్పరు. రాజకీయబాధితులకు భూములు యివ్వవలసినదే. కాని ఇందులో ప్రథమస్థానము హరిజనులకు యివ్వాలని మేముకోరుతున్నాము. పైగా మాఐక్యకాంగ్రెసు హరిజనసభ్యులు తీర్మానరూపంగాకూడా యీసూచన ప్రభుత్వానికి పంపడం జరిగింది. ప్రభుత్వానికి నేనొక మనవి చేస్తున్నాను. బ్రిటిష్ ప్రభుత్వము వారున్నప్పుడు అనేక లక్షల ఎకరాలు హరిజనులకుగాని బీదప్రజలకుగాని పంపిణీ చేశారు. కాని ఈ రోజున వారి చేతులలో ఈ భూములులేవు. ఎందుకంటే వాటినిచ్చేటప్పుడు ఒక నిబంధన పెట్టలేదు. ఇప్పుడు Transfer of Patta ను అమ్ముకోకుండా యివ్వాలని చెప్పి నేను ఈ ఆంధ్రప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈ భూములను నూటికి 70 మంది హరిజనులు సాగు చేస్తూ పల్లెల్లో నివసిస్తున్నారు. వాళ్ళందరుకూడా వ్యవసాయ కూలీలు. సంవత్సరమునకు ఆరుమాసములు ఈ పొలములో కష్టపడి కూలీని సంపాదిస్తున్నారు. కాబట్టి హరిజనులకు ప్రథమస్థానము యివ్వాలని ఆంధ్రప్రభుత్వమును కోరుతున్నాను. ముఖ్యంగా నందికొట్కూరు తాలూకాలో ఎక్కువ సారవంతమైన

భూములు, మశలు, అక్కడనుంచి బంజర్లు ఎక్కువగా వున్నాయి. ఊతమట్టలు తాటిమట్టలు యిటు దండిగా ఉన్నాయి. వాటిని ఈ అధిక ఆహారఉత్పత్తిక్రింద చాలామంది బీదలు సాగుచేశారు. అలా సాగుచేసినవారిపై అధికారులు 50 రూపాయలు 60 రూపాయలు పెనాల్టీవేస్తున్నారు. పోయిన సంవత్సరం దాదాపు పది-ఇరవై వేల రూపాయలవరకు పెనాల్టీలు వేశారు. ప్రభుత్వము పెనాల్టీలు ఆపమని ఉత్తరువులు జారీచేసినప్పటికిని, క్రిందవున్నటువంటి అధికారులు వాటిని అమలు జరుపక చాలా యిబ్బందులు కలుగచేస్తున్నారు. పోయినసారికూడా నేను ప్రభుత్వ ఉద్యోగులను కలుసుకున్నాను. చాలామట్టుకు పెనాల్టీలు తగ్గించారు. అయితే ఈ సంవత్సరంకూడా అటువంటి పెనాల్టీలను వెంటనే రద్దుచేయాలని చెప్పి ప్రభుత్వము ఉత్తరువులు జారీచేయాలని నేను కోరుతున్నాను. కమ్యూనిష్టు సోదరులు తెచ్చినటువంటి తీర్మానము ముఖ్యముగా శోచనీయముగా ఉన్నది. ఏమంటే వారు హరిజనులకు Reservation వద్దని హరిజనులకు ముందుగా ఒక ప్రత్యేకత వుండాలని వాళ్ళు చూపడంలేదు. ముఖ్యముగా ఈ పార్టీయొక్క సభ్యులను నేను కోరేదేమిటంటే హరిజనులకు యింత ప్రత్యేకత లేకుండా వారు ఎన్ని జనరల్ స్థానాలలో సభ్యులుగా నిలబడ్డారో ఆలోచించమని ఆ పార్టీ హరిజనశాసనసభ్యులకు సూచన చేస్తున్నాను.

**Mr. SPEAKER** :— బంజరుభూముల విషయం మాట్లాడండి.

**Sri N. K. LINGAM** :— అందువల్ల బంజరుభూముల పంపకంలో హరిజనులకు ప్రథమస్థానం చూపించకపోవడానికి నా విచారాన్ని తెలియజేస్తున్నాను. రాజకీయ బాధితులకు భూములివ్వాల్సిందే. దేశముకొరకు వారు మహాత్యాగాలు చేశారు. వారు ముఖ్యంగా ధనవంతులు- మన ముఖ్యామాత్యులైన గోపాలరెడ్డి గారిలాంటివారు ఆ భూములను పెట్టుకొనలేదు. ఎవరో బీదవాండ్లున్నారు. నాబోటి దరిద్రులు జైలుకు పోయారు. అటువంటి వారికిస్తే తప్పులేదు. కనుక రాజకీయబాధితులకు ముందుగా యివ్వాల్సిందే. ఐతే హరిజనులకుకూడా ముఖ్యంగా preference యివ్వాలని నేను ఆంధ్రప్రభుత్వాన్ని ప్రార్థిస్తూ ఈ తీర్మానాన్ని అందరుకూడా వ్యతిరేకించాలని, కమ్యూనిస్టుసోదరులు దయచేసి ఈ తీర్మానాన్ని withdraw చేసుకుంటే చక్కగా ఉంటుందని నేను కోరుతూ, యింతటితో విరమించుకొంటున్నాను.

* **Sri SHEIK MOULA SAHEB** :— అధ్యక్షా, ఈబంజర్ల పంపకం విషయంలో ఏ బీదవాడికికూడ యివ్వవద్దు అని చెప్పే సభ్యుడు వుండరని నానమ్మకం. అయితే ఈబంజర్లు ఏవి, అవి, వున్నయాలేదా అనేది ముందు తేల్చుకోవాలి. అవి ఏస్థితిలో వున్నాయంటే Estate గ్రామాదులు కొన్ని, Government గ్రామాదులుకొన్ని ఉన్నవి. Government గ్రామాదుల్లో బ్రిటిషు వారి హయాములోవున్న భూములన్నీకూడా పట్టాలకిచ్చేశారు. మొత్తంమీద, శివాయిజమాక్రింద కూడా అక్కడ సాగుచేయడానికి ఏకొద్దో వుంచారు. అవి శివాయిజమాక్రింద సాగు అవుతూ ఉన్నాయి. చెఱువుతోటలు మాత్రమువుంటూ వచ్చాయి. డొంక పోరంబోకులు వుంటూ వచ్చాయి. డొంక పోరంబోకులు ముఖ్యంగా గ్రామాదుల్లో రావడానికి పోవడానికిగాని పశువులు పోవడానికిగాని

డొంక పోరంబోకులు వుంటూవచ్చాయి. చెఱువుల్లోకివచ్చే నీళ్ళు జలాధారాలు రావడానికి వాగుపోరంబోకులు వుంటూవచ్చాయి. పోతే శ్మశానాలువుంటూ వచ్చాయి. ఎవరన్నావస్తే వూరిబయటికి తీసికెళ్ళి వాళ్ళని పూడ్చిపెట్టడానికి యివి వుంటూవచ్చాయి. ఇక మిగిలిందేమంటే ఇది ఆగ్రామ పశువులు మేయడానికి పశువుల కంచక్రింద grazing పోరంబోకుక్రింద ఏకొద్దో ఉంటుంది. మిగతాది ఏదో శివాయిజమాక్రింద ప్రతిరైతు ఆక్రమణద్వారా సాగుచేస్కోవాలన్నవాడు చేసుకోవగింది చేసుకుంటూనేవున్నాడు. ఎప్పుడుచేసుకొన్నప్పటికిని వాళ్ళనిబాధించే వాళ్ళెవరూలేరు. అదితప్ప మిగతాది ఏమున్నదంటే forests మాత్రము వుంటూ వచ్చాయి. అక్కడఅడవులుగానేచెట్లు పెరుగుతూవచ్చాయి. గవర్నమెంటు గ్రామాదుల్లో బంజర్లువవి లేవని మాత్రము అతి రూఢిగాతేల్తున్నది. ఒకవేళ ఆ శివాయిజమాక్రింద సాగుచేసేభూము లేవైన ధనవంతవర్గము భూములున్నవాళ్లు సాగుచేసినట్లయితే ప్రభుత్వము యిపుడు అటువంటి వాళ్లను తొలగిస్తువున్నారు. బీదవాళ్లకు సాగుకు యిస్తూనేవున్నారు. Estate గ్రామాదులున్నాయి. ఆ Estate గ్రామాదుల్లో నిజంగా చాలాబంజర్లు వున్నాయి. ఏస్థితిలోవున్నాయంటే Estate గ్రామములలో వుండేటటువంటి రైతులు పట్టామాత్రము పెట్టుకోరు. ఎందువల్ల అంటే ఆ భూములు నిస్సారమైనటువంటివని వరుసగా ప్రతిసంవత్సరం తప్పనిసరిగా పైరు వేస్తూవుంటే అవి సత్తువలులేక పండవనిన్నీ మూడుసంవత్సరముల కొకసారి ఆ శివాయిజమా మెట్టభూములను సాగుచేస్తూ వచ్చారు. ఆమూడుసంవత్సరములు గడిచిన తరువాత వారు ఆభూమివదలి ఇంకేదో భూమిలో ప్రవేశించి పది పంద్రెండేళ్లు శివాయిజమాక్రింద సాగుచేస్తూ తిరిగి మాభూముల్లోకి వచ్చేఆచారం అనాదిగా వుంటూవచ్చింది. ఈ Estate గ్రామాదులలో పట్టాపెట్టుకుంటే ప్రతి సంవత్సరం దానికి పన్నుయివ్వాలనే భయంతో ఆరకంగా చేస్తూవచ్చారు. ఐతే నిజంగా ఆభూములు వాళ్ల పట్టా భూములుగా వాళ్లుభావిస్తూనే చేస్తూవచ్చారు. ఇప్పుడు Estate లన్నీ ప్రభుత్వంలో కలిసిపోయినాయి. గవర్నమెంటులో కలిసిపోయిన తరువాత ఏంచేస్తున్నారు? గవర్నమెంటు వారు రిజర్వులు ఏర్పాటు చేయడంలో Estate గ్రామాదుల అడవుల్లో నిజంగా వుండే కష్టాలేమిటంటే రైతుక్రింద ప్రస్తుతం సాగులోవుండే భూమి మాత్రం యిది పట్టాభూమిగా భావిస్తాము, సాగుభూమిగాక మిగతావన్నీకూడా బంజర్లుగా భావించి మేము రిజర్వుగాచేస్తాము అనడమే. అనగా చెట్లుగాని మరేమి లేనిది సాగుభూమి. కాబట్టి యిప్పుడు మీచేతిలోవుండేసాగే సాగుగాని యిదంతా కూడా బంజర్లు. అందువల్ల బంజర్లని ముఖ్యంగా తేల్చుకున్న తరువాత ఇది యివ్వమని ప్రతివాళ్లముచెప్పవలసిందే. అందరంయదార్థహృదయులమే. ఇక్కడికొచ్చిన ఏ శాసనసభ్యుడు కూడా యివ్వవద్దని చెప్పేవాడులేడు. కాబట్టి బంజర్లని ప్రభుత్వం తేల్చుకొన్న తరువాత పంపకంరావాలికాని ఇప్పుడు ఆశలు లేనిపోనివి కల్పించి వాళ్లను పనులు చేసుకోనీయకుండా సోమర్లు చేయవద్దు. ఇది కేవలంప్రచారానికే.

**Mr. SPEAKER:** Discussion will continue on the next non-official day. Now, we shall take up the half-hour debate regarding collection of tax on bullock carts passing through Municipalities.

## V. HALF-HOUR DEBATE Re: COLLECTION OF TAX ON BULLOCK CARTS BY MUNICIPALITIES.

**Sri P. SUNDARAYYA:—** అధ్యక్షా, మునిసిపాలిటీలలోను మేజర్ పంచాయితీలలోను—ముఖ్యంగా మునిసిపాలటీలలో — గ్రామాలనుంచి వచ్చే బండ్లమీద పన్నులు వసూలుచేసే విధానం గురించి ప్రశ్నవచ్చింది. ఆసందర్భంలో మంత్రిగారు అనేక రకాలుగా సమాధానాలు చెప్పారు. అందుచేత ఈసమస్యను మరొకపర్యాయం మంత్రివర్గం దృష్టికి తీసుకురావాలని ఈఅర్ధగంట చర్చకు అనుమతి కోరాను. మీరుదయతో అంగీకరించారు. ఈసమస్య క్రొత్తగావచ్చిన సమస్య ఏమీకాదు. నాఅనుభవంలో గత 20 ఏండ్లుగా ఈ **Toll Gates** మునిసిపాలిటీలనుంచి తీసివేసినప్పటినుంచి మునిసిపాలిటీలలో అక్రమం అన్యాయం జరుగుతూనే ఉన్నది. బ్రిటిషుప్రభుత్వ హయాములో ఏమిజరిగినా జరిగిఉండవచ్చు; కాని కాంగ్రెసు ప్రభుత్వం హయాములో అయినా ఆపుచేస్తారా అంటే ఆపుచేయకపోవడమే కాకుండా మంత్రిగారు చెప్పిన సమాధానాలు ఏరీతిగాను సంతృప్తికరంగా లేవని చెప్పవలసియున్నది. బండ్లదొడ్డిలోనికి తీసుకువెళ్ళితే అక్కడ మాత్రమే వసూలు చేయవలసి ఉంటుందని ఒకప్రక్క చెబుతూనే మరొకప్రక్క ఏమిచెబుతున్నారంటే బండ్లదొడ్డికి పోకుండా దారినిపోతుంటే వ్యాపారం కోసం పోతున్నారని అనుమానించి వేయడానికి వీలున్నది అని చెప్పారు. గ్రామాలనుంచి బండ్లువస్తుంటే ఏ కాఫీహోటలు దగ్గరనో కాఫీకో ఫలహారానికో ఆపుకుంటే పన్ను వసూలు చేస్తున్నారు. నేను అనేకపర్యాయములు చూశాను. అనేకమంది శాసనసభ్యులు చూశారు. మన ఉపాధ్యక్షులు కూడా తమ అనుభవాన్ని చెప్పారు. మంత్రిగారు కూడా రాజమండ్రి మునిసిపాలిటీలో తమకు అనేక అనుభవాలున్నాయని చెప్పారు.

**The Hon. Sri A. B. NAGESWARA RAO:—** కాఫీకి ఫలహారానికి రోడ్లప్రక్కన బండ్లను ఆపరు.

**Sri P. SUNDARAYYA:—** తాము మునిసిపల్ **Chairman** గా కంట్రాక్టరుకు అనుమతి నిచ్చారు. కాబట్టి చూడదలుచుకోలేదేమో నాకు తెలియదు. ప్రక్కన ఆపుకుని మునిసిపల్ గేటులోనికివచ్చేసరికి చీటీతోవస్తారు యమకింకరుల మాదిరిగా. ఉన్న వాస్తవాన్ని లేదుఅంటే ప్రయోజనంలేదు. మంత్రిగారు మరొకసమాధానం ఇచ్చారు. చుట్టుప్రక్కల గ్రామాలనుంచిబండ్లు తరుచువస్తుంటే 60 రోజులయితే పూర్తిపన్ను వేయాలని 15 నుంచి 60 రోజులవరకు అయితే సగం పన్ను వేయాలని చెప్పారు. మొత్తం సంవత్సరంలో ఎంతకాలం వచ్చారో ఎవరు లెక్కపెట్టుకుంటారు? గ్రామాలనుంచి బండ్లు స్వేచ్ఛగా వచ్చిపోవడానికి వీలుగా టోల్ గేట్సు రద్దుచేశారు. కాని ఇపుడు ఈరకంగా వసూలు చేయడం అన్యాయం అని ఆందోళనచేసినా పెడచెవిన పెట్టడమేకాకుండా శాసనసభలో ఇది న్యాయమే అని సమాధానం చెప్పడం ఏరకంగానూ న్యాయంకాదు. మరొక ఆశ్చర్యకరమైన కారణంచెప్పారు—ఏకంట్రాక్టరూ ఆరకంగా వసూలుచేసుకోడానికి అనుమతి ఇవ్వకపోతే కంట్రాక్టే తీసుకోడని—మ్యునిసిపాలిటీకి డబ్బు తగ్గిపోతుందని—అందుచేత అనుమతి ఇవ్వాలని! మునిసిపాలిటీకి డబ్బే కావాలంటే ఈబూటకచట్టం తీసివేయండి. **Town** లోనికి వచ్చే ప్రతిబండి మీద పన్ను వేస్తాము అని చట్టంతీసుకునివచ్చి అధికారం ఇవ్వండి. అపుడు మీవిధానం ఎంతచక్కగా ఉన్నదో ప్రజలు అర్థంచేసుకుంటారు. ఒకప్రక్క అధికారంలేదు; వేయడంలేదు అని చెబుతున్నారు, మరొకప్రక్క డొంకతిరుగుడు పద్ధతులతో 15 పర్యాయా

లైతే సగం, 60 పర్యాయాలైతే పూర్తిగా వేస్తాము అని చెబుతున్నారు. ఈపద్ధతులు సవ్యమైనవి కావు. మంత్రిగారు ఎంతలేదన్నా ఇవి జరుగుతున్నవి. కాని మంత్రిగారు చూడదలచుకోలేదు కాబట్టి వారు చూచే చెప్పవలసియున్నది. దానిని ఆపుదలచేయడానికి వెంటనే చర్యతీసుకోవాలని కోరుచున్నాను.

**Mr. SPEAKER:**— గౌరవసభ్యులకు ఉపన్యాసాలు చెప్పకుండా తమ అనుభవాలను చెబితే బాగుంటుంది.

***Sri K. SUBBARAO:**— అధ్యక్షా, ఆంధ్రదేశంలో మారుమూల వ్యాపార కేంద్రంగా ఉన్న హిందూపురంనుంచి నేను వస్తున్నాను. ప్రతి మంగళవారం, శుక్రవారం పదివేల బండ్లకు తక్కువకాకుండా ఆ ఊరికి వస్తూ ఉంటాయి. ఆ పదివేలబండ్లవాళ్ళ బాధలు ఇంతింత అని చెప్పడానికి వీలులేదు. అక్కడ యమదూతలలాగ మునిసిపల్ కంట్రాక్టర్ల జవానులు ఉంటారు. వాళ్ళకు ఏమీ తెలియదు. కంట్రాక్టులో ఏమిఉన్నదో, వాటి కట్టుడులు ఏమో, నిబంధనలు ఏమో తెలియదు. వచ్చేపోయే బండ్లు బెల్లంఉండినా ఏమిఉండినా, కట్టకడపట గంటల సేపు నిలబడి బాధపడేది మాకండ్లార చూస్తున్నాము. వచ్చేపోయే బండ్లకు పన్నులేదని చెప్పారు. నేను రైల్వేస్టేషనుకు మా గ్రామమునుంచి వస్తే అది మునిసిపల్ **area** లో ఉన్నది కనుక ఇచ్చితీరాలి అని వసూలుచేస్తున్నారు. నేను ఏమిటి అని అడిగితే, 'మీరు పోండి స్వామీ' అంటారు. నేను అట్లాపోవడానికి వీలులేదు. నన్ను ఒకణ్ణి మాత్రం వదలిపెట్టి మిగిలినవారివగ్గర వసూలుచేస్తుంటే చూచి, నేనుకూడా ఇచ్చే వెడుతున్నాను. అక్కడఉండే పద్ధతినిబట్టి. మునిసిపాలిటీలకు డబ్బుకావాలనే కోరిక స్థానికసంస్థల మంత్రిగారికి ఉంటే ఏ బండి వచ్చినా ఒక అణా రుసుము వసూలు చేయవచ్చునని చెప్పండి. ఎడ్లకు నీళ్ళకోసమైనా ఏ మునిసిపాలిటీ అయినా చక్కని సౌకర్యం చేశారని ఎదమీద చేయి వేసుకుని చెప్పే **Municipal Chairman** ఉన్నాడేమో చెప్పండి. ఎక్కడా లేడు. పేరుకుమాత్రం మునిసిపాలిటీలున్న పట్టణాల్లో ఒక బావి త్రవ్వించి వచ్చే బండ్లకు చోటులేకుండా ఉన్నది. అక్కడ ఉండేబండ్లకు కావలిసిఉంటే పొమ్మని వ్యవహారంచేసే పద్ధతి ఉన్నది కనుక చట్టం మంచిదైనా అనుభవంలో ఆచరణలో ఉండేపద్ధతి చాలా అక్రమంగా అన్యాయంగా ప్రజలనుంచి దోపిడీచేసే విధానంగా ఉన్నది. కనుక దానిని పునర్విమర్శచేసి అవసరమయితే చక్కనిచట్టంచేసి బండికి ఒక అణాచొప్పున వసూలు చేయవచ్చును. అంతేకాని ఇష్టానుసారం కంట్రాక్టరుకు వదిలితే గవర్నమెంటుకు అపహాదే కాకుండా అపఖ్యాతి కలుగుతుందని నేను చెబుతున్నాను.

***Sri B. SANKARAIAH:**— ఈ ప్రశ్న నెల్లూరులో చాలా రోజులుగా ఎదుర్కొంటున్నది. ఇది స్థానికసంస్థల మంత్రిగారికి తెలియజేశాము. నేను నెల్లూరులోనే ఉంటున్నాను. గ్రామాలనుంచి గడ్డి తీసుకునివచ్చి నెల్లూరిలో వేసినా, పోయేటపుడు 0-2-0 ఇవ్వవలసిందే. చాలామంది రైతులదగ్గర నుంచి ఆదారిన పోయినా వసూలు చేయడం నిత్యం చూస్తున్నాము. నిలబడ్డానికి ఏమైనా వసతి చేస్తున్నారా అంటే లేదు. మొన్ననే అక్కడ ఉండేవారు ఆందోళన చేసి మంత్రిగారికి తెలిపారు. నెల్లూరుకు ఉత్తరంగా **cart stand** కు కేటాయించిన భూమిలో కంట్రాక్టరు పైరు వేసుకున్నాడు. ఈ విధంగా కంట్రాక్టరు బండ్లు నిలుపుకోడానికి కావలసిన వసతిస్థలాన్ని తాను పైరు వేసుకుని ఆదాయం సంపా

దించడం పైగా వచ్చేపోయే బండ్లదగ్గర వసూలుచేయడం నిత్యం చూస్తున్నాము. ఆ రసీదులు తీసుకొనివచ్చి మంత్రిగారికి నెల్లూరులో తెలియచేశాము.

**The Hon. Sri A. B. NAGESWARA RAO :—** నేను మంత్రిగా నెల్లూరు రాలేదు.

**Sri B. SANKARAIAH :—** మీరుకాదు. ఇక్కినవారు వచ్చినపుడు, సంజీవయ్యగారు వచ్చినపుడు చెప్పాము. అనేకసార్లు ప్రభుత్వదృష్టికి తీసుకు వచ్చినా, మునిసిపాలిటీలకు సంబంధం అని ఒకసారి, డిస్ట్రిక్టుబోర్డుకు సంబంధం అని మరొకసారి చెప్పడం జరిగింది. నాగేశ్వరరావుగారు సెక్రటేరియట్‌లో విచారిస్తే తెలుస్తుంది. డిస్ట్రిక్టుబోర్డును అడగాలని జవాబు ఇచ్చారు. నిలవడానికి స్థలం లేదు అంటే ప్రభుత్వం విచారించడానికి పూనుకుంటే ఇవన్నీ ఆగిపోతాయి. **Cart stand** గా ఇచ్చినది **cultivation** చేశారు. ఇటువంటి అక్రమం జరుగుతోంది. కాబట్టి దానిని విచారించాలని కోరుతున్నాను.

*** Sri C. SUBBARAYUDU :—** అధ్యక్షా, మునిసిపాలిటీలలో బండ్లమీద వసూలుచేసే పన్నులు రెండు విధములు ఉన్నాయి. (1) **Cart stand fees** (2) పల్లెలనుంచి 6 నెలలకు 15 రోజులు పట్టణములకువస్తే రూ 4-1-0 పన్ను వసూలుచేయడం. ఈ **cart stand fees** అనేటటువంటిది ఆ **stand** లో బండ్లను నిలిపితేనే వసూలుచేయాలని ఉన్నది. ఇప్పుడు అట్లా చేయక అక్కడ నిలబడినా, నిలబడకపోయినాకూడా పన్ను వసూలు చేస్తున్నారు. ఇది అన్ని మునిసిపాలిటీల లోను బట్టబయలుగా జరుగుతున్న రహస్యమే. అందులో దాచుకునే విషయము ఏమీలేదు. **Cart stand** లలో నిలిపేవాటికే వసూలుచేయాలనే నిర్ణయం అమలు జరిపితే ఏమాత్రం పన్ను వసూలుకాదని అన్ని మునిసిపాలిటీలు భయపడుతున్నాయి. ఆ పన్నులను లోపాయికారిగా కంట్రాక్టర్లు వసూలుచేస్తున్నారు. చాలా మునిసిపాలిటీలలో అసలు **cart stands** అనేవే ఉండడములేదు.

6 మాసములకు రు॥ 4-1-0 పన్ను పల్లెలనుంచి బస్తీలగుండా 15 రోజులకు పైన బండ్లుపోతే వాటివద్దనుంచి నిర్బంధంగా వసూలుచేస్తున్నారు. ఆవిధంగా చాలా మునిసిపాలిటీలు వసూలుచేస్తున్నాయి. దానిని గురించి ప్రభుత్వంకు **com-plaints** కూడా చేశాము. అసెంబ్లీలో ఎన్నో పర్యాయములు చెప్పడం కూడా జరిగింది. అసలు ఒక బండి 6 నెలల్లో 15 రోజులకు పైన ఆ పట్టణానికి వచ్చినదని తెలుసుకొనడము అనేది మునిసిపాలిటీ ఉద్యోగస్తునికి గాని, కంట్రాక్టరుకుగాని సాధ్యము అయ్యే విషయము కాదు. ఇటువంటి నిర్బంధములు లేకుండా ఇందాక సుబ్బారావుగారు చెప్పినట్లు బండికి రు 0-1-0 లేక రు 0-0-6 పట్టణమునకు వచ్చినప్పుడల్లా వసూలుచేస్తే బాగుంటుంది. అప్పుడు ఇటువంటి చిక్కులు అన్నీ కూడా నెరవేరుతాయి.

ఆవిధంగా పన్నులను కట్టని బండ్లవారివద్ద నుంచి వారిబట్టలు లాగుకోవడం, వారిమీద దౌర్జన్యం చేయడంకూడా జరుగుతున్నది. మేము వాటినిగురించి చాలా పర్యాయములు తగువులాడటం కూడా జరిగింది. ఆక్షేపణలుకూడా చేశాము. మునిసిపాలిటీదృష్టికి తీసుకువచ్చినాము. స్థానిక స్వపరిపాలనామంత్రిగారి దృష్టికి తీసుకువచ్చినాము. వారు ఆవిధంగా ఖచ్చితంగా వసూలుచేయవద్దు, 15 రోజులు వస్తే 2 రూపాయలు వసూలుచేయమని ఉత్తర్వులు జారీచేశారు. అదికూడా సైతు

లకు ఇబ్బందిగానే ఉంటుంది. దానివల్ల రైతులకు ఎటువంటి సదుపాయము కలుగదు. అందువల్ల దాని విషయంలో మంత్రిగారు సరియైన వివరణచేస్తే బాగుంటుందని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Mr. SPEAKER :— ఉపన్యాసములు చెయ్యకుండా, ఇప్పుడు అనుభవములో ఉన్న బాధలను వాటికి నివారణోపాయములను మాత్రమే చెప్పితే చాలా మందికి మాట్లాడుటకు అవకాశం దొరుకుతుంది కాబట్టి ఆవిధంగాచేస్తే బాగుంటుంది.

Sri P. RAJAGOPAL NAIDU :— అధ్యక్షా, దీనికి సంబంధించినవి రెండు fundamental differences ఉన్నాయి. ఈ మునిసిపాలిటీలు బండ్లమీద పన్నులు వసూలుచేయడము విషయములో నేనుచిత్తూరు, విశాఖపట్టణములలో చాలామార్లు నాఅనుభవములో చూచి ఉన్నాను. పల్లెలనుంచి బండ్లువస్తే అవి వ్యాపార నిమిత్తం బాడుగలుకు వస్తున్నాయో, లేదా స్వంతంగా బెల్లంగాని, ఇతరవస్తువులుగాని, వేసుకువస్తున్నారో లేక సినిమాలకు బండ్లు కట్టుకొని పోతున్నారో, ఇంకో పనికి వస్తున్నారో తెల్పడము కష్టంగా ఉన్నది. అదేవిధముగా గానుగలమీదకూడా పన్ను వేస్తున్నారు. స్వంతచెఱుకును బెల్లంగా మార్చి వ్యాపారనిమిత్తమునకు పట్టణములకుతీసుకువస్తే, అసలు 10 వేల రూపాయలకుపైగా సరుకుతీసుకువస్తే, సేల్సు టాక్సు వేస్తున్నారు. దానితోపాటు మునిసిపాలిటీలుకూడా బండిమీద పన్ను వేస్తున్నాయి. అందువల్ల దానిని నిర్వచించడం చాలా అవసరముగా ఉన్నది. స్వంతదారుకు అమ్ముకునే హక్కు ఉన్నదా, లేదా, అలాచేసినప్పుడు అతనిమీద పన్ను వేయవచ్చునా, లేదా, దానిని నిర్వచిస్తే దానివల్ల వచ్చే చిక్కులు అన్నీకూడా తప్పనిసరిగా తీరిపోతాయి అని నా ఉద్దేశ్యం. దీనిని మంత్రిగారు clarify చేస్తూ రైతులమీద ఇటువంటి పన్నులు పడకుండా చూడాలని కోరుతున్నాను.

* Sri S. VEMAYYA :—అధ్యక్షా, ఇటువంటి విషయములు నేను నెల్లూరు మునిసిపాలిటీలో స్వయముగా చూడడం జరిగింది. నెల్లూరు ఆస్పత్రిలో మాకు తెలిసిన ఒకఆడమనిషి ప్రసవించిఉంటే అక్కడకు కట్టెలబండితోలుకొనిపోతూంటే రాత్రిపూట దీనిని అక్కడ ఆపివేసినారు. 'పన్నుకట్టితేగానీ బండిని కదలనియ్యము" అన్నారు. పోనీమనిషిని వదులుతారా అంటే అదీలేదు. అతనిబట్టలుఊడపెరకడం జరిగింది. నాకుస్వయముగానే ఇట్లా అనేకపర్యాయములుజరిగింది. వారి దగ్గర statement తీసుకొని స్థానికపరిపాలనామంత్రిగారికి వ్రాస్తే, వారుమరల "specificగా వ్రాసి దర్యాప్తు చేస్తాము" అన్నారు. వారు దర్యాప్తు చేస్తున్నారనుకొంటాను. స్వంతబండ్లకేఇట్లా జరుగుతుంటే, బాడుగబండ్లకు ఇంకేవిధంగా జరుగుతున్నదో వేరేచెప్పనక్కరలేదు. బయటనుంచి వచ్చిన బండ్లకు ఇట్లా జరుగుతున్నది.

స్థానికంగా నెల్లూరు పట్టణంలో cart stand, రిక్షాస్టాండు అనిగాని ఎక్కడాలేదు. వారిబండ్లు నిలబెట్టడానికి నీడగాని, నీళ్లుగాని ఎక్కడాలేవు. వాళ్లు ఇష్టమువచ్చినచోట నిలబెట్టుకొంటారు. అటువంటిచోటుకే వారు cart stand అంటారుగాని నిర్ధారణగా cart stand అని ఎచ్చటాలేదు. ఇట్లు stands లేకుండా వాటిమీద పన్నులు విధించడం సబబుగాలేదు. అందువల్ల cart stands నిర్మించి, వాటికి తగిన వసతులు వెంటనే కలిగించాలని మనవిచేస్తున్నాను.

ఈ సందర్భములో అధ్యక్షులవారి అనుమతితో ఒక చిన్న విషయంకూడా చెప్పదలచుకున్నాను. పెదపుత్తేడు దగ్గర మరాటీ అనే పంచాయితీ గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో ఎవరికీ బండ్లు లేకపోయినా పంచాయితీవారు వారికి బండ్ల పన్ను వేసి వచ్చినట్లు కట్టమన్నారు. నిజానికి ఒకరిద్దరు కట్టకుండా ఏమైనా చేసుకొనమని నిలబడ్డారు. వారిమీద కేసులుపెట్టడం జరిగింది. నేను క్రితం అసెంబ్లీ జరిగిన తరువాత అక్కడకు వెడితే సిద్ధం నారయ్యా అనేవారిని అరెస్టుచేసి కేసు పెట్టారు. జైలులో ఉంచినారు. తరువాత మేము విడిపించడం జరిగింది.

Mr. SPEAKER :— అది పంచాయితీ Act కు సంబంధించింది.

Sri S. VEMAYYA :— అందువల్లనే మీ అనుమతిప్రకారం మాట్లాడు తున్నాను. ఇటువంటి అక్రమములు జరిగినాయని చెబుతున్నాను.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— అయ్యా, పంచా యితీ వ్యవహారములోకూడా దీనికి సంబంధం ఉన్నదండి.

Sri S. VEMAYYA :— దీనిని మంత్రిగారు specific గా వ్రాయమని చెప్పారు. ఆప్రకారమే వ్రాసి వారికి యిచ్చాము. దానిపై దర్యాప్తు చేయించి అక్రమంగాపెట్టిన కేసు లన్నింటినీ ఉపసంహరించి, బండ్లు లేకుండాగే కట్టినటువంటి పన్నులు refund చేయించి ప్రజలకు కలిగే చిక్కులను తొలగించవలసిని ప్రభు త్వాన్ని కోరుతున్నాను.

Sri RAJA V. V. KRISHNAM RAJU BAHADUR:— అధ్యక్షా, ఈ cart stands పన్నులు వసూలుచేయడం విషయంలో తూర్పుగోదావరి జిల్లా లోని తుని పంచాయితీలో జరిగే విషయములను గురించి చెబుతున్నాను. అది ఇదివరకు జిల్లాబోర్డు ఆధీనంలో ఉండగా వారు స్థలాలు, బండ్లమీద పన్నులు వసూలుచేయుటకు పాట పాడగా 45 వేల రూపాయలు రాబడి వచ్చింది. ఇప్పుడు అది పంచాయితీ అయినతరువాత మోటారుబండ్లమీద 14 నుంచి 16 వేల వరకు ఆదాయం వస్తున్నది.

Cart stands అనేవి ఎక్కడ అయినా నాలుగుగోడలమధ్య పెట్టి అక్కడ పన్నులు వసూలు చేయాలి. అది Act లో ఉన్నమాట వాస్తవమే. అట్లా చేయుటకు మన దేశములో ఎక్కడా అవకాశములు లేవు. అటువంటిది మన యొక్క జనాభాను చూచుకొని, సరఫరాను చూచుకొని చేయాలి. మా గ్రామా నికి ప్రతివారం వేలాదిబండ్లు సంతకు వస్తాయి. మునిసిపాలిటీ ఏరియాలోగాని, పంచాయితీ ఏరియాలోగాని ఆవిధంగా బండ్లువస్తే పన్ను వసూలుచేసేమాట వాస్తవమే. కాని సాధారణంగా బండ్లు వెళ్ళిపోయేటప్పుడు పన్ను పుచ్చుకోవ డము అనేది rules లో లేకపోయినప్పటికికూడా, కంట్రాక్టర్లు పెద్దమొత్తాలకు పాటుపడి బండ్లు పోతున్నాసరే, లేదా స్థానికంగా ఉన్న బండ్లమీద అయినా సరే అన్యాయంగా పన్నులు వేస్తున్నారు. దానిని అరికట్టుటకు నేను ఇదివరకు రెండు పర్యాయములుపంచాయితీప్రెసిడెంటుగాఉన్నప్పుడు ప్రయత్నంచేశాను.అలా సాధిం చాలంటే చాలా కష్టసాధ్యంగా కనిపిస్తున్నది. ఎందుచేతనంటే, ఊరిలో పలుకు బడి గలవారు ఎవరో పాట పాడి కంట్రాక్టు తీసుకుంటారు. ఆయనక్రింద సిబ్బంది ఉంటుంది. వారు ఆటంకాలుపెట్టి వసూలుచేస్తుంటారు. దానిని అరికట్టుటకు

ప్రభుత్వమువారు నిర్దిష్ఠంగా Act ద్వారా, తగిన సూచనలుచేస్తే బాగుంటుంది. అట్లా ఇవ్వవల్లెనునని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

* Sri S. BRAHMAYYA :—అధ్యక్షా। ఈ బండ్లమీద విధించే పన్ను సందర్భములో ఒక సలహామాత్రం యిస్తున్నాను. సర్వసాధారణంగా ప్రతి మునిసిపాలిటీలో కూడా యీ తగాయిదా ఉంటున్నది. Contractors ఒక విధంగా agreement లో వ్రాసుకున్నప్పటికీ బళ్లు కార్టుస్టాండుకి వచ్చినప్పుడు నిక్కచ్చిగా వసూలుచేయాలిగాని cart stand కి వెళ్లనప్పుడు వసూలు చేయకూడదంటే ప్రతి మునిసిపాలిటీకి కూడా నష్టంవస్తుంది. ఈ సంవత్సరం ఏలూరు మునిసిపాలిటీనిగురించి ఒక ఉదాహరణ చెపుతున్నాను. అన్ని బండ్లమీద అన్యాయంగా పన్ను వసూలు చేస్తున్నారు. ఈవిధంగా చేసినట్లయితే మేము సత్యాగ్రహం చేస్తామని కొంతమంది బాధ్యతగల వ్యక్తులు పురపాలకసంఘాధ్యక్షుని దగ్గరకు, కమిషనర్ దగ్గరకు వచ్చి చెప్పారు. దీనితో 40 వేలకు పైగా వస్తున్న ఆదాయం 30 వేలకు తగ్గిపోయింది. ఈ విధంగా చేసినట్లయితే మునిసిపాలిటీకి ఆదాయం తగ్గిపోతుంది. అయితే యింతమాత్రంచేత బళ్ళమీద అన్యాయంగా వసూలుచేస్తున్నటువంటిది ప్రోత్సహించమని నేను చెప్పను. Cart Stands ఏమూలో వుంటాయి. కాని అక్కడ నీళ్ళవసతి ఉండదనిచెప్పి కొంతమంది సభ్యులు అన్నారు. కొన్ని మునిసిపాలిటీలలో వుంటాయి. మా ఏలూరు మ్యునిసిపాలిటీలోవున్నాయి. అలాగే నీటితొట్టెలు యేర్పరచటం ప్రతి cart stand దగ్గరావుంది. అయినప్పటికీకూడా బళ్ళవాళ్ళే చెపుతారు. మేము యిప్పుడు అక్కడకురావడానికి సావకాశం లేదు. మేము యిలా పోతాము అని పన్ను యిచ్చేసి వెళ్ళిపోతారు. కొంతమంది మేము యివ్వనక్కరలేదు. బంధువుల యిళ్లకు వెడుతున్నామని తప్పించుకొని పోతారు. కొంతనుంది మేము పొరుగూరికిపోతున్నాము. కమిషన్ కొట్టుకుపోతున్నాము అని చెప్పుతారు. వీరందరిదగ్గర వసూలు చేయవలసి వుంటుంది. యిప్పుడు సుబ్బారాయ్డుగారు చెప్పారు. 6 మాసాలలో 15రోజులు పట్టణంలోకి వచ్చినట్లయితే license fees వసూలు చేయడానికి అధికారం ఆ contractors కు యిచ్చినప్పుడు వాళ్లు 15 రోజులు రాకపోయినా మొత్తం మీద పన్నుమాత్రం బలవంతాన వసూలుచేస్తున్నారు. అది అన్యాయంగా వున్నది. గౌరవనీయులైన మంత్రుల బళ్లు అక్కడకు వచ్చినప్పుడు ఒక అణా, అణాన్నర పన్ను వసూలు చేయవలసిందని ప్రతి మునిసిపాలిటీకి తాఖీదులు పంపవలసియున్నది. అలా యిదమిద్ధంగా వసూలుచేస్తే బాగుంటుంది. అంతేకాని license fees అంటూ 4 రూపాయల చిల్లర వసూలుచేయడం ధర్మం కాదని మీ ద్వారా మనవి చేస్తున్నాను. మంత్రిగారు ముఖ్యంగా యీ విషయాన్ని దృష్టిలో వుంచుకోవాలి. Contractors కూడా agreement లో వ్రాసుకొనేటప్పుడు వీటన్నింటికి లోబడి వచ్చే నష్టానికంతకూ లోబడి contract forms లో సంతకాలు చేయవలసి వుంటుంది. కాని దౌర్జన్యంగా వసూలు చేసుకో

డానికి అవకాశం యిస్తున్నారని చెప్పి యిష్టంవచ్చినట్లు పన్ను పెంచి వసూలు చేసుకోవడం ధర్మంగా లేదని మనవిచేస్తున్నాను.

* Sri V. VISWESWARA RAO :— అధ్యక్షా, విజయవాడ టౌను గురించి పరిశీలించినట్లయితే విజయవాడలోగల 4 బజార్లకు వచ్చేబళ్లు cart stand లోనికి వెళ్ళకుండానే పన్ను వసూలుచేయడం జరుగుతోంది. Cart stands లో మంచినీటి సదుపాయంగాని, నీటిసదుపాయంకాని ఉన్నదాఅంటే అటువంటిదేమీలేదు. కాని కంట్రాక్టర్లు ఉదయం 4½ గంటలకే వచ్చి రోడ్డుమీద నిలబడి ప్రతిబండినీ ఆపుచేసి పన్నులు వసూలుచేయడం జరుగుతోంది. విజయవాడలో మెట్టప్రాంతాలనుండి మాగాణిప్రాంతాలకు, మాగాణిప్రాంతాల నుండి మెట్టప్రాంతాలకు నిత్యం వందలకొలది బళ్లు వస్తూ పోతూ ఉంటాయి. వాళ్లందరిదగ్గర పన్ను నిర్బంధంగా వసూలు చేస్తున్నారు. గడ్డిబళ్లు అయితే 4½ అణాలనుంచి 5 అణాలవరకు వసూలుచేయడం, స్వంతానికి కావలసిన తాటాకు యితరసామానులు తేసుకొనిపోతున్న బండ్లు విజయవాడలో ఆపకుండా వెళ్లేటప్పుడుకూడా చాలా ఎక్కువ మొత్తాలు వసూలుచేయడం జరుగుతోంది. 5 అణాలకోసం కోర్టుకివెళ్లాలన్నా, యింకొకచోటికి వెళ్లాలన్నా చాలా యిబ్బందులకు గురికావడం జరుగుతోంది. 15 రోజుల పన్ను ఉంచాలనే సమస్య వచ్చినప్పుడు చాలా చిక్కులు వస్తాయి. బెజవాడ చుట్టుప్రక్కన అనేక గ్రామాలున్నాయి. 6 నెలలకో 15 రోజులకో కాకపోయినా నీవు యీ చుట్టుప్రక్కల ఉన్నావు. ఎప్పుడో అప్పుడు ఎందుకో రావలసి ఉంటుంది. అందుచేత నీవు తప్పకుండా పన్ను కట్టితీరాలని నిర్బంధించి వసూలుచేస్తున్నారు. వీటన్నింటికీకూడా పరిష్కారమార్గం చూడవలసియున్నది.

* Sri A. C. SUBBA REDDI :— అధ్యక్షా! ఇప్పుడు బళ్ల పన్నువిషయంలో నా మిత్రులు నెల్లూరు మునిసిపాలిటీని గురించి చెప్పారు. శ్రీ వేమయ్యగారు, శ్రీ శంకరయ్యగారు చెప్పడంలో అక్కడ Cattle stands లేవని, నీళ్లు లేవని, నీడ లేదని ఏమీకూడా లేదని చెప్పారు. బహుశః వీరు Hackney Carriage Stands ను చూచి Cart stands అని పొరపడివున్నారేమో! అక్కడ స్టోన్ హౌస్ పేటలో ఒకటి, మూలపేటలో యింకొకటి, 2 Cart stands వున్నాయి. Shed వుంది. పశువులుత్రాగడానికి నీళ్లు వున్నాయి. సాధారణంగా Cart stand దగ్గరకు, Shed దగ్గరకూ పోయినందువల్ల 2 అణాలు పన్ను కట్టుకోవలసివచ్చుటచే వాళ్లు తమ బళ్లను ఏ రోడ్డు margin లోనో విప్పుకొని సరాసరిని వాళ్ల వూళ్ళకు పోతున్నారు. అప్పుడుగనుక Police వాళ్లమీద action తీసుకున్నట్లయితే వాళ్లు అక్కడ ఆపుచేయడం మానేసి Cattle stand లోకి తప్పకుండా వస్తారు. అప్పుడు అక్కడనే 2 అణాలు చెల్లిస్తారు. ఇప్పుడు నేను శంకరయ్యగారినైనా సరే, వేమయ్యగారినైనా సరే అడుగుతున్నాను. ఇప్పుడు నెల్లూరు వ్యాపారంకొఱకు వచ్చే బళ్లలో ఏ బండైనాసరే తిన్నగా Cattle stand కు

పోతుందా ? అక్కడకు పోతే డబ్బుకట్టాలనే భయంచేత వెళ్ళరు. వెళ్ళితే ఆ **contractors** కు ఆపేడ అమ్మకంవల్లకూడ డబ్బువస్తుంది. అక్కడకుపోతేనే పన్ను కట్టాలని లేకపోతే కట్టనక్కరలేదని శాసించినట్లయితే మునిసిపాలిటీకి ఒక దమ్మిడీకూడా ఆదాయంరాదు. అందువల్ల అక్కడ **cattle stands** లేవని చెప్పడం వారు సరిగా చూచివుండరేమోనని అనుకొంటున్నాను. **Hackney carriage stands** చూచి అవ్వే **cart stands** అనుకొంటున్నారేమో ! నెల్లూరు మున్సిపాలిటీలోయించుమించుగా 50 **cattle truffs** వున్నాయి. శంకరయ్యగారికి ఆ **cart stand** ఎక్కడవుందో, ఏమూలఏదిఉందో ఆయనచూశారోలేదో తెలియదు. వారు అట్లా ఎందుకు చెబుతున్నారో నాకేమీ అర్థంకావడంలేదు. ఇది వట్టి అబద్ధమని కూడా నేను చెప్పగలను. మా చుట్టుప్రక్కల గ్రామాలబండ్లు 15 రోజులు మేము మున్సిపాలిటీలో ఉండినప్పటికీ **contractor** ను ఆ పన్నులు వసూలు చేయమని మేము చెప్పలేదు. ఆ సంగతి వేమయ్యగారికి, శంకరయ్యగారికికూడా తెలుసును. కోవూరునుంచి, అల్లిపురంనుంచి, యిందు కూరుపేటనుంచి చాలబళ్లు వచ్చి ఉదయంనుంచి సాయంకాలం వరకు బాడుగ తోలుకొని మావి పల్లెటూరిబళ్లు, ఈవూరిబళ్లుకాదు, మేము **tax** కట్టక్కరలేదని చెప్పిపోతున్నారు. మా నెల్లూరులో బాడుగతోలుకొనే బళ్ల వాళ్లంతాకూడా పల్లెటూరిబళ్లు యిక్కడకువచ్చి బాడుగతోలుకొని పోతున్నాయి, వాళ్లుపన్నుకట్టుటలేదు, మేము ఎక్కువ పన్ను కట్టవలసివస్తోంది, అందుచేత మాకు పన్ను తగ్గించవలసిందని వాళ్లంతాకూడా ఒక **deputation** తీసికొని వచ్చారు. ఇప్పుడు వేమయ్యగారు, సుందరయ్యగారు ఆ ప్రజలందరిలోను మనం ఈవూరువచ్చాము, మనం 2 అణాలుపన్ను చెల్లించాలి కనుక చెల్లించేద్దాము అనే చైతన్యం కనుక తీసికొని వచ్చినట్లయితే యీ **rules** అన్నీ సక్రమంగా నడుస్తాయి. మనుష్యులే బూటకంగావుంటే **rules** కూడా బూటకమైపోతాయని నేను సుందరయ్యగారికి మనవి చేయుచున్నాను.

* **Sri VAVILALA GOPALAKRISHNAYYA** :— అధ్యక్షా ! ఇప్పుడు శ్రీ సుబ్బారెడ్డిగారు తమ అనుభవంలో పోలీసువాళ్ల సహాయం చేయడం లేదని చెప్పారు. ఊరిబయటకు వెళ్లేసరికి యమభటులుగా తయారౌతున్నారు. కాని మావూళ్ళో అనుభవం ఏమిటంటే 'ఇతని వెంట ఒక పోలీసువాడు యమ భటుడుగా తయారైవచ్చి పోలీసు అయిదు అణాలున్నూ, ఈ పంచాయితీ, మున్సి పాలిటీ కంట్రాక్టరు అణాయున్నూ వసూలు చేస్తున్నారు. అందుచేత యిదికూడా ఆలోచించి వాళ్లకు యిబ్బందిలేకుండా చేస్తారని నేను అనుకొంటున్నాను.

**Sri P. RAMACHARYULU** :—పొరుగూరినుంచి వస్తూ కాడివిప్ప కుండా ఆదారినపోయే బళ్లకు వసూలుచేయకుండా, కాడివిప్పినట్లయితే ఏదో కొంత వసూలుచేస్తూ వుండడం యీ సమస్యకు నివారణోపాయం అనుకుంటాను.

విరివిగా cart stands యేర్పాటుచేసి అక్కడ డబ్బు వసూలు చేస్తూ contractors కు యివ్వకుండా వుండడం అనేది యింకొక నివారణోపాయం.

**Sri P. KODANDARAMAYYA :—** మున్సిపాలిటీలలోను, పంచాయితీలలోనూ అయితే వసూలుచేయవచ్చు. మా పోలవరంలో పంచాయితీగాని, మున్సిపాలిటీగాని లేదు. కాని మావూళ్ళో పన్నులు వసూలుచేస్తున్నారు. దయ యుంచి వసూలుచేయించవద్దని కోరుతున్నాను.

**Sri S. VEMAYYA :—** మా మిత్రులు సుబ్బారెడ్డిగారు ఎక్కడైతే మేము చూడలేదని చెప్పారో అక్కడే నేను చూచాను. పూర్తిగా అన్నిచోట్లా లేవని నేను చెప్పలేదు, కాని చాలాచోట్ల యివి లేనేలేవు. పన్నులు మాత్రం వసూలు చేస్తున్నారు. రోజూ వస్తూపోతూ వుండేవారు కట్టనక్కరలేదా అంటే తప్పకుండా కట్టాలి. దానికి మనం ఒప్పుకు తీరవలసిందే. కాని మున్సిపాలిటీలోకి ప్రవేశించకుండానే ఆ గేట్ల దగ్గరే వసూలుచేసే సందర్భంలో నేను నా స్వంత విషయంలో చెప్పాను. అదివారు గుర్తించాలని నేను కోరుతున్నాను.

**The Hon. Sri A. B. NAGESWARA RAO:—** అధ్యక్షా, గౌరవ సభ్యులు చాలమంది చూచిన సంగతులు చాలాచెప్పారు. Municipality వారు వసూలుచేసే పన్నులలో మూడురకాల పన్నులు ఉన్నాయి. (1) పట్టణంలో నిలువవున్న బళ్లకు, చుట్టుప్రక్కల 2, 3 మైళ్లదూరంలో ఉన్నబళ్లకు పన్ను వేసే అధికారం చట్టరీత్యాఉంది. (2) పట్టణంలోకి రెండెడ్లబండ్లు వచ్చినట్లయితే cart stands లోనే ఆగాలి. ఆగనప్పుడు పన్నువసూలు చేస్తారు. (3) పల్లెటూళ్లనుంచి పట్టణంలోకి సరకు అమ్మకానికిగాని, లేకపోతే godowns కు గాని తీసుకువచ్చినపుడు Section 270 క్రింద పన్నువసూలుచేసే హక్కు ఉన్నది. ఇప్పుడు అనేకమంది సభ్యులు అనేకరకాలుగా మాట్లాడారు. మామూలుగా ఫిబ్రవరి లోనే Municipal Council general notification publish చేస్తుంది. ఆ notification లో double bullock cart stands రిక్షా stands, cart stands ఎక్కడెక్కడఉండేది publish చేస్తుంది. Commodities తో బండి వస్తేనే వచ్చినట్లయితే రోడ్డుమార్జిన్‌లో ఆగినపుడు, ఆ సరకుకు అమ్మినా, అమ్మకానికి చూపిన Section 270 క్రింద పన్నువసూలుచేసే హక్కు ఉన్నది. ఈ పన్ను వసూలుచేసే హక్కు contractors కు ఇస్తారు. మామూలుగా పట్టణంలోకి బండిరావడానికి 2, 3 మార్గాలు ఉండవచ్చు. పన్నులు వసూలుచేసే విషయంలో contractors అందరు ఏకీభవించరు. కొన్నిచోట్ల జబరుదస్తీ జరుగుతోందనికూడా నాకు తెలుసు.

బండి, బండి owner ను safe guard చేసేపూచీ Municipality కి ఉన్నది. ఇద్దరిని safe guard చేయాలి. అన్యాయంగా పన్ను వసూలుచేసినట్లయితే బండియజమాని ఆరశీదు తీసుకువెళ్ళి Commissioner కు చెప్పి ఇది illegal గా నాదగ్గర వసూలుచేయబడిందని complaint చేస్తే commissioner తప్పకుండ

విచారించి contractor ది గనుక తప్పయితే వ్రాతపూర్వకంగా contractor కు orders పంపించి అతనిచేత refund చేయిస్తాడు. అలాపంపించినప్పటికి contractor refund చేయకపోయినట్లయితే council కు అతని contract రద్దుచేసే హక్కు కూడా ఉన్నది. ఇట్లాగే రాజమండ్రి మ్యునిసిపాలిటీలో జబర్దస్తీచేస్తే ఒక అతని contract కూడా రద్దుఅయింది. Contract తిరిగి పాట పాడారు. రాజమండ్రి Municipality Contractor కేసు 270 Section క్రింద 5, 6 సంవత్సరాలనుంచి ఇప్పటిదాకా హైకోర్టులో దావా జరుగుతోంది. జబర్దస్తీ చేయమని ఏ Municipality చెప్పదు. ఈ పన్నులు వసూలుచేసే విషయంలో Section 270 క్రింద cart stand లోనికి బండ్లు వెళ్లాలి. అప్పుడు బండికి 2 అణాలు చొప్పున ఇవ్వాల్సివస్తుంది. లేకపోతే ఏ godown లో నైనా సరుకు దింపేస్తే ఆవాయము రాదు. పోలీసువాళ్లకు కూడా ఇందులో వాటాఉన్నట్లు గోపాల కృష్ణయ్య గారు చెప్పుతున్నారు. అదీ ఒక విషయంలోనే. Road Margin లో traffic obstruction ఉంటుంది. Cart Stand లో బండి ఆపమని enforce చేసిన రోజున Municipality బాగుపడుతుంది. Traffic obstruction లేకుండా ఉంటుంది. బండి యజమాని ఖర్చుపెట్టేది రెండణాలు, అదయినా బండివాడిచ్చుకోవలసిన అవసరంలేదు. సరకు యజమాని ఇచ్చుకొనే పద్ధతి ఉంది.

6 అణాలు అయినా ½ రు. అయినా ¼ రు. అయినా Section 270 క్రింద పురపాలకసంఘం notification లో schedule లో వేసినరేట్లు ప్రకారం ఎంత నిర్ణయిస్తే అంతే వసూలుచేయాలి. Cart Stands లో Sign board పెట్టాలని Municipality లు contractors కు orders జారీచేస్తుంది. ఆ sign board పెట్టకపోయినట్లయితే Municipality వారే ఆ sign board పెట్టి వారి దగ్గరనుంచి డబ్బు రాబట్టడానికి సావకాశం ఉంది. గడ్డిబండి అయినా సరకుబండి అయినా అమ్మకానికి వచ్చినట్లయితే Section 270 క్రింద పన్ను వసూలు చేయడానికి హక్కు ఉంది. దానిలోకూడా కొన్ని exemptions ఉన్నాయి. ఫలాన ఫలాన purpose కు గాని స్వంతానికి గాని, కట్టెపుల్లల బండిగాని నెత్తిమోపు బరువు గాని వీటన్నిటికి కొన్ని conditions పెట్టి వీటిని వసూలు చేయకూడదు అని ఉన్నది. వీటికి వసూలు చేస్తే Municipal Commissioner దగ్గరకు వెళ్లడానికి అవకాశం ఉంటుంది. ఇక regular గా half-yearly tax కట్టాలి.

*District Municipalities Act* లోని Sec. 99(1) లో: "Every person having possession, custody or control of any taxable carriage or animal shall be liable for the full half-yearly tax if the carriage or animal has been kept or used within the municipality for an aggregate period of not less than sixty days in the half-year.

(2) If such aggregate period does not exceed fifteen days, no tax shall be leviable for the half-year" అని ఉన్నది.

ఈ విధంగా rates ను fix చేసేహక్కు council కు ఉన్నది. Council మామూలుగా అర్థ సంవత్సరానికి 4 రూపాయిలు వసూలు చేయవచ్చు. ఆ ఊళ్లో ఉన్న బండ్లకి చుట్టుప్రక్కల 2, 3 మైళ్ల దూరములోఉన్న బండ్లకి ½ రు గాని ¼ వంతుగాని ⅓ వంతుగాని వసూలుచేసే హక్కు council కు ఉన్నది. వారిష్ట ము వచ్చినరేటు fix చేసుకోవచ్చు. బండికి అర్థ సంవత్సరానికి రూపాయి పన్ను ఉన్నట్లయితే వాటికి option ఇచ్చారు

అంతకన్న ఎక్కువ పర్యాయములు వచ్చినట్లయితేఈ excess tax Municipality pay చెయ్యాల్సిఉంటుంది. Municipality బండ్లు పంచాయితీలకు వెడితే tax pay చేస్తున్నవా, అంటారు Higher tax pay చేసినపుడు తక్కువ tax ను pay చెయ్యాల్సిన అవసరం ఉండదు. వీటన్నింటిమీద Government orders definite గా ఉన్నాయి. అమలు పరచటంలో లోటుఉంటే ఉండవచ్చు. ఇవన్నీ సక్రమంగా అమలు జరపడానికి ప్రభుత్వం తీవ్రంగా చర్యతీసుకొంటుందని మాత్రం మనవిచేస్తున్నాను.

End of the town నుంచి బండి బైలుదేరి అవతలి గ్రామానికి ఆగకుండా పోతోందో లేదో ఆ మనిషికి తెలియదు. ఎన్నిసార్లు వస్తోందోకూడా తెలియదు. అందువలన కొన్ని Municipality లలో మామూలుగా 2 అణాలు వసూలు చేయవచ్చునని ఉన్నది. ఆ మనిషిని ఆపి ఆ బండి ఎక్కడికి పోతుంది అని అడగ వలసి ఉంటే అది బండి వాని హృదయంమీద, contractors హృదయంమీద ఆధారపడి ఉంటుంది. జబర్దస్తీ లేదనడంలేదు, ఉంది. వాడు ఊళ్లోకి పోతోంది అంటే డబ్బుఇయ్యమంటాడు. లేకుంటే వదలిపెట్టడం ఉన్నది. బండి ఊళ్ళో ఆగకుండా అవతలకి పోతున్నట్లయితే tax వసూలు చెయ్యకూడదని Government orders ఉన్నాయి. ఆ orders కు వ్యతిరేకంగా ఏదైన volience ఉన్నట్లయితే, ప్రభుత్వం పురపాలక సంఘాలకు తగిన సలహాలుఇచ్చో, లేకమందలించో తప్పకుండా చర్యతీసుకొంటుందని మనవి చేస్తున్నాను. ఈ taxes వసూలు చేసే విషయంలో మాత్రం ప్రభుత్వముగాని, పురపాలకసంఘాలుగాని ఏవైనా అన్యాయంగా జబర దస్తీగా వాళ్లనెత్తికొట్టి అణన్నరో, రెండణాలో వసూలు చేసినంత మాత్రాన లాభంలేదు. ఇందులో ఒక కష్టమున్నది. ప్రతి బండి వెనకాల ఒక మనిషిని పంపించి cart stand లోకి వెడుతున్నదా లేదా అని చూచి cart stand లో ఆగినప్పుడే రెండణాలు వసూలుచెయ్యాలి అన్నది difficult problem. ఇదికూడా ప్రభుత్వం ఆలోచిస్తున్నది. 15 సార్లుకాదు, 15, 60 days గనుక వచ్చినట్లయితే a moiety of tax can be collected అని ఉన్నది. 15 days రాలేదు అనేట్ల యితే ఇంకో option కూడా ఉన్నది. Cart stand లోకి వెళ్లినప్పుడు రోజుకు 1½ అ. ఇచ్చేటట్లయితే ఎవడూ మాట్లాడేవాడు లేడు. రాజమండ్రిలో Section 270 క్రింద బండికి ½ రు. commodities అమ్ముడానికి తీసుకొని వచ్చినపుడు

లారీకి రు. 2 లు వసూలుచేస్తున్నారు. It all depends upon the councils. గౌరవసభ్యులు చేసిన సూచనలన్నీ కూడా పరిశీలిస్తాము. ఈ విషయంలో Government కూడా Village Headmen కు definite instructions ఇవ్వడం జరిగింది. 15 times అనిగాదు, 15, 60 days అని ఈ పట్టణంలో ఈ బండి అర్ధ సంవత్సరంలో ఇన్నిరోజులు వెళ్లింది అని Village Headman గనుక సంతకం చేసినట్లయితే అది valid గా తీసుకొని ఆ Municipal Commissoner value చెయ్యాలనికూడా ఉన్నది. వాటికికూడా instructions ఇచ్చాము.

Mr. SPEAKER :— The House will now adjourn and meet again at 9 A. M. on 2nd March, 1956.

The House then adjourned.

## IV. PAPER LAID ON THE TABLE OF THE HOUSE.

Acts and Rules—State Aid to Industries Act, 1922-Repayment of loan in monthly instalments—Amendment to Rules—issued. (G. O. Ms. No. 210, Industries, Co-operation and Labour dated 30th January, 1956).